


## జాతిరత్నాలకు పుట్టిల్లు

# దివ్య డైమండ్స్

AN ISO 9001: 2008 COMPANY

**బేగంపేట్ - కె.పి.హెచ్.బి - దుబాయ్**

92462 28899 9391011955 00971 55 861 6791




**ఇప్పుడు దుబాయ్‌లోనూ ప్రారంభమైంది.**

**మీ జాతక సమస్యలకు - జాతిరత్నాల కోసం సంప్రదించండి**

దివ్యడైమండ్స్ జాతిరత్నం ధరించి ఎందరో తమ సమస్యల నుండి బయటపడ్డారు.

**దివ్యడైమండ్స్‌లో అందుబాటులో ఉన్న సేవలు**

* మీ జాతకం పరిశీలించుకోవడానికి **ఆస్ట్రాలజీ డిపార్ట్‌మెంట్**
* జాతకపర సమస్యలను తొలగించుకోవడానికి జాతిరత్నాలు దొరికే - **షోరూమ్**
* మీరు ధరించింది జాతిరత్నమా? నకిలీరత్నమా? తెలియజెప్పే **జెమ్ టెస్టింగ్ ల్యాబ్** (భారతదేశంలో 1 st ISO 9001: 2008 గుర్తింపు పొందిన ల్యాబ్)
* ప్రతి రత్నాన్ని ప్యూరిఫై చేసి మరియు ఎనర్జైస్ చేసి అందిస్తున్న ఏకైక సంస్థ

ఏ సమస్యతో బాధపడుతున్నా దివ్యడైమండ్స్‌కి విచ్చేసి, జాతకం చూపించుకొని సర్టిఫైడ్ 'దివ్యరత్నం' ధరించండి!

**ఆర్థిక సమస్యలా?**
**శారీరక సమస్యలా?**
**మానసిక సమస్యలా?**
**విద్యా సమస్యా?**
**వివాహ సమస్యా?**
**సంతాన సమస్యా?**

మీ సమస్యను వివరిస్తూ రు. 350/- డి.డి. జతపరిస్తే మీ జాతకచక్రం పోస్టు ద్వారా పంపగలం.

# DIVYA DIAMONDS

Origin for Gennuine, Certified, Effective, Energized & Purified gems

# 1-10-9/2, ఫ్లై ఓవర్ పక్కన,
బేగంపేట్ మెయిన్‌రోడ్, హైదరాబాద్-16.
ఫోన్: 27766776, మొబైల్: 9246 22 88 99

# ఎమ్.ఐ.జి.- 347, కళానికేతన్ పక్కన,
కె.పి.హెచ్.బి. మెయిన్ రోడ్, కూకట్‌పల్లి, హైదరాబాద్-72.
ఫోన్: 23055678, మొబైల్: 988 5000 285.

పోస్ట్‌బాక్స్: 51305, మీనబజార్- అల్ ఫహిది, షాప్ నెం.5, బర్ దుబాయ్, దుబాయ్-యు.ఎ.ఇ.
ఫోన్: + 971 4 3557879, మొబైల్: 055-6212290/ 055-56212290, ఇంటర్నేషనల్: +91 988 5000 285

సంపుటి -34, సంచిక - 12
408వ సంచిక, పేజీలు : 132
జనవరి 2012

# చతుర





'రంగా! పెద్దయ్యాక ఏమవుతావు?' అడిగాడు కొడుకును గజదొంగ రామకోటి. 'దొంగనవుతాను' ఠక్కున చెప్పాడు కొడుకు. 'ఎందుకూ? పోలీసు కావాలని లేదా?' అడిగాడు రామకోటి. 'దొంగ అయితే బోలెడు డబ్బులుంటాయ్!' అన్నాడు కొడుకు. 'మరి మనూరిలో దొంగలందరి దగ్గరా డబ్బులు లేవేం?' 'అలాగా? కానీ పోలీసులేం మంచోళ్లు కాదు.. ఊర్లోవారిని ఉత్తినే పట్టుకెళ్లి కొడుతుంటారు' 'ఉహూ.. నువ్వు దొంగల్ని పట్టుకునే పోలీసు కావాలి' అన్నాడు తండ్రి అనునయంగా. ఆ తర్వాత కథేమిటి? పోలీసులు ఆ ఊరివాళ్లనెందుకు పట్టుకెళుతుంటారు? కన్నకొడుకు పెద్దఆఫీసర్ కావాలనుకున్న ఆ దొంగ కల నెరవేరిందా? పోలీసులు- దొంగల మధ్య సంబంధాన్ని వాస్తవికంగా చిత్రించిన **పుట్టగంటి గోపీకృష్ణ** నవల

**పులిజూదం**

**చతుర నూతన సంవత్సర కానుక!**

6వ పేజీలో...

బొమ్మలు : భాస్కర్



# 2012 లో వేద నిలయము వారి
# భారతదేశంలోని తీర్థయాత్రలు
# పుణ్యభూముల సందర్శనం



## శృంగేరి యాత్ర

గోకర్ణము, మురుదేశ్వర్, మూకాంబిక, ఉడిపి, ధర్మస్థల, హోరనాడు, శృంగేరి

4 రోజుల యాత్ర , రూ. 4,500/- బస్సు ప్రయాణం.

యాత్ర తేదీలు : 13/1,10/2,8/3,13/4,11/5,8/6, 13/7,10/8,14/9,9/10,9/11,14/12

## తమిళనాడు దర్శన్

వెల్లూర్, తిరుత్తని, కంచి, పాండిచ్చేరి, నవగ్రహ దేవాలయాలు, తిరువెంకాడ్, తిరుచ్చి, మధురై, కుర్తాళం, రామేశ్వరం, కన్యాకుమారి, శుచేంద్రం, త్రివేండ్రం.

7 రోజుల యాత్ర , రూ.11500/- రైలు, బస్సు ప్రయాణం.

యాత్ర తేదీలు : 13/1,10/2,8/3,13/4,11/5,8/6,13/7,10/8,14/9,9/10,9/11,14/12

## మహారాష్ట్రా దర్శన్ అష్ట గణపతులు

షిరిడి, తుల్జాపూర్, కొల్హాపూర్, అక్కల్‌కోట్, 4 జ్యోతిర్లింగాలు

7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 12500/-

యాత్ర తేదీలు : 13/1,10/2,8/3,13/4,11/5,8/6, 13/7,10/8,14/9,9/10,9/11,14/12

## హిమాలయ దర్శన్

బాగేశ్వర్, బైద్యనాథ్, పాతాళభువనేశ్వర్, బేరీనాగ్, జాగేశ్వర్, రానీకేత్, నైనితాల్. ఈ క్షేత్రముల యందు సాక్షాత్తు దేవతలు ప్రత్యక్షమగును.

రైలు, బస్సు, 10 రోజుల యాత్ర. ఖర్చు రూ. 16000/-

యాత్ర తేదీలు : 12/1,9/2,8/3,12/4,10/5,7/6,12/7,10/8,14/9,9/10,9/11,13/12

## గుజరాత్ దర్శన్ సోమనాథ్, నాగేశ్వర్

పంచద్వారకలు, గోపితలాప, మాతృగయ, జామ్‌నగర్, పోరుబందర్

7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ.14,000/-

రాజ్‌కోట్ వరకు రైలు అక్కడ నుండి బస్సు. యాత్ర తేదీలు : 17/1,7/2,21/2,6/3,20/3,3/4,17/4,8/5,22/5,5/6,19/6,3/7, 24/7,7/8,21/8,4/9,25/9,9/10,23/10,6/11,27/11,11/12,25/12

## కేరళ యాత్ర

కాలడి, చోటాకినారా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల దేవాలయాలు గురువాయూరు, అలిపి, మున్నార్, త్రివేండ్రం, కన్యాకుమారి

9 రోజుల యాత్ర , రైలు, బస్సు ఖర్చు రూ. 18000/-

యాత్ర తేదీలు : 21/1,11/2,11/3,8/4,13/5,10/6,8/7,12/8,9/9,7/10,11/11,9/12

## ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర

ఉజ్జయిని, హర్షవర్ధినిదేవి (శక్తిపీఠం), ఓంకారేశ్వర్, మహేశ్వర్, జ్యోతి ర్లింగములు, ఆంజనేయస్వామి దేవాలయం, పార్వతి దేవాలయం

4 రోజుల యాత్ర , రైలు, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 5500/-

యాత్ర తేదీలు : 22/1,5/2,19/2,11/3,1/4,22/4,13/5,27/5,10/6,24/6,8/7, 22/7,5/8,19/8,9/9,23/9,7/10,21/10,4/11,25/11,12/12,23/12

## సమస్యా పరిష్కార యాత్రలు

మీ జాతక రీత్యా ఎటువంటి సమస్యలకైనా పరిష్కారము పొందుటకు చేయవలసిన యాత్రలు విద్యా, ఉద్యోగ, వివాహ, వ్యాపార, ఆర్థిక, కుటుంబ , కోర్టు వ్యవహారాలు , ఆరోగ్య సమస్యలు పరిష్కారానికి ప్రత్యేక యాత్రలు

## ఒరిస్సా, బెంగాల్, అస్సాం దర్శన్

పూరి, సాక్షిగోపాలం, కటక్, భువనేశ్వర్, గిరిజాదేవి, కాళీమాత దేవాలయం, గంగాసాగర్, చందాసాగర్, తారకేశ్వర్, పక్షేశ్వర్, శాంతినికేతన్, బ్రహ్మపుత్రానది, ఉమావందా దేవాలయం, పీకాక్ ఐలాండ్ , కామాఖ్యా దేవాలయం.

12 రోజుల యాత్ర. రూ. 18000/- , రైలు, బస్సు ప్రయాణం.

యాత్ర తేదీలు : 12/1,9/2,8/3,12/4,10/5,7/6,12/7,10/8,14/9,9/10,9/11,13/12

## కాశీ - 5,500/-
## కాశీ, గయ, ప్రయాగ :

కాశీయందు పిండప్రదానం చేయు వారికి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి జిల్లాకు చెందిన ఋత్వికులచే తీర్థ కార్యక్రమాలు జరుపుకొనే సౌకర్యం కల్పించబడును. 6 రోజుల యాత్ర. రూ. 7,500/- (భోజనములు కాక)

రైలు, బస్సుప్రయాణం. యాత్ర తేదీలు : ప్రతీరోజు

## నర్మదా నది పుష్కర యాత్ర - ఓం కారేశ్వరానికి

(17-5-2012 నుండి 28-5-2012 వరకు)

మధ్యప్రదేశ్‌లో కంటక పర్వత ప్రాంతంలో జన్మించింది. ఈ నదిలో స్నానం చేసి, తీర్థవిధులు నిర్వహిస్తే వందతరాల తమ పూర్వీకులు పవిత్రులు అవుతారు.

టికెట్లు బుకింగ్ మొదలైనది

## వేద నిలయము జ్యోతిష్య కేంద్రము

నిష్ణాతులైన జ్యోతిష్య శాస్త్ర వేత్తలచే జాతకము క్షుణ్ణంగా పరిశీలించి మీకు అవసరమైన పరిష్కార మార్గాలు సూచిస్తారు. విద్యా, ఉద్యోగము, వివాహము, సంతానము, ఆర్థిక, వ్యవహారాలు, కుటుంబ విషయాలు, విదేశీ ప్రయాణాలు, వ్యాపారాభివృద్ధి మరియు ఏ సమస్యలకైనా ఖచ్చితమైనపరిష్కార మార్గాలు సూచించగలిగిన కేంద్రము .

ముషిరాబాద్, హైదరాబాద్ నందు, జి.హెచ్.ఐ.ఎల్. ఎం.ఐ.జి. -1536 (ఫేజ్ - I) నందు ఫోన్: 27547708 / 09, 98850 89092

వివరాలకు :





**దంటు నాగార్జున శర్మ, వేద నిలయం. ఇంప్రింట్ ట్రావెల్స్ & టూర్స్**

ఫ్లాట్ నెం. 504, సంయుక్తా అపార్ట్‌మెంట్స్, అంబాలికా ఫర్నిచర్ పైన, రాజా డీలక్స్ ఎదురుగా, ముషీరాబాద్, హైదరాబాద్ - 20. ఫోన్ : 040 – 2754 7708/2754 7709, సెల్ : 98850 89092

# పిడివాదం



- పుట్టగంటి గోపీకృష్ణ



చిన్నప్పటి నుంచి కలెక్టర్ కావాలనుకుని ఎంతో కష్టించి చదువుకున్న అత్యుత్తమ విద్యార్థి పాండురంగ. జిల్లా కలెక్టర్‌కు అర్హులైన అభ్యర్థులపై ఓ రిపోర్టు ఇవ్వాల్సిందిగా ఆ ఏరియా పోలీస్ అధికారికి ఓరోజు ఉత్తరం వచ్చింది. తమ కుటుంబ గతచరిత్ర తన భవిష్యత్తుపై చీకటి కమ్మేస్తుందని పాండురంగ భయపడ్డాడు. అంతలోనే అనూహ్యంగా ఓ నేరంలో చిక్కుకున్న అతడు మూడేళ్లపాటు జైలు పాలయ్యాడు. ఇంతకీ పాండురంగ ఎందుకు జైలుకెళ్లాడు? అతడి కుటుంబ చరిత్ర ఎలాంటిది? జైలునుండి విడుదలైన పాండు జీవితం ఎలాంటి మలుపులు తిరిగింది? ఆద్యంతం ఉత్కంఠగా చదివించే

పుట్టగంటి గోపీకృష్ణ నవల **పులిజూదం**

చతుర నూతన సంవత్సర కానుక!

ఉరుములు, మెరుపులతో వాన మొదలయింది.

జైలు గదిలో ఒకమూల ముడుచుకుని పడుకున్న పాండురంగకి హఠాత్తుగా మెలకువ వచ్చింది.

బద్ధకంగా మరొక పక్కకు తిరిగి పడుకున్నాడు. అతని గదిలోని మరొక ఖైదీ పెడుతున్న గురక గట్టిగా వినిపిస్తోంది. చెవి దగ్గర చేరిన దోమలు రొద పెడుతున్నాయి. వాటిని తోలటానికి గట్టిగా చేతిని విదిలించాడు. పక్కకి పోయినట్లే పోయి క్షణాల్లోనే మరలా ప్రత్యక్షం అయ్యాయి అవి.

ఇక తనకు నిద్ర పట్టదని అతనికి అర్థమయింది. తెల్లవారటానికి ఇంకా చాలా సమయం ఉంది.

నెమ్మదిగా లేచి సెల్ తలుపు దగ్గరకు వచ్చి, ఇనుప చువ్వల మధ్య నుండి బయటకు చూస్తూ కింద కూర్చున్నాడు.

కారిడార్లో కాపలా కాస్తూ అటూ ఇటూ తిరుగుతున్న సెంట్రీ బూట్ల చప్పుడు క్రమక్రమంగా దగ్గరయింది.

అతను మెలకువతో ఉండటం చూసి ఆగాడు సెంట్రీ.

సెల్ లోపల ఉన్న పాండుని పరీక్షగా చూశాడు.

అతని వయసు పాతిక సంవత్సరాలు ఉండవచ్చు. కళ్ళు చురుగ్గా, తీక్షణంగా చూస్తున్నాయి. బిరుసుగా ఉన్న జుట్టు వంకీలు తిరిగి ఉంది. ముక్కు తిన్నగా, గడ్డం దృఢంగా ఉండి చూడగానే ఆకర్షణీయంగా ఉన్నాడు.

"ఏంటీ... నిద్ర పట్టటం లేదా? " పలకరించటానికి ఏదో ఒకటి మాట్లాడాలన్నట్లు అడిగాడు సెంట్రీ.

సమాధానంగా చిన్నగా నవ్వాడు పాండు.

"జైలుకు వచ్చి రెండేళ్ళు కావటంలా? ... ఇంకా జైలు జీవితం అలవాటు కాకపోతే ఎలా? " కొద్దిగా సానుభూతి మిళితమయిన స్వరంతో అడిగాడు.

"నా సంపాదన మొత్తం లాక్కుని సర్దుకుపొమ్మంటే.. పోనీలెమ్మని సరిపెట్టుకో వచ్చు! నా జీవితం నుండి ముఖ్యమయిన మూడేళ్ల కాలాన్ని లాక్కుని సరిపెట్టుకోమంటే ఎలా సర్దుకుపోవాలో ఇంకా అర్థం కాలేదు"

ఏమి చెప్పాలో అర్థం కాలేదు సెంట్రీకి. తరువాత కూడబలుక్కున్నట్లు చెప్పాడు. "మొదట్లో అందరికీ అలాగే ఉంటుంది. కానీ... అలువాటుపడిపోతారు. ఆఖరికి యావజ్జీవ శిక్షపడిన ఖైదీ కూడా ఇక్కడి పరిస్థితులతో సహజీవనం చెయ్యటం నేర్చుకుంటాడు. ఎవరైనా జోక్ చెప్తే నవ్వుతాడు. ఎవరికైనా బాధకలిగితే, తను కూడా పంచుకోవాలని చూస్తాడు. అంతే కానీ... అర్ధరాత్రి నిద్రలేచి శూన్యంలోకి చూస్తూ కూర్చోడు. అదికూడా.. విడుదల సమయం దగ్గర పడుతున్నపుడు..."

బయట జల్లు పెద్దదయింది. చినుకులు గాలిధాటికి లోపల వరకు వస్తున్నాయి. తడవకుండా ఉండటానికి ఇంకాస్త సెల్ వైపు జరిగాడు సెంట్రీ.

జేబులో నుండి సిగరెట్ తీసి వెలిగించి... మరొక సిగరెట్ పాండు వైపు చాపాడు, ఆఫర్ చేస్తున్నట్లు.

వద్దనట్లు తల అడ్డంగా ఊపాడు పాండు.

"నిన్ను చూస్తుంటే జాలి వేస్తుంది. చదువుకున్న వాడిలాగా ఉన్నావ్.. ఏం చదువుకున్నావేమిటి? "

"పెద్దగా ఏమీ చదవలేదు.." ముక్తసరిగా సమాధానం చెప్పి ఊరుకున్నాడు.

పదిగంటలు డ్యూటీ చేసి, ఇంటికి వెళ్లి పెళ్ళాం వండిన వేడి వేడి పకోడీలు ఊదుకుంటూ తినటానికి ఎదురు చూస్తున్న ఆ

సెంట్రీకి.. తనతో చేస్తున్న సంభాషణ కూడా కాలక్షేపం పకోడీలకంటే ప్రత్యేక మైనదేమీకాదని అతనికి తెలుసు. అందుకే అంతకంటే ఏమీ చెప్పలేదు.

"ఇంతకీ.. ఏమి నేరం చేశావేమిటి?" అని అడిగి మరలా తనే, "మూడేళ్ళ శిక్ష పడిందంటే, ఏదో పెద్దనేరమే అయి ఉంటుంది!" అంటూ తీర్మానించాడు.

తలెత్తి సెంట్రీవైపు చూశాడు పాండు.

సిగరెట్ పొగని రింగులు రింగులుగా ..కురుస్తున్న వానలోకి వదులుతున్న సెంట్రీ కూడా అప్పుడే యథాలాపంగా అతని కళ్ళలోకి చూశాడు. అప్పటి వరకూ సెల్‌కి దగ్గరగా ఉన్న సెంట్రీ అనియంత్రితంగా కొద్దిగా దూరం జరిగాడు.. ఆ కళ్ళలోని తీక్షణతకి.

"ఏంటా చూపు? సమాధానం చెప్పకుండా? .." తెచ్చిపెట్టుకున్న కోపం ప్రదర్శిస్తూ అన్నాడు సెంట్రీ.

"నాకు తెలియదు..."

"తెలియదా?" చేతిలో ఉన్న సిగరెట్ ఆఖరి దమ్ములాగి వానలోకి విసిరివేస్తూ కోపంగా అన్నాడు. "ఇష్టం లేకపోతే చెప్పకు. అంతేకానీ... నువ్వు చేసిన నేరం నీకే తెలియదంటే విని నమ్మటానికి నేనేమన్నా వెర్రి వెధవనా..." అంటూ డ్యూటీ కొనసాగించటానికి ముందుకు సాగిపోయాడు.

నిజమే! ఎవరూ నమ్మరు. తనెందుకు అక్కడ ఉన్నాడో తనకే తెలియదంటే హాస్యాస్పదంగానే ఉంటుంది. కానీ.. అది నిజం!.. అదే నిజం!! అనుకున్నాడు పాండురంగ.

నిజం అన్నది చాలా చిత్రమైనది. మనం చెప్పేది నిజమా, కాదా అన్నది... మన మాటలలోని నిజాయతీ మీద కంటే, మనమీద ఎదుటి వ్యక్తికి ఉన్న నిబద్ధత మీద ఎక్కువ ఆధారపడి ఉంటుంది.

పాండురంగ బాల్యం ఈ సత్యం తెలియటంతోనే మొదలయింది.

★ ★ ★

'నేను దొంగతనం చెయ్యలేదూ..' అని ఎంత మొత్తుకున్నా అతని ఊరిలోనివారి మాట ఏ పోలీసూ నమ్మేవాడు కాదు.

పెద్ద పెద్ద దొంగతనాలు చేసే వారినందరిని కొన్ని కొన్ని సెటిల్‌మెంట్లు అనబడే క్యాంపుల్లో ఒక్కచోటే చేర్చటం ద్వారా వారి కదలికలు కనిపెట్టటం, వారి మీద నిఘా పెట్టటం తేలిక. అందుకే... ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం అలాంటి సెటిల్‌మెంటులను దేశంలో అక్కడక్కడా ఏర్పరిచింది. అవే ఇపుడు ఊర్లుగా మారాయి. అలాంటి ఊర్లు ఆంధ్రరాష్ట్రంలో అక్కడక్కడా ఉన్నాయి. అందులో పాండురంగ ఊరు కూడా ఒకటి.

ఎక్కడ ఏ పెద్ద దొంగతనం జరిగినా... ఇప్పటికీ ఇలాంటి ఊర్ల ప్రస్తావన అటు పోలీసు వర్గాల్లోనూ, ఇటూ రాష్ట్ర ప్రజల్లోనూ చర్చకు వస్తూనే ఉంటుంది.

అలాంటి ఊర్లన్నింటిలో పాండురంగ ఊరు బాగా పేరు పడింది. కాలక్రమేణా ఆ ఊర్లో కూడా అన్ని వృత్తులవారూ చేరారు. చాలామంది దొంగతనాలు మాని వేశారు. మరికొంత మంది పోలీసుల బాధలు పడలేక ఆ ఊరు వదలి దూర ప్రాంతాలకు తరలిపోయారు.

దొంగల పునరావాసం కోసం ప్రభుత్వం కేటాయించిన భూములు అన్యాక్రాంతమైపోయాయి. ఉన్న భూములు కూడా వ్యవసాయానికి అనువైనవి కావు. సముద్రానికి దగ్గరగా ఉండటంవల్ల ఆ భూముల నుండి పంట పండించాలంటే.. చాలా కష్టపడాలి.

అందుకే ఇంకా కొంతమందికి కులవృత్తి అనబడే చోరవృత్తే బతకటానికి అనువుగా కనిపిస్తుంది.

అందులో ప్రముఖుడు పాండురంగ

తం(డి రామకోటి.

పాండురంగ పుట్టేటప్పటికి అతని తం(డి జైలులో ఉన్నాడు. అతనికి ఊహ వచ్చేవరకూ తం(డి జైలునుండి విడుదల కాలేదు. అందుకే చిన్నతనంలో అతనికి తం(డితో పెద్దగా పరిచయం ఏర్పడలేదు.

పాండురంగకి ఎక్కువ తల్లి పోలికలు వచ్చాయి. ఆ చురుకైన కళ్ళు అమాయకపు చూపులు చూసేవి. కు(రవాడి పోషణ భారం అంతా వాడి తల్లే చూసుకునేది. ఆమె పేరు కాంతం. ఆ ఊర్లో ఆమె అంత అందగత్తె లేదని అనుకునేవారు. వారుండే గుడిసెకు మైలుదూరంలో వారికి అరెకరం పొలం ఉండేది. దానిలో ఆమె కనకాంబరాలు, మరువం పండించేది. పొలానికి దూరంగా ఇసుక చెలమల్లో ఊరే నీటిని బిందెల్లో తెచ్చి ఒక్కొక్క మొక్కకి పోసేది. అది వ్యవసాయం చేస్తున్నట్లు ఉండేది కాదు. తపస్సు చేస్తున్నట్లు ఉండేది. అక్వేరియంలో చేప పిల్లలను పెంచినట్లు.. పొలంలో ఒక్కొక్క మొక్కని పెంచేది ఆమె. వాటి మీద వచ్చే ఆదాయంతో ఇల్లు గడిచేది.

అదికాక ఆమె చాలా పనులే చేసేది. రేగుకాయలూ, తేగలూ, తాటిముంజలూ, మొక్కజొన్న పొత్తులూ.. అన్నీ ఆమె వ్యాపార వస్తువులే! ఏ సీజన్‌లో దొరికే వాటిని ఆ సీజన్‌లో పక్కనే ఉన్న టౌనుకు తీసుకువెళ్ళి అమ్ముకు వచ్చేది. అలా వచ్చిన డబ్బులతో రెండు రోజులకొకసారి ఎండు చేపా... వారానికొక సినిమా కొడుక్కి అందించేది.

ఆమెకున్న ఒకే కోరిక- కొడుకుని బాగా చదివించాలి. వాడు చదువుకుని ఏదన్నా ఉద్యోగం సంపాదించుకోవాలి. అలా ఆ ఊరినుండి దూరంగా వెళ్ళిపోవాలి.

ఎవరికయినా కన్నకొడుకు తమతో ఉండాలని ఉంటుంది. మరి తన తల్లి తనను దూరంగా ఎందుకు పంపాలనుకుంటుందో పాండురంగకి మొదట్లో అర్థమయ్యేది కాదు.. విడుదలై వచ్చి వాడి నాన్న వివరించి చెప్పేవరకూ!

అలా తల్లి పెంపకంలో... తం(డి పరిచయం లేకుండా పెరిగాడు పాండు.

అయితే తం(డి జైలులో ఉన్నా... అతను ఆ ఊర్లో నలుగురి నోళ్ళలో ఎప్పుడూ నానుతూనే ఉండేవాడు. అతని వీరగాధలనబడే చోరగాధలను కు(రవాళ్ళు మళ్ళీ మళ్ళీ చెప్పుకుంటుండేవారు. ఆ ఊర్లో తం(డికి లభిస్తున్న గౌరవం చూస్తే పాండుకి కాస్త గర్వం కూడా కలిగేది.

గజదొంగ రామకోటి అంటే ఒకప్పుడు రాష్ట్రమంతా హడలిపోయింది. (పఖ్యాత దేవాలయాల్లో వి(గహాల దగ్గర నుండి... బొంబాయి సేట్ల ఇళ్ళలో ఇనప్పెట్టెల్లో దాచిన వ(జాల వరకూ... అతను చెయ్యని దొంగతనం లేదు.

రామకోటి దొంగతనాలు చేసినన్ని రోజులూ పోలీసులు అతన్ని పట్టుకోలేకపోయారు. అసలు ఆ దొంగతనాలు చేస్తోంది ఎవరో కూడా వారికి తెలియలేదు.

అయితే అతన్ని మార్చింది కాంతం మీద (పేమ. కాంతం కూడా దొంగల కుటుంబం నుండి వచ్చిందే! అయినా ఆమెకు మొదటినుండి దొంగతనాలంటే అసహ్యం. ఉంటే తినాలి.. లేకుంటే పస్తుండాలి! అంతేకానీ.. మనదికాని సొమ్ముకు ఆశపడకూడదన్నది ఆమె సిద్ధాంతం.

అందుకే తన అందానికి దాసోహమై.. రామకోటి తనను పెళ్ళి చేసుకోవటానికి ముందుకు వచ్చినపుడు, ఆమె ఒక షరతు పెట్టింది. అదేమంటే అతను దొంగతనాలు మానివెయ్యాలనే.

పెద్దగా ఆలోచించకుండానే రామకోటి ఆ షరతుకు ఒప్పుకున్నాడు. ఒప్పుకోవ





టమే కాదు.. తన మాట మీద నిలబడ్డాడు. ఆ తరువాతే కాంతంతో అతని పెళ్ళి జరిగింది.

నెమ్మదిగా రామకోటి వివరాలు పోలీసులకు తెలియసాగాయి. దానితో అతని పెళ్ళి జరిగిన కొన్ని రోజులకే.. మొదటి సారి అతను అరెస్టు అయ్యాడు. మొత్తం ఎనిమిది సంవత్సరాల శిక్ష పడింది. అప్పటికే కాంతం గర్భవతి. అలా తండ్రి జైలులో ఉండగా పుట్టాడు పాండు.

ఇన్నాళ్ళకు ఇప్పుడు రామకోటి విడుదలయి రావటంతో ఆ ఊర్లో పండుగ వాతావరణం నెలకొంది. ఊర్లో ఇప్పటికీ అతన్ని చాలా మంది తమ గురువుగా భావిస్తూనే ఉన్నారు. అతను విడుదల కావటంతో తమకు ఒక అండ లభిస్తుందనుకున్నారు వారందరూ! అయితే రామకోటికి మరలా దొంగతనాల జోలికి వెళ్ళే ఉద్దేశం లేదని తరువాత తెలిసింది వారికి. ఊర్లో ఈ మధ్య పోలీసుల వేధింపులు మరీ ఎక్కువయ్యాయి. రాష్ట్రంలో ఎక్కడ ఏ భారీ దొంగతనం జరిగినా పోలీసుల దృష్టి ముందుగా ఈ ఊరి మీదే పడసాగింది. ఊరిమీద పడి అనుమానం ఉన్న వారినందరినీ పట్టుకుపోతున్నారు. అసలు దొంగలు త్వరగా దొరికితే అది వీరి అదృష్టం. లేకపోతే పట్టుకుపోయిన వారినందరినీ స్టేషన్ లోపల పడేసి గొడ్డును బాదినట్లు బాదుతారు.

అలాంటప్పుడు ఊరు ఊరంతా శోకాల్తో నిండిపోతుంది. సగం ఊరు పోలీసుస్టేషన్ ముందు బైఠాయిస్తుంది. ఎప్పటికో వారందరినీ వదులుతారు. అప్పుడు వారిని మోసుకుంటూ ఊరిలోకో.. మరీ దెబ్బలు ఎక్కువ తగిలితే ఆసుపత్రి వైపో వెళ్ళిపోవడం రివాజు.

సంవత్సరాలు గడుస్తున్నా వారి జీవన విధానంలో మార్పేమీలేదు.

అలాంటి పరిస్థితుల్లో విడుదలయి వచ్చాడు రామకోటి. అతడు పెద్ద ప్రత్యేకంగా ఏమీ ఉండడు. కండలు తిరిగిన శరీరం కాదు. సన్నగా, పీలగా.. నిక్కబొడుచుకున్న జుట్టుతో ఉండేవాడు. చూసిన వారికి అతను అంత పెద్ద దొంగ అంటే నమ్మబుద్ధికానట్లు ఉండేవాడు. అతని శరీరం ఎంత సన్నని చువ్వల మధ్య నుండి అయినా దూరిపోతుందంటారు. అతని వేళ్ళు తెరవలేని ఇనపెట్టె లేదనీ చెప్తారు.

తనని ఆదర్శంగా తీసుకుని ఎక్కడ తన కొడుకు కూడా తనలాగే తయారు కావటానికి ప్రయత్నిస్తాడో.. అనుకున్న రామకోటి ఒక రోజు కొడుకుని తీసుకుని ఊరి బయటకు వెళ్ళాడు.

ఇద్దరూ కొద్ది ఎత్తుగా ఉన్న గుట్టమీద కూర్చున్నారు.

దూరంగా కొండల్ని రాసుకుంటూ వెళ్తున్న మబ్బులూ.. మబ్బుల్ని అందుకోవటానికి అన్నట్లు పైకెగురుతున్న కొంగలూ... పొలాలను చీల్చుకు ముందుకు వెళ్తున్న రైలుబండీ... పరిసరాలను ఆహ్లాదంగా మారుస్తున్నాయి.

"రంగా" మార్దవంగా పిలుస్తూ, "నువ్వు పెద్దయ్యాక ఏమి అవుతావు? " అన్నాడు రామకోటి.

అసలే అమాయకంగా ఉండే పాండు రంగ మొహం ఏమీ అర్థం కానట్లు ఇంకా అమాయకంగా మారింది.

"పెద్దయ్యాక దొంగ అవుతావా? .. పోలీసు అవుతావా? " పిల్లవాడికి అర్థమయ్యే భాషలో అడిగాడు.

"దొంగనవుతాను.." టక్కున సమాధానం వచ్చింది ఈసారి.

అనుకున్నదే అయినా ఆ సమాధానం రామకోటిని నిరుత్సాహపరిచింది.

"ఎందుకూ? .." గొంతులో కోపం

ధ్వనించకుండా అడిగాడు.
"దొంగ అయితే బోలెడు డబ్బులుంటాయ్!..."
నవ్వాడు రామకోటి.
"మరి మన ఊరిలో దొంగలందరి దగ్గరా డబ్బులు లేవేం? ..."
ఏం చెప్పాలో తెలియక మౌనంగా ఉండిపోయాడు పాండు. కాసేపు ఆలోచించి, "...పోలీసులు మంచివాళ్ళు కాదు.. మనల్ని కొడతారు.." అన్నాడు.
"మీ అమ్మ అప్పుడప్పుడూ నిన్ను కొడుతుందా? .."
అవునన్నట్లు తల ఊపాడు పాండు.
"ఎందుకు? "
"తప్పు చేస్తే.." తలవంచుకుని చెప్పాడు.
"దొంగతనం చెయ్యటం తప్పు. అందుకే దొంగల్ని పోలీసులు కొడతారు"
జీవితమంతా భూమి బల్లపరుపుగా ఉందని నమ్మిన మత ప్రవక్త.. తను నమ్మింది తప్పు అని నిరూపించిన శాస్త్రవేత్తవైపు చూసి ఎంత ఆశ్చర్యపోతాడో.. అంత ఆశ్చర్యపోయాడు పాండు.
"నువ్వు తప్పు చెయ్యకూడదు. దొంగతనం అసలు చెయ్యకూడదు. నువ్వు దొంగల్ని పట్టుకునే పోలీసు కావాలి.."
అపనమ్మకంగా తలాడించాడు పాండు.
"మరి నేను ఎందుకు దొంగతనాలు చేశానని నీకు అనుమానం రావచ్చు. అవును.. నేను తప్పు చేశాను. ఆ తప్పు నువ్వు చెయ్యకూడదు. ఇప్పుడు నేను మారాను. ఇక దొంగతనాలు చెయ్యను. దొంగతనాల ద్వారా డబ్బు రాదు. అలా వచ్చేటట్లయితే.. నా దగ్గర ఎంత డబ్బు ఉండాలి? పాపపు సొమ్ము వచ్చింది వచ్చినట్లే పోతుంది. అందుకే నువ్వు బాగా చదువుకో! అప్పుడు పోలీసు కావచ్చు. అంతేకానీ.. ఎప్పుడూ దొంగతనాలు చెయ్యననీ, చెడుదారులు తొక్కననీ.. నాకు మాట ఇవ్వు!"
తండ్రి చెప్తున్న మాటలు పూర్తిగా అర్థం కాకపోయినా... అతనికి ఒకటి మాత్రం బాగా తెలిసింది- తను బాగా చదువుకోవాలని తండ్రి కోరుకుంటున్నాడు. అదే తనను చెయ్యమంటున్నాడు. అది తప్పు మరేమీ చెయ్యవద్దంటున్నాడు. అందుకే తన చిన్ని చేతిని అతని చేతిలో వేసి మాట ఇచ్చాడు. అయితే అది ఎంతోకాలం నిలుపుకోలేకపోయాడన్నది వేరే విషయం.

★ ★ ★

"ఏంది బాసూ... రాత్రంతా నిద్రపోలేదల్లే ఉందే.." సెల్‌లోని మరో ఖైదీ ఆవలిస్తూ అడిగాడు.

> **కొత్తగాలి...**
>
> **కోట్లకు**
> **పడగనెత్తడం**
> **రాజకీయ సర్పానికే**
> **సాధ్యం**
>
> – సురేష్‌కుమార్,
> హైదరాబాద్

సన్నగా నవ్వేసి ఊరుకున్నాడు తప్ప మరేమీ మాట్లాడలేదు పాండు.
అందరికీ పాండులో నచ్చే గుణం అదే! ఎవరితోనూ తగాదాపడడు. అలా అని ఎవరితోనూ అతి చనువుగా ఉండడు.
లేచివచ్చి పక్కన చతికిలపడ్డాడు పాండుని పలుకరించిన తోటి ఖైదీ.
"ముసురు తగ్గేటట్లు లేదే? ... ఇక ఇవాల్టికి బయటకు వదలరు..." అనుభవాన్నంతా రంగరించి జోస్యం చెప్పాడు అతను.
"బయట అయినా లోపల అయినా

తేడా ఏమి ఉంది? అంతా జైలు గోడల మధ్యే కదా!" ఎటో చూస్తూ అన్నాడు పాండు.

"అంతే అనుకో... అయినా నీకులాగా ఎప్పుడూ ఆలోచిస్తూ కూర్చుంటే నాకు పిచ్చెక్కిపోద్ది.."

"పిచ్చి ఎక్కాలంటే ముందు తలలో గుజ్జు ఉండాలి.. కాబట్టి నీకు బెంగ అక్కర్లేదులే..."

ఫెళ్ళున నవ్వేశాడు అతను. ఆ మాట అన్నది పాండుకాక మరొకరయితే, తన బలం చూపించటానికి ప్రయత్నించేవాడేమో, కానీ... పాండు జైలుకు వచ్చిన కొత్తలో అలా ప్రయత్నించిన ఒకరిద్దరికి పట్టిన గతి గురించి విని వుండటంతో... అలాంటి సాహసం చెయ్యబోలేదు...

"నాదేముందిలే పాండూ... నాటుగాడిని నీకులాగా నేనేమన్నా చదువుకున్నానా పాడా? ... నా అమ్మా, అయ్యా నాకు కూడా చదువు చెప్పించి ఉంటే, నేను కూడా నీలాగే..."

"ఏమీ తేడా ఉండేది కాదు..." అతని మాటల్ని మధ్యలోనే ఆపివేస్తూ అన్నాడు పాండు.

"...బొద్దింకని కాళ్ళ కింద వేసి తొక్కటానికి అది పాలరాతి మేడలోకే ప్రవేశించనవసరం లేదు. పూరి గుడిసెలోకి వెళ్ళినా చాలు..."

"నాకేమీ అర్థం కాలేదు..."

"అదే మంచిది. నీలాంటి వాడూ, నాలాంటి వాడూ... చదువుకున్నా, చదువుకోకున్నా పెద్దగా తేడా ఏమీ ఉండదు. నిన్ను మీ అమ్మా, అయ్యా చదివించలేదని బాధపడకు. నన్ను మా అమ్మా, నాన్నా ఎందుకు చదివించారా... అని నేను ఏడుస్తున్నాను."

అప్పటి వరకూ పాండుతో మాట్లాడటానికి ప్రయత్నిస్తున్న అతను ఏదో గొణుక్కుంటూ దూరంగా వెళ్ళిపోయాడు.

వర్షం ఉద్ధృతి ఇంకా ఎక్కువయింది. డబ డబమని శబ్దం చేస్తూ కప్పుమీద పడిన నీరు.. బయటకు పోయే మార్గాలు చిన్నవవటంతో జైలు ఆవరణని చిన్న సైజు చెరువులా మారుస్తున్నాయి.

★ ★ ★

పాండు చదువులో ఎప్పుడూ వెనుకబడలేదు. అదేమిటో అతనికి చేపపిల్ల ఈదినంత సహజంగా చదువు వచ్చేది. ఆ ఊరిలో ఉన్నది పూరిపాకలోని ప్రైమరీ స్కూలు అయినా, అక్కడ పనిచేసే రాఘవయ్య మాస్టారు చిత్తశుద్ధితో పిల్లలకు చదువు చెప్పాలనే నిబద్ధత కలవాడు. అందుకే ఆయన మొక్కుబడిగా స్కూలు నడపటం కాక.. మనస్ఫూర్తిగా చదువు చెప్పేవాడు. ఆయన మొదటిచూపులోనే పాండులోని చురుకుదనాన్ని గమనించాడు. పాండు ఒక సానబెట్టని వజ్రమనీ.. మెరుగుదిద్దితే మిరుమిట్లు గొలుపుతాడనీ గ్రహించాడు. పాండు కూడా ఆయన ఊహలను నిజం చేస్తూ ఒక్కొక్క తరగతీ పూర్తి చేస్తున్నాడు.

అదే సమయంలో రామకోటి బాధలు వేరేగా ఉన్నాయి. అతను జైలు శిక్ష అయితే పూర్తి చేసుకోగలిగాడు కానీ.. పోలీసుల బాధనుండి విముక్తి పొందలేక

## కొత్తగాలి...



**ప్రకృతి వనరులు**
**పిండి చేసి మరీ**
**కోటానుకోట్ల సిరి!**
**వెయ్యేళ్లు బతికేద్దామనే!!**

– పి.ఎస్.ఎన్. రాజు,
హైదరాబాద్

పోయాడు. రాష్ట్రంలో ఎక్కడ ఏ పెద్ద దొంగతనం జరిగినా ముందుగా రామకోటినే పోలీసుస్టేషన్‌కు పిలిపించేవారు. రకరకాల ప్రశ్నలూ, రోజుల తరబడి విచారణ లేని లాకప్ శిక్షల తరువాత.. ఎప్పటికో వదిలిపెట్టేవారు. అయితే వారు ఎన్ని బాధలు పెట్టినా.. అతని చేత చేయని నేరం చేసినట్లు ఒప్పించలేకపోయేవారు.

తనతండ్రి దొంగతనాలు మానివేసినా.. ఇంకా ఎందుకు పోలీసులు వెంటాడుతున్నారో పాండుకి అర్థం అయ్యేది కాదు. అయితే పళ్ళు బిగువున బాధ భరిస్తూ.. పోలీస్‌స్టేషన్ నుండి బయటకు వచ్చేటప్పుడు కూడా రామకోటి కొడుకు దగ్గరకానీ, కాంతం వద్దకానీ పోలీసుల గురించి పల్లెత్తు మాట మాట్లాడేవాడు కాదు.

అలా ఇంట్లో ఎప్పుడు ఉంటాడో.. పోలీస్‌స్టేషన్లో ఎప్పుడు ఉంటాడో తెలియని రామకోటిని చూసి కూడా కాంతం నిబ్బరంగానే ఉండేది. పైగా అన్ని బాధలు పడుతూ కూడా... తనకిచ్చిన మాట కోసం మడమ తిప్పకుండా మాటమీదే నిలబడిన అతనంటే గర్వపడేది! తప్పు చేయనంత వరకూ తన భర్తకి ఏమీ కాదన్నది ఆమె నమ్మకం.

అలాంటి పరిస్థితులలోనూ తన చదువు నిర్లక్ష్యం చేయలేదు పాండు. అయిదో తరగతి తరువాత చదవాలంటే.. ఆ ఊరిలో వీలు లేదు. అక్కడకు పది కిలోమీటర్ల దూరంలోని ఊరికి వెళ్ళాలి. అప్పటికే పాండు బాగా చదువుతాడని పేరు పొందాడు. పాండులో ప్రతిభ ఉందనీ, ప్రోత్సహించి మంచి స్కూలులో చేర్పిస్తే.. అతను ఆ ఊరి నుండి ప్రభుత్వ ఉద్యోగం సంపాదించుకున్న మొదటి వ్యక్తి అవుతాడనీ.. పాండు తల్లిదండ్రులకు రాఘవయ్య మాట మాటకూ చెప్పేవాడు. వారి లక్ష్యం కూడా అదే అవటంతో.. తమకు తినటానికి లేకున్నా.. ఉన్నదాంట్లో మంచి స్కూలు చూసి పాండును పక్క టౌన్‌లో చేర్పించారు. ఆ విధంగా ఆ ఊరి నుండి పైతరగతి చదివిన మొదటి వ్యక్తి అయ్యాడు పాండు.

పదవ తరగతిలో జిల్లా మొత్తానికీ ప్రథముడిగా వచ్చినప్పుడు.. పాండు ప్రతిభ చుట్టుపక్కల అందరికీ తెలిసింది. రాఘవయ్య మాస్టారి ఆనందానికయితే హద్దే లేదు. తాను నాటిన మొక్క పెరిగి పెద్దదయి పెను వృక్షమవుతుంటే చూసి ఆనందించే తోటమాలిలా ఉందాయన పరిస్థితి.

దొంగల ఊరుగా ప్రసిద్ధమైన ఆ ఊరి విద్యార్థికి జిల్లాఫస్ట్ రావటం అన్నది మంచివార్త అవుతుందని అనుకున్న ఒక విలేఖరి పాండు ఊరు వచ్చాడు. పాండు ఇంటినీ, పరిసరాలను ఫోటోలు తీసి అతడి గురించి తన పత్రికలో చిన్న వార్త రాశాడు.

మరుసటి రోజు పేపర్లో పడిన తమ ఫోటోని చూసుకుని మురిసిపోయారు రామకోటి దంపతులు.. ఎన్నిసార్లు పోలీసు దెబ్బలు తిన్నా రాని కన్నీళ్ళు.. తండ్రి కళ్ళలో మొదటిసారి కనపడ్డాయి పాండుకి.

అప్పటి నుండి పాండు ఉత్సాహం రెట్టింపు అయింది. ఇంకా బాగా చదవాలన్న పట్టుదల పెరిగిపోయింది. అతని ప్రతిభ గుర్తించిన కాలేజి యాజమాన్యం కూడా అతనికి ఉచిత విద్య అందిస్తూ సహకరించటం మొదలుపెట్టింది.

అదే ఊపులో ఇంటర్మీడియట్‌ను అత్యధిక మార్కులతో పూర్తిచేసుకున్న పాండు డిగ్రీలో చేరి మొదటి సంవత్సరం నుండే ఐఏఎస్ గురిగా తన సాధన మొదలుపెట్టాడు. అతని కృషి చూసిన ఎవరికీ... అతను లక్ష్యం సాధిస్తాడా లేదా అన్న అనుమానమే వచ్చేదికాదు.

ఇంతలో పాండు కుటుంబానికి అనుకోని అవాంతరాలు ఎదురుకావటం మొదలయ్యాయి. వాటికి కారణం పక్కటౌన్‌కు కొత్తగా వచ్చిన సర్కిల్ ఇన్‌స్పెక్టర్ బాజీరావు.


2

**బా**జీరావు తనకి ఆ టౌన్ ట్రాన్స్‌ఫర్ అయిందని తెలిసినప్పుడు చాలా బాధపడ్డాడు. సిటీ నుండి ఒక మామూలు టౌన్‌కి వెళ్ళటమంటే డిగ్రేడ్ అయినట్లు ఫీలయ్యాడు.

సిటీలో ఉన్నప్పుడు అతను పనిచేసే విధానం చాలా ప్రత్యేకంగా ఉండేది. ఒక పద్ధతి ప్రకారం ఉండేది. ముందుగా లోకల్ లీడర్లందరినీ.. అది అధికార పక్షమా, ప్రతిపక్షమా అన్న భేదం లేకుండా తన బుట్టలో పడేసుకునేవాడు. వారికి వెళ్ళవలసిన గిఫ్టులు ఠంచనుగా ప్రతినెలా అందేవి.

అలా మొదటి మూడు నెలల్లో సెట్టింగ్ అంతా ఏర్పాటు చేసుకున్న తరువాత.. తన వసూళ్ళ కార్యక్రమం మొదలుపెట్టేవాడు. ఫుట్‌పాత్ మీద కూరగాయలు అమ్ముకునే వారి దగ్గరనుంచి మొదలుకుని రాత్రి పొద్దుపోయాక తెరచి ఉంచే వైన్ షాపుల వరకూ.. అందరికీ వారి వారి తాహతులను బట్టి పద్ధతి ప్రకారం మామూళ్ళు నిర్ణయించేవాడు. ఈ పనులన్నీ ఎంత పద్ధతి ప్రకారం జరిగేవంటే వసూలు చేయవలసిన వివరాలు పుస్తకాల్లో రాసుకుని.. రికవరీ కోసం తిరిగే మైక్రో ఫైనాన్స్ ఏజంట్లలాగా స్టేషన్‌లోని పోలీసులు తిరిగేవారు. మొగుడూ పెళ్ళాల తగాదాల దగ్గర నుండి.. మల్టీప్లెక్స్‌ల స్థలం తగాదాల వరకూ అన్ని పంచాయతీలు అతనే చేసేవాడు.

ఇంతవరకూ అతని ఇంటిమీద ఏ అవినీతి నిరోధక శాఖవారూ దాడి చెయ్యలేదు. కానీ.. అదే కనుక జరిగితే, అతను ఆలిండియా రికార్డు బద్దలు కొట్టడం ఖాయం- అవినీతి సంపాదనలో!

అలాంటి వాడికి ఈ కొత్త టౌన్ చప్పగా ఉంది. రంభను చూసిన కళ్ళతో రాంబాయమ్మను చూసినట్లు ఉంది.

అలా నిరాసక్తంగా ఉన్న అతనికి గజదొంగ రామకోటి ఉంటున్న ఊరు గురించీ.. అది తన ఇలాకా కిందకే వస్తుందన్న సంగతీ.. తెలిసింది.

అంతే!

అతని మనసులో ఒక మెరుపు మెరిసింది.

★ ★ ★

అక్కడి లోకల్ ఎమ్మెల్యే పేరు అన్నవరం. అతను ఎన్నికల్లో గెలవటానికి అయిదు కోట్లు ఖర్చు పెట్టాడు. అతని అదృష్టమో.. ప్రజల దురదృష్టమో కానీ గెలిచాడు. అతని పార్టీ కూడా అధికారంలోకి వచ్చింది.

అయితే ఎన్నికలు అయిపోయి ప్రభుత్వం ఏర్పడబోయే మధ్యలో జరిగిన రాజకీయ చదరంగంలో అతను తప్పు ఎత్తువేశాడు.

అతను ఏ గ్రూపులో అయితే ఉన్నాడో ఆ గ్రూపుకి కాకుండా మరొక గ్రూపుకి అధికారం దక్కింది. దానితో అన్నవరం పరిస్థితి కూరలో కరివేపాకు అయింది.

పైగా పుండు మీద కారం చల్లినట్లు.. ప్రస్తుత ముఖ్యమంత్రి ఈ నియోజకవర్గంలో ఇంకొక నాయకుడికి పూర్తిగా సపోర్టు చేస్తున్నాడు. వచ్చే ఎన్నికలలో టిక్కెట్టు అతనికే ఇవ్వటం ఖాయం. ఏ రకంగా చూసినా మరలా తనకు టిక్కెట్టు వచ్చే అవకాశాలు కనపడటం లేదు. ఇక మిగిలింది కనీసం ఖర్చు పెట్టిన డబ్బు వెనక్కి సంపాదించుకోవటం. అది ఎలాగా అన్న ఆలోచనలో అతను ఉండగా.. బాజీరావు వచ్చి అతన్ని కలిశాడు.

ఒకే గూటి పక్షులు కాబట్టి.. అరగంటలోనే మందు ముందు సెటిల్ అయ్యారు.

నెమ్మదిగా తన ప్లాను వివరించాడు బాజీరావు. వింటుంటే.. అన్నవరానికి తన తలకు ఎక్కుతున్న మత్తుమందు వలనో, బాజీరావు చెప్తున్న మాటలకో సరిగ్గా అర్థం కాలేదు.

"ఇదంతా సాధ్యమేనా?.. నీ వలన అవుతుందా?.." అని మాత్రం అనగలిగాడు ఆ మత్తులో కళ్ళు మూసుకుపోతుంటే.

చిద్విలాసంగా నవ్వాడు బాజీరావు.

★ ★ ★

ఒకసారి తనకు పొలిటికల్ సపోర్ట్ ఉందని అర్థమయ్యాక అత్యంత వేగంగా పని ప్రారంభించాడు బాజీరావు.

దొంగలు దొంగతనం చెయ్యటం ఎంత కష్టమో, దానిని అమ్మి సొమ్ము చేసుకోవటమూ మరింత కష్టం. దొంగతనం చేసి తీసుకు వచ్చిన బంగారాన్ని కొనటానికి ఆ టౌన్‌లో ఇద్దరు ముగ్గురు వ్యాపారులు ఉన్నారు. వారు తాము తీసుకుంటున్న బంగారానికి ఇరవైశాతం కంటే ఎక్కువ ధర దొంగలకు ఇవ్వరు. అలా కొన్న బంగారాన్ని వెంటనే కరిగించి ప్యూర్‌గోల్డ్ కింద తయారు చేస్తారు.

అయితే ఈ వ్యాపారంలో కూడా రిస్కు ఉంటుంది. ఒకొక్కసారి దొంగతనం జరిగింది ఏ ప్రముఖుడి ఇంట్లోనో అయినప్పుడు.. పోలీసులకు దొంగలను పట్టుకోక తప్పని పరిస్థితులు ఏర్పడతాయి. అలాంటప్పుడు ఈ వ్యాపారులు తాము కొన్న దొంగవస్తువులను పోలీసులకు వెనక్కి ఇవ్వవలసి రావచ్చు.

అలాగే కొన్ని కొన్నిసార్లు ఏ వస్తువూ కొనకపోయినా పోలీసులను బయటపడేయటానికి వారికి కావలసినటువంటి నగలు చేయించి మరీ ఇవ్వవలసి రావచ్చు. ఇలాంటి అనుకోని ఖర్చులన్నీ పక్కన పెట్టినా.. ఈ వ్యాపారంలో లాభం లక్షల్లోనే ఉంటుంది.

## కొత్తగాలి...

**పొయ్యిలో పిల్లిలా**
**ముడుచుకు పడుకున్నాయి**
**భావాలు..!**
**పెళ్లయిందిగా..!!**

– ఎం.పి. ఊర్మిళా జ్యోతి,
మహబూబ్‌నగర్

అలాంటి వ్యాపారం చేసే వారిలో ప్రముఖుడు గులాబ్‌చంద్. అతని నాయకత్వంలో ఆ వ్యాపారులందరినీ ఏకం చేసి.. వారిలో వారికి పోటీ లేకుండా చేశాడు బాజీరావు. వారందరికీ తను చెయ్యబోతున్న పని గురించి వివరించి... దానితో వారి లాభాలు ఎన్ని రెట్లు ఎలా పెరుగుతాయో వివరించాడు. అలా అన్ని ఏర్పాట్లు చేశాక తన ఆఖరి పావు కదిపాడు బాజీరావు.

ఇంకా తెల్లవారటానికి మూడు గంటల సమయం ఉందనగా... రామకోటి ఉండే ఊరిలోకి ఒక పోలీసు జీపు, దాని వెనుక

రెండు లారీలు అనుసరిస్తుంటే ప్రవేశించింది.

చీకట్లో... వచ్చింది ఎవరో తెలిసేలోపే, ఊర్లోని మగవారిని అందరినీ ఎత్తి లారీల్లో కుదెయ్యటం మొదలుపెట్టారు.

ఆడవారి అరుపులూ, పిల్లల ఏడుపులతో పరిసరాలన్నీ ప్రతిధ్వనిస్తున్నాయి.

అక్కడ జరుగుతున్న అకృత్యాలు అడ్డుకోవటానికి ఏ రాజకీయ నాయకుడూ రాడు. ఏ విలేఖరికీ అవి అరాచకాలన్న స్పృహ రాదు. ఏ టీవీ ఛానలూ అలాంటి ఊరిలోకి ప్రవేశించదు. ఎందుకంటే- ప్రజలందరికీ ఒక ప్రగాఢమయిన విశ్వాసం ఉంది- ఆ ఊర్లోని వారంతా దొంగలే అని!

తమ దగ్గర జరిగే దొంగతనాలన్నిటికీ ఆ ఊరి వారే బాధ్యులనీ... పోలీసులు వారిని చూసీ చూడనట్లు వదిలేస్తున్నారనీ... వారి అభిప్రాయం!

అలాంటిది లేక లేక పోలీసులు వారి మీద చర్య తీసుకుంటుంటే- ఎవరైనా అడ్డు పడితే.. ప్రజల దృష్టిలో వారు విలన్లయ్యే ప్రమాదముంది. ప్రజాస్వామ్యంలో ప్రజలకు నచ్చేదే న్యాయం కాబట్టి... ఇలాంటి విషయాలు కనీసం వెలుగులోకి కూడా వచ్చే అవకాశం లేదు.

జరుగుతున్న అలజడికి మెలకువ వచ్చిన పాండు కళ్ళు నులుముకుంటూ బయటికి వచ్చాడు.

అప్పటికే ఒక లారీ ఊర్లోని మగవారితో నిండిపోయి ఉంది. మిగిలిన వారిని రెండవ లారీలోకి ఎక్కిస్తున్నారు.

ఒక పోలీసు రామకోటిని బలవంతంగా లారీలోకి ఎక్కించే ప్రయత్నం చేస్తున్నాడు.

"కనీసం మేము చేసిన నేరం ఏమిటో చెప్పండి సార్..." ప్రతిఘటిస్తూ అడుగుతున్నాడు అతను.

సమాధానం చెప్పటానికి అన్నట్లు జీపు దిగి వచ్చాడు బాజీరావు. సరాసరి రామకోటి దగ్గరకు వచ్చి నిలబడ్డాడు.

"ఎందుకో చెప్తేగానీ లారీ ఎక్కవా? .."

"అది కాదు సార్.." ఏదో చెప్పబోతున్న రామకోటి మూతి మీద లాఠీతో కొట్టిన దెబ్బకి రెండు మూడు పళ్ళు కదలిపోయాయి. పెదవి చిట్లి రక్తం కారటం మొదలయింది.

ఒక్కసారిగా పరిసరాలన్నీ నిశ్శబ్దమయ్యాయి.

ప్రతిఘటిస్తే జరిగేదేమిటో అందరికీ అర్థం అయింది. మరి మాట్లాడకుండా రామకోటి నడిచి వెళ్ళి లారీ ఎక్కాడు.

పాండు అడుగు ముందుకు పడబోయింది.

ఇంతలో కాంతం చెయ్యి అతని భుజం మీద గట్టిగా పడింది.

వెనక్కి తిరిగి చూశాడు.

వద్దన్నట్లు ఆమె తల అడ్డంగా ఊపింది.

మరో అయిదు నిమిషాల తరువాత నిండా మనుషుల్తో వాహనాలు ఆ ఊరి నుండి బయటకు నడిచాయి.

★ ★ ★

అలా బయలుదేరిన వాహనాలు పోలీసు స్టేషన్ దగ్గరకు వెళ్ళలేదు. ఊరికి దూరంగా ఉన్న పాడుపడిన గోడౌన్ ముందు ఆగాయి. అందులోని వారిని వరుసగా లోపలకు పంపి, గోడౌన్‌కి బయటనుండి తాళాలు వేశారు.

ఆ తరువాత అక్కడ జరిగిన హింసాకాండ చూస్తే... హిట్లర్ కూడా సిగ్గుతో తల వంచుకోవాలి.

ఒక ప్రశ్న అడిగింది లేదు, సమాధానం ఆశించిందీ లేదు. అందరినీ పడేసి బాదటమే! అలా వారి స్థైర్యాన్నంతా దెబ్బతీశామనుకున్నాక ప్రవేశించాడు బాజీరావు.

పోలీసులూ, మిలటరీ వారు కొత్త ఉద్యోగుల్ని రిక్రూట్ చేసుకున్నట్లు... తన



ప్రైవేటు సైన్యాన్ని భర్తీ చేసుకోవటం ప్రారంభించాడు.

ముందుగా వారు చెయ్యవలసిన పని వివరించాడు.

ఇక నుండి వారు ఎక్కడ దొంగతనం చెయ్యాలో అతను నిర్ణయిస్తాడు. దొంగతనం చేసిన సొమ్ము ఎవరికి అమ్మాలో అతనే నిర్ణయిస్తాడు. అమ్మిన వస్తువు రేటు.. తనకివ్వవలసిన కమీషన్ కూడా అతనే నిర్ణయిస్తాడు.

'రూల్సన్నీ చెప్పాక ఒకరొకరుగా అతని ముందు ప్రవేశపెట్టబడుతున్నారు వారు.

"ఏరా నేను చెప్పినట్లు చేస్తావా?.." జుట్టు పట్టుకుని అడుగుతున్నాడు బాజీ రావు.

అవునన్న వాడి వివరాలు ఒక రిజిష్టర్లో రాసుకుని బయటకు పంపుతున్నారు.

కాదన్నవారికి మరి నాలుగు తగిలించి మరీ తను చెప్పదలచుకున్నది చెప్తున్నాడు- "చూడూ... నా మాట వింటే, మీరు చేసే దొంగతనాలకు నా ప్రొటెక్షన్ ఉంటుంది. ఇంకా అవసరమయితే ఎమ్మెల్యేగారి రక్షణ ఉంటుంది. అదే మీ ఇష్టప్రకారం దొంగతనాలు చేస్తే... నాకు దొరికిన వారిని దొరికినట్లు ఎన్‌కౌంటర్ చేసిపారేస్తాను. అందులో ఇప్పుడు జనం కూడా మీలాంటి వారిని ఎన్‌కౌంటర్ చేసే పోలీసుల్ని హీరోలతో సమానంగా చూస్తున్నారు. కాకపోతే ఒకటిరోయ్... దొంగతనం అంటూ జరిగాక దొంగని పట్టుకోవాలి కదా! ఒకసారి కాకపోయినా మరొకసారి అయినా దొంగ దొరకాలి కదా! ఇప్పుడు నన్ను కాదని బయటకు పోదామనుకుంటున్నారే... వారినే అసలు దొంగతనాలకు బాధ్యులను చేసి జైల్లో కూర్చోబెడతాను. అలా పడి ఏడుస్తారో, నేను చెప్పిన మాట విని బాగు పడతారో... మీరే నిర్ణయించుకోండి..." అనర్గళంగా సాగిపోతున్న అతని మాటలు విన్నాక కాదనే ధైర్యం ఎవరూ చెయ్యలేదు.

### కొత్తగాలి...

**బాల్యం**
**పుత్తడి!**
**వృద్ధాప్యం**
**ఒత్తిడి!!**

*– గుడిమెట్ల గోపాలకృష్ణ,*
అరసవిల్లి

★ ★ ★

గోడౌన్ ఎదురుగా రోడ్డు పక్కన ఉన్న చెట్టు కింద నిలబడి ఉన్నాడు పాండు.

అతను కాంతాన్ని ఒప్పించి వచ్చేటప్పటికి ఈ సమయం అయింది.

ముందు అతన్ని పంపటానికి ఆమె ససేమిరా ఒప్పుకోలేదు. కానీ... వెళ్ళిన మనుషులు ఎంతకీ తిరిగి రాకపోవటంతో ఆమె మనసులో కూడా రకరకాల అనుమానాలు పొడచూపాయి.

అందుకే అతన్ని ఎటువంటి దుందుడుకు చర్యా చేయకుండా కేవలం తండ్రి ఆచూకీ కనుక్కుని రమ్మని పంపింది.

ఒకరొకరుగా బయటకు వస్తున్నారు వారి ఊరి వ్యక్తులు. రోడ్ యాక్సిడెంట్లో తీవ్రమయిన దెబ్బలు తిన్నట్లు తూలుకుంటూ నీరసంగా బయటకు వస్తున్నారు.

బయటకు వచ్చే ప్రతి వ్యక్తీ తన తండ్రేనేమో అని ఆత్రంగా చూస్తున్నాడు పాండు.

దాదాపుగా అందరూ బయటకు వచ్చినా రామకోటి మాత్రం రాలేదు. అతను లోపలే ఉన్నాడని అందరూ చెప్తున్నారు. అయినా... ఎవరి కోసం ఎవరూ ఆగే పరిస్థితుల్లో లేరు. ఎవరి దారిన వారు వెళ్ళిపోతున్నారు.

పొద్దుపోయే కొద్దీ దట్టమయిన చీకట్లు పరిసరాలను ఆక్రమించుకుంటున్నాయి. లోపల ఏదో జరుగుతుందన్న సూచనగా లైట్లు వెలుగుతున్నాయి. బాజీరావు ఉన్న గుర్తుగా జీపు బయట ఉంది.

నెమ్మదిగా కదిలిన పాండు చీకటిలోనే గోడౌన్ చుట్టూ తిరిగి దాని వెనుక పక్కకు చేరాడు.

వెనుక గోడకు సన్నటి పైపు ఒకటి

బిగించి ఉంది. గోడౌన్ పైన రేకుల కప్పు ఉంది. అక్కడక్కడా రేకులు విరిగిపోయి ఉన్నాయి. గోడా, రేకులూ కలిసే చోట మనిషి దూరే వీలున్న ఖాళీ ఉంది.

లోపల నుండి మనుషుల మాటలు లీలగా వినిపిస్తున్నాయి. ఏదో జరుగు తుంది... తన తండ్రి లోపలే ఉండిపో యాడు. తను ఆయనకు సహాయంచేసే పరిస్థితుల్లో లేకపోయినా... కనీసం ఏమి జరుగుతుందో తెలుసుకోకుండా ఇక్కడే నిలబడిపోవటం భావ్యంగా అనిపించ లేదు.

తలెత్తి చూశాడు.

దాదాపు పదిహేను అడుగుల ఎత్తుతో నిట్టనిలువుగా నిలబడి ఉంది గోడౌన్ గోడ. సన్నని పైపు పట్టుకుని అంతెత్తు గోడ తను ఎక్కగలడా అన్న సందేహం కలిగింది అతనికి.

ఇంతలో ఎవరో బాధతో అరచిన అరుపు లోపల నుండి లీలగా వినిపిం చింది.

ఇంక ఆగలేకపోయాడు పాండు.

పైపు పట్టుకుని బరబరా పైకి పాకటం మొదలుపెట్టాడు. రెండు నిమిషాల తరు వాత పైవరకూ చేరుకున్నాడు. గోడకూ, రేకుకూ మధ్య ఉన్న ఖాళీ ప్రదేశం నుండి శరీరాన్ని లాఘవంగా దూర్చి... చేతులు గోడ అంచుల మీద వేసి... తన శరీరాన్ని గోడ మీదకు లాక్కున్నాడు.

బల్లపరుపుగా గోడ మీద పడుకుని కింద జరిగేది చూడసాగాడు.

గోడౌన్ లోపల వెలుగుతున్న లైటులన్నీ కిందకు ఫోకస్ చేసి ఉండటంతో సీలింగ్ మీదకు వెలుతురు చేరటం లేదు. దానితో అతను ఎవర్నికైనా కనిపించే అవకాశం చాలా తక్కువ.

పైనుండి ఉయ్యాల లాగా వేలాడుతున్న సన్నటి లాఠీలాంటి కర్రను రామకోటి మోకాళ్ళకింద నుండి దూర్చి... అతన్ని తలక్రిందులుగా వేలాడదీశారు.

లాఠీలతో కొట్టటానికి అనువుగా అతను వేలాడుతున్న ఎత్తును ఎడ్జస్ట్ చేసుకుని, అతని అరికాళ్ళమీద ఇద్దరు పోలీసులు ఒకరి తరువాత ఒకరు కొడుతున్నారు.

అతని మూలుగులు బయటకు వినపడ కుండా నోట్లో గుడ్డలు కుక్కి ఉన్నాయి.

ఇంతలో... ఇక చాలు అన్నట్లు బాజీ రావు చేయి ఊపాడు.

పోలీసులు కొట్టటం ఆపారు.

"మనిషిని పనికి రాకుండా చేస్తారేమి టిరా? ... ఇతనితో మనకి చాలా అవ సరం ఉంది..." అంటూ బాజీరావు నెమ్మ దిగా నడుచుకుంటూ వేలాడుతున్న రామ కోటి దగ్గరకు వచ్చి నోట్లో కుక్కిన గుడ్డలు బయటకు పీకాడు.

అప్పటి వరకూ అణచుకున్న బాధ మూలుగురూపంలో వెలువడింది.

పాండు మనసు రగిలిపోతుంది. కానీ... ఏమి చెయ్యాలో అర్థం కావటం లేదు.

"ఇప్పుడయినా ఒప్పుకుంటావా... నేను చెప్పిన పని చేస్తానని?" మార్దవంగా అడి గాడు బాజీరావు.

ఎండిపోయిన గొంతు నుండి బలవం తంగా మాటలు పెగల్చుకుని చెప్పాడు రామకోటి- "ఒప్పుకునే వాడినయితే... మొదట అడిగినప్పుడే ఒప్పుకునే వాడిని. ఇప్పుడు మీరు ఏదో నాలుగు దెబ్బలు కొట్టారు కదా అని ఒప్పుకుంటే... నేను రామకోటిని కాను సార్..."

బాజీరావు మొహం కోపంతో నల్లబ డింది.

"ఏమి చూసుకునిరా ఇంత పొగరు? .... నీ నిజాయితీ ఏమి ఒరగ పెట్టింది? తింటానికి కూడు ఇచ్చిందా? ఉండటానికి గూడు ఇచ్చిందా? ... నాతో

చేతులు కలుపు! మీ వాళ్ళందరికీ నిన్ను నాయకుడిని చేస్తాను. నిన్నూ నా అంతటి వాడిని చేస్తాను..." అన్నాడు కోపాన్ని కంట్రోలు చేసుకుంటూ.

అంత బాధలోనూ సన్నగా నవ్వాడు రామకోటి.

"దొంగతనాలు చేసి పైకి ఎదిగే వీలుంటే... నేను చేసిన దొంగతనాలకు మరి ఎంత ఎత్తున ఉండి ఉండాలి సార్? ... కానీ ఇలాగే ఉన్నాను. నా వలన మధ్యవర్తులు బాగుపడ్డారు. అంతే తప్ప నాకేమీ ఉపయోగం కలగలేదు. ఈ విషయమే నాకు నా భార్య వివరించి చెప్పే వరకూ అర్థం కాలేదు. ఒకసారి ఆ మతలబు అర్థం అయ్యాక ఇంక వాటి జోలికి పోదలుచుకోలేదు. మీకు తెలియ నిది కాదు, కానీ... రామకోటి పట్టుదలకు పేరు. మీరు నన్ను ఏమి చేసినా... నేను మాత్రం మీరు చెప్పిన పని చెయ్యను. ఆఖ రికి మీరు నన్ను చంపినా సరే!"

కాసేపు ఆలోచిస్తూ ఉండిపోయాడు బాజీరావు. "నిన్ను చంపితే నాకేమి వస్తుంది రామకోటీ? ... అలా అని నా మాటను ఇంత అవహేళన చేసిన నిన్ను ఏమీ చెయ్యకుండా వదిలిపెడితే... నాకు మీ ఊరిలో ఏమి మర్యాద ఉంటుంది? "

బాజీరావు మాటల్లోని అంతరార్థం అర్థమై ఉలిక్కిపడ్డాడు పాండు. గోడ మీద బ్యాలన్స్ తప్పబోయి నిలదొక్కుకున్నాడు అతను.

తలక్రిందులుగా వేలాడుతున్న రామకో టికి గోడమీద నీడల్లో కదలిక కనిపిం చింది. అది మనిషి ఆకారమని అర్థమ యింది. అంత మసక చీకటిలోనూ ఆకా రాన్ని బట్టి అది తన కొడుకుదని గుర్తుప ట్టాడు.

రామకోటి మనసు చురుకుగా ఆలోచిం చింది. పాండు యువకుడు. బాజీరావు మాటలకు ఉద్రేకపడి తనను కాపాడటానికి లోపలకు వస్తే ఏమి జరుగుతుందో అత నికి తెలుసు.

అందుకే బాజీరావుని ఉద్దేశించి మాట్లా డుతున్నట్లుగా గట్టిగా చెప్పాడు- "మా ఊరి వాళ్ళు అందరూ దొంగలూ, మొద్దులూ, మూర్ఖులూ అనుకుంటున్నా రేమో... అందరూ అలా ఉండరు. తెలి వితో పని సాధించగలవారు కూడా కొందరు ఉన్నారు. అలాంటి వారికి మీరు నన్ను పెడుతున్న ఇబ్బందులు తెలిసా యంటే... ఏమి జరుగుతుందో తెలుసా? ..."

ఆ మాటలు బాజీరావుని ఉద్దేశించినవి అనిపిస్తున్నా... దానిలోని సందేశం తనకే అని పాండుకి అర్థం అయింది.

తన తండ్రి తనని తొందరపడవద్దని హెచ్చరిస్తున్నాడు.

తెలివిగా కార్యం సాధించమంటున్నాడు.

అర్థమయినట్లు చీకట్లోనే చెయ్యి పైకి ఎత్తాడు.

బదులుగా తల ఆడించాడు రామకోటి.

రామకోటి మాటలకు బాజీరావు మాత్రం చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపో యాడు. "ఏం చేస్తారు మీ వాళ్ళు? నా తల కొట్టి మొలేస్తారా? ... ఇందాక చూశా వుగా తలలు వంచుకుని కుక్కల్లాగా ఎలా వెళ్ళిపోయారో? ... ఒక పని చేస్తాను! నిన్ను జైల్లో పడేయిస్తాను. అప్పుడు ఏమి చేస్తారు మీ వాళ్ళు? అక్కడకు కూడా వచ్చి నిన్ను విడిపించుకునిపోతారా? "

జుట్టు పట్టుకుని రామకోటిని అటూ ఇటూ ఊపుతూ ప్రశ్నించాడు బాజీరావు.

"ఏమీ నేరం చేశానని నన్ను జైలుకు పంపుతారు? " వగరుస్తూ అడిగాడు రామ కోటి.

ఆశ్చర్యపోయినట్లు అన్నాడు బాజీరావు- "ఓ... అదొకటుంది కదూ! జైలుకి పంపా

లంటే ఏదో ఒక నేరం జరగాలి కదూ! సరే!.. అయితే విను నువ్వు చేసిన నేరం ఏమిటో!... నువ్వు ఈ రాత్రి గులాబ్ చంద్ ఇంట్లో దొంగతనం చేస్తావు. పది లక్షల విలువయిన బంగారం దొంగిలిస్తావు. దొంగతనం జరిగిందని ఉదయాని కల్లా గులాబ్ చంద్ కంప్లయింట్ ఇస్తాడు. మేము దొంగల కోసం వెతుకుతాం. దొంగిలించిన వస్తువులతో సహా నువ్వు మాకు దొరికిపోతావు. నగలు గులాబ్ చంద్ గూటికి వెళ్ళిపోతాయి. నువ్వు మాత్రం జైలుకి వెళ్తావు. ఇరవైనాలుగు గంటలలోనే ఇంత పెద్ద కేసు ఛేదించినందుకు నాకు ప్రభుత్వం మెడల్ ఇచ్చినా ఆశ్చర్యం లేదు. అఫ్‌కోర్స్! అది నాకు అవసరం లేదనుకో! నిన్ను ఏ లాయరూ రక్షించలేనట్లు కేసు తయారు చేస్తాను. తీరిగ్గా జైల్లో కూర్చుని తోటి ఖైదీలకు నీతి పాఠాలు చెప్పుకుందువు.. బోలెడు సమయం ఉంటుంది.."

అంత అనుభవం ఉన్న రామకోటికి కూడా ఏమి మాట్లాడాలో అర్థం కాలేదు.

బాజీరావు చెప్తున్న ప్రకారం జరిగితే తనను ఎవరూ కాపాడలేరని అతనికి తెలుసు. అందుకే మౌనంగా కళ్ళు మూసుకుని ఉండిపోయాడు.

బాజీరావు పథకం ఎదురులేనిదే కావచ్చు. అయితే అతను దానిని బయటకు చెప్పి పెద్ద పొరపాటు చేశాడు.

★ ★ ★

ఎక్కినట్లే గోడ దిగి వచ్చాడు పాండు.

అతనికి కొన్ని కొత్త విషయాలు అప్పుడే తెలిశాయి! ఏ ఆధారమూ లేకుండా గోడ ఎక్కడం కంటే... దిగటం ఇంకా కష్టమని! మిగిలిన విషయాల సంగతి ఏమో కానీ... తన తండ్రి నైపుణ్యం కొంతయినా తనకి వంశపారంపర్యంగా అబ్బి ఉండవచ్చునీ!!

ఇంత జరుగుతున్నా తనలో భయం కానీ, టెన్షన్ కానీ లేదంటే... తను ఐఏఎస్ ఆఫీసర్ కంటే... దొంగగానే బాగా రాణించవచ్చునీ!!!

ప్రస్తుతానికి ఆలోచనలను పక్కన పెట్టి... తన దృష్టిని జరగవలసిన కార్యం మీద లగ్నం చేశాడు.

ఆశ్చర్యకరంగా అతనికి తన తండ్రిని విడిపించుకోవాలంటే ఏమి చెయ్యాలో ఒక్క నిమిషంలోనే విశదమయ్యింది. మరలా మరలా ఆలోచించినా అంతకంటే ఇంకొక మెరుగైన మార్గం ఏమీ కనపడ లేదు.

తను తీసుకోవలసిన జాగ్రత్తల గురించి అతను మరొకసారి మననం చేసుకున్నాడు. ముఖ్యంగా ఈ విషయంలో మరెవరి సహాయం తీసుకోకూడదు. ఎప్పటికీ ఈ పని చేసింది ఎవరో బాజీరావుకి తెలి

## గోపీచంద్ చతురోక్తులు

'అసమర్థుని జీవయాత్ర', 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' తదితర రచనల ద్వారా తెలుగు సాహిత్యంలో అజరామరంగా నిలిచిన త్రిపురనేని గోపీచంద్ చమత్కారంగా మాట్లాడటంలో దిట్ట. ఆయన చతురోక్తులు కొన్ని..



### ఎంత అదృష్టమో?

ఓ సాహిత్య సభలో ప్రముఖ వక్త ఒకరు, 'కవులుగా, రచయితలుగా పుట్టడం నిజంగా ఎంతో అదృష్టం. దాన్ని మాటలతో వర్ణించలేము' అన్నారు.

రచయితల కష్టాల గురించి తెలిసిన, అదే సభా వేదికపైనున్న గోపీచంద్ 'పుట్టడం, గిట్టడం కూడా అదృష్టమే! ఈ రెంటి మధ్య గిట్టుబాటయ్యే అదృష్టముండాలిగా?' అన్నారు రచయితల అదృష్టం గురించి వ్యంగ్యంగా.

యకూడదు. ఒకవేళ తెలిసిందంటే... ఆ రోజుతో తన చరిత్ర ముగిసినట్లే! అందుకే ఒకటికి పదిసార్లు తను చెయ్యవలసిన పనులన్నీ మనసులోనే మరలా సరి చూసుకున్నాడు.

అంతా సరిగానే ఉందని నిర్ణయించుకున్న తరువాత బయలుదేరాడు బాజీరావుతో యుద్ధానికి.

పరుగు పరుగున టౌన్‌లోకి చేరుకున్నాడు పాండు.

ఆ చిన్న టౌన్‌లో గులాబ్‌చంద్ ఇల్లు ఎక్కడ ఉంటుందో కనుక్కోవటం పెద్ద కష్టం కాలేదు.

ఆ ఇంట్లో కుక్కలున్నాయని ఇంటి ముందు కట్టిన బోర్డు చెప్పింది. ఇంటికి కాపలా గట్టిగా ఉంటుందని... ఇంటి ముందు కూర్చుని కాపలా కాస్తున్న గూర్ఖా చెప్తున్నాడు.

అన్నీ గమనించిన అతను కావలసిన సరంజామా కోసం మార్కెట్ ఏరియాకి వచ్చాడు.

మొదటి ఆట సినిమా ఇంకా వదిలిపెట్టలేదు. సినిమా చూసి బయటకు వచ్చేవారి బేరాలు చూసుకుని కానీ... దుకాణాలు కట్టివెయ్యరు సాధారణంగా! అందుకే రాత్రి తొమ్మిది దాటినా దుకాణాలన్నీ తెరిచే ఉన్నాయి. తనకు కావలసిన వస్తువులు కొనటానికి అడుగు ముందుకు వెయ్యబోతూ ఆగిపోయాడు అతను.

ఏది కొనాలన్నా ముందు డబ్బు ఉండాలి. అది తన దగ్గర లేదు.

ఇంతలో సినిమా వదిలారు.

థియేటర్ నుండి జనం ఒక్కసారిగా బయటకు వస్తున్నారు.

పాండు కళ్లు అనుభవజ్ఞుడయిన జేబు దొంగలా థియేటర్ నుండి బయటకు వస్తున్న వారిని శల్య పరీక్ష చేశాయి. మనిషి వేషాన్ని బట్టి ఎవరి జేబులో డబ్బు ఉండవచ్చో అతని మనసు అంచనా కట్టింది. అటువంటి వారి నుండి జాగ్రత్తగా డబ్బులు, పర్సులూ లోపలి జేబుల్లో పెట్టుకున్న వారినీ... జేబులో చేతులు పెట్టటానికి వీలులేనంత బిగుతు బట్టలు వేసుకున్న వారినీ... ఎలిమినేట్ చెయ్యగా ఒకతను షార్ట్ లిస్ట్ అయ్యాడు.

లూజు లాల్చీ ధరించిన అతను మందు కూడా కొట్టినట్లున్నాడు. కొద్దిగా తూలుతూ నడుస్తున్నాడు.

థియేటర్లోకి వెళ్తున్న వాడి మాదిరిగా ఆ శాల్తీకి హడావుడిగా ఎదురు వెళ్లి... అనుకోకుండా తగిలినట్లు అతన్ని గుద్దుకున్నాడు. ఎదుటి వ్యక్తి సర్దుకునే లోపు తన పని ముగించుకున్నాడు.

ఇప్పుడు పాండుకి మరొక విషయం అర్థం అయింది. తను దొంగతనాలు కూడా లాఘవంగా చెయ్యగలనని.

రెండు అడుగులు థియేటర్లోకి వేసినట్లే వేసి... వెను తిరిగి బయటి వైపుకు నడిచాడు.

అక్కడ వరుసగా ఉన్న దుకాణాల్లో ఒక మెడికల్ షాపు వద్దకు వెళ్లి, "రెండు కాంపోజ్ మాత్రలు కావాలి..." అని అడిగాడు.

"డాక్టర్ ప్రిస్క్రిప్షన్ ఉందా? " అడిగాడు షాపులోని కుర్రవాడు.

"ఎప్పుడూ తీసుకు వెళ్ళేదా కదా... అని తేలేదు! సరేలే! ఇంకొక షాపుకు వెళ్తాను..." అంటూ వెనుతిరిగిన పాండును వెనక్కి పిలిచాడు షాపు ఓనర్.

"రెండు మాత్రలకి అవన్నీ ఎందుకు లేరా? ..." అని తన షాపులోని కుర్రవాడితో అని, "పర్లేదు రండి... ఇస్తాడు, తీసుకు వెళ్ళండి..." అన్నాడు పాండుతో.

త్వరత్వరగా తన పని ముగించుకుని, అదే పద్ధతిలో మరి రెండు షాపుల్లో అవే టాబ్లెట్లు కొన్నాడు.

మరొక నిజం- 'తను పెద్ద అబద్ధాల కోరు కూడా!' అనుకున్నాడు మనసులో.

అక్కడనుండి మస్తాన్ మటన్ దుకాణం దగ్గరకు వెళ్లేటప్పటికి అతను కూడా దుకాణం ముయ్యటానికి సర్దుకుంటు న్నాడు. అతని దగ్గర కుక్కలకు వేసే మాంసం తీసుకుని బయటకు వచ్చాడు.

అలాగే హార్డ్‌వేర్ షాపులో నైలాన్ తాడూ, కిరాణా షాపులో కారం కొని తన షాపింగ్ ముగించాడు పాండు.

★ ★ ★

గులాబ్ చంద్ ఇల్లు ఊరి మధ్యలో రద్దీగా ఉండే వీధిలో ఉంది. కాస్త ఎడంగా అయితే విశాలంగా కట్టించుకునే వీలు ఉన్నా... దొంగల భయం లేకుండా ఉంటుందని ఈ ఇరుకు వీధిలోనే కట్టించాడు.

అన్ని తలుపులకూ, బాల్కనీలకూ ఇనుప చట్రాలతో రక్షణ కల్పించి ఎవరూ ఇంట్లోకి చొరబడకుండా జాగ్రత్తలు తీసుకున్నాడు. ఈ మధ్యే ఇంటి తలుపులకు అలారం సిస్టం కూడా బిగించాడు. ఇంటి ముందు ఇరవై నాలుగు గంటలూ గూర్ఖాతో కాపలా పెట్టించాడు. పగలంతా కట్టివేసి ఉంచే రెండు డాబర్‌మేన్ జాతి కుక్కల్ని రాత్రి పూట ఇంటి ఆవరణలో వదులుతారు.

ఇన్ని సంరక్షణల మధ్య తన ఇంట్లోకి ఎవరూ చొరబడే ఛాన్సే లేదని నిశ్చింతగా ఉన్నాడు గులాబ్ చంద్.

రాత్రి పన్నెండు దాటిన తరువాత బాజీ రావు నుండి అతనికి ఫోన్ వచ్చింది- అర్జంటుగా మాట్లాడాలని.

"రేపు మాట్లాడకూడదూ..." ఆవలిస్తూ అన్నాడు గులాబ్ చంద్.

"కూడదు! ఇప్పుడే మాట్లాడాలి!!

అర్థంటు!!" ముక్తసరిగా అయినా స్పష్టంగా చెప్పాడు బాజీరావు.

తప్పదన్నట్లు, "సరే!" అన్నాడు గులాబ్ చంద్.

బాజీరావు అక్కడకు వచ్చేటప్పటికి మరొక అరగంట పట్టింది. అతను గేటు బయటే నిలబడి ఉంటే... కుక్కల్ని గొలుసులతో కట్టివేసి అప్పుడు గేటు తీశాడు గూర్ఖా.

"గేటు తియ్యటానికి ఎంత సేపు? " విసుగ్గా అన్నాడు బాజీరావు.

"కుక్కలు సార్... అవి అలవాటయిన ఒకరిద్దరిని తప్ప ఎవరినీ లోపలకు రానివ్వవు..." నసుగుతున్నట్లు చెప్పాడు గూర్ఖా.

ఇనుప గొలుసులతో కట్టివేసిన కుక్కల వైపు పరీక్షగా చూశాడు బాజీరావు. అవి కొత్త మనుషులను చూసి అరచి గోలచేసే కుక్కలు కాదు. సరాసరి మనిషి మీద పడి గొంతు మీద ఎటాక్ చేసేలా ట్రైనింగ్ ఇవ్వబడిన కుక్కలు.

అందుకే అవి బాజీరావుని చూసి కూడా అరవటం లేదు. వాటి మధ్య ఎవరైనా మనిషి చిక్కుకుంటే... అతనికి ఎలాంటి దుస్థితి పడుతుందో తలుచుకుంటే బాజీరావు శరీరం గగుర్పొడిచింది.

### కొత్తగాలి...



**మమ్మీ సాఫ్ట్‌వేర్**
**డాడీ హార్డ్‌వేర్**
**కిడ్డీస్ ఎవ్విర్‌వేర్!!**

– జి.వి.యస్.ప్రియంవద,
శ్రీకాకుళం

మరొకవైపు ఇన్ని సంరక్షణల మధ్య... ఈ ఇంట్లో రామకోటి దొంగతనం చేశాడంటే నమ్మరేమో అనిపించింది అతనికి. అంతలో రామకోటి రెప్యుటేషన్ గుర్తు చేసుకున్నాడు. అతను తలుచుకుంటే... చెయ్యలేని దొంగతనం లేదని అందరూ చెప్పుకుంటారు కదా! అందుకే ప్రతి ఒక్కరూ నమ్మక తప్పదు... అని అనుకున్నాడు. ఆలోచిస్తూ బాజీరావు ఇంట్లోకి నడిచాడు.

బాజీరావు లోపలకు వెళ్లగానే కుక్కలను మరలా గొలుసులు విప్పి ఇంటి ఆవరణలో తిరగటానికి వదిలాడు గూర్ఖా.

అప్పటికే ఆ ఇంటి డాబా మీద కూర్చుని ఉన్నాడు పాండు.

అతను ఈ ఇంటిని చూడగానే దీనికి ఉన్న సెక్యూరిటీ గురించి పసికట్టాడు. అందుకే ముందుగా ఆ వీధి చివర ఉన్న ఒక సామాన్యమయిన మధ్య తరగతి ఇంటి డాబా మీదకు చేరుకున్నాడు. అక్కడ నుండి ఒకొక్క డాబా దాటుకుంటూ ఇక్కడకు చేరుకున్నాడు. మధ్య మధ్యలో ఒకటి రెండు చోట్ల తప్ప డాబాలన్నీ దాదాపు ఆనుకుని ఉండటంతో... అతని పని మరింత సులువు అయింది. ఒక డాబా మీద నుండి మరొక డాబా మీదికి చేరుతున్న అతను చీకటి వలన ఎవరికీ కనపడలేదు.

అతను తను సంచరిస్తున్న ప్రతి ప్రదేశంలోనూ కారం పొడి చల్లటం మర్చిపోవటం లేదు. ఒకవేళ పోలీసు కుక్కల్ని పిలిపించినా... కారం ఘాటుకి అవి తన వాసన పసిగట్టలేవు.

బాజీరావు రావటం.. ఇంటిలోకి వెళ్లటం అతను పైనుండి గమనిస్తూనే ఉన్నాడు.

బాజీరావు లోపలకు వెళ్లగానే... గూర్ఖా తిరిగి కుక్కలను బయటకు కాపలాకు వదిలాడు. అయితే అవి ఎప్పటిలా చెంగు చెంగున ఉత్సాహంగా కాక.. నీరసంగా

బయటకు రావటాన్ని అతను పట్టించుకో లేదు.

అవి దాదాపు గంట ముందే పాండు డాబా మీద నుండి విసిరిన మాంసం ముద్ద తిని ఉన్నాయి. దానిలో తను తెచ్చిన నిద్ర మాత్రలు మెత్తగా నూరి కలిపి ఉంచాడు అతను. ఆ మత్తు వాటి నరాల్లోకి మెల్ల మెల్లగా చేరుతుంది.

అందుకే అవి ఎప్పటిలా చురుకుగా కాక.. నెమ్మదిగా ఇంటి వెనుకకు వెళ్లి... సౌకర్యంగా ఉన్న స్థలం చూసుకుని మత్తు లోకి జారుకున్నాయి.

తరువాత తనతో తెచ్చిన నైలాన్ తాడు డాబా మీద వాటర్ ట్యాంకుకి కట్టాడు. తాడు రెండవ చివర ఇంటి బెడ్ రూమ్ వెంటిలేటర్ వద్ద ఆగింది.

దానిని పట్టుకుని వెంటిలేటర్ వరకూ జారిన అతను వెంటిలేటర్‌కు ఉన్న గ్లాసు పలకలు ఒకటొకటిగా తొలగించి... వాటిని శబ్దం రాకుండా డాబా మీదకు చేర్చాడు.

తరువాత తన ఊపిరితిత్తులలోని గాలిని సాధ్యమైనంత బయటకు వదిలి తన శరీరాన్ని వెంటిలేటర్ నుండి బెడ్‌రూ మ్‌లోకి చొప్పించటం మొదలుపెట్టాడు.

అసాధ్యమనిపించే ఫీట్లు ప్రదర్శించే చైనీస్ సర్కస్ కళాకారుల్లాగా చీమ చిటుక్కమనే శబ్దం కాకుండా అతని శరీరం పాదరసం జారినట్లు ఆ ఖాళీ నుండి బెడ్ రూమ్‌లోకి జార సాగింది.

పూర్తిగా తను బెడ్‌రూమ్‌లోకి దిగక ముందే... బయట వేలాడుతున్న నైలాన్ తాడును కూడా వెంటిలేటర్ నుండి బెడ్ రూమ్ లోకి జార్చి తను తిరిగి వెళ్లటానికి మార్గం సుగమం చేసుకున్నాడు.

నెమ్మదిగా గదిలోకి దిగిన అతను చుట్టూ పరికించి చూశాడు.

గులాబ్ చంద్ ఇద్దరు పిల్లలు ఆ గదిలో నిద్రపోతున్నారు.

నిశ్శబ్దంగా ఆ గది నుండి బయటకు వచ్చాడు. డూప్లెక్స్ పద్ధతిలో కట్టబడిన ఆ భవనంలో బెడ్‌రూములు పైన ఉంటే.. హాల్, డైనింగ్‌రూమ్, కిచెన్ కింద ఉన్నాయి.

కింద హాల్‌లో నుండి మాటలు వినిపిస్తున్నాయి. అడుగులో అడుగు వేసుకుంటూ రెయిలింగ్ వరకూ వెళ్లి అక్కడి నీడలో నిలబడి కిందకు తొంగి చూశాడు.

బాజీరావు, గులాబ్ చంద్ హాల్‌లోని సోఫాలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"చెయ్యవలసింది అర్థమయింది కదా!... ఎక్కడా పొరపాటు మాట్లాడకూడదు..." చెప్తున్నాడు బాజీరావు.

"జరగని దొంగతనం జరిగిందని చెప్పాలంటే... కొద్దిగా జంకుగా ఉంది..." నసుగుతున్నాడు గులాబ్ చంద్?

"నువ్వు చేయవలసింది ఏమీ లేదు... మొత్తం నేను చూసుకుంటాను... ఉదయాన్నే దొంగతనం జరిగిందని నాకు ఫోన్ చేసి చెప్పు. పత్రికల వాళ్లకి చెప్పవలసింది చెప్పి నేను మేనేజ్ చేస్తాను. డోంట్ వర్రీ.."

తప్పక, "సరే!" అంటూ తల ఊపాడు గులాబ్ చంద్.

"అన్నట్లు... నీ ఇనప్పెట్టె తాళాలు

## కొత్తగాలి...

**ఎండలో**
**చెట్టు!**
**కుటుంబంలో**
**నాన్నలా..!!**

– డాక్యార్డ్ లక్ష్మీనాయుడు,
సింహాచలం

ఎక్కడ పెడతావ్?"

"అవి ఎప్పుడూ నా కళ్ళ ముందే ఉంటాయి..." ఎదురుగా టీపాయ్ మీద ఉన్న తాళాలు చూపిస్తూ చెప్పాడు. "రాత్రి నిద్రపోయేటప్పుడు కూడా తాళాలు నా బొడ్లోనే ఉంటాయి"

"వెరీ గుడ్!... ఇక నేను వెళ్తాను..." లేచాడు బాజీరావు.

ఇంట్లోనే నిలబడి... "గూర్ఖా!" గట్టిగా పిలిచాడు గులాబ్‌చంద్. "కుక్కల్ని కట్టి వేసి గేటు తియ్!... త్వరగా!!"

గూర్ఖా పరుగెత్తుకుంటూ వచ్చి జేబులో నుండి విజిల్ తీసి ఊదాడు.

ఆ విజిల్ వినగానే కుక్కలు పరుగెత్తు కుంటూ రావాలి. అయితే ప్రస్తుతం వాటి జాడే లేదు.

మరో రెండుసార్ల విజిల్ ఊదిన గూర్ఖా ఏం జరిగిందో చూడటానికి ఇంటి వెను కకు వెళ్లాడు.

అసహనంగా అక్కడే నిలబడ్డారు ఇద్దరూ!

వారు అక్కడ నిలబడింది కొన్ని నిమి షాలయినా... అనేక యుగాల్లాగా అనిపి స్తుంది వారికి జరుగుతున్న ఆలస్యం.

ఇంతలో పరుగెత్తుకుంటూ వచ్చాడు గూర్ఖా. అతని మొహం ఆందోళనతో నిండిపోయి ఉంది. "సాబ్... సాబ్!!... కుక్కలు రెండూ స్పృహ లేకుండా పడి ఉన్నాయి సాబ్..." పెద్దగా అరుస్తూ చెప్పాడు గూర్ఖా.

బాజీరావుకి ఏదో జరుగుతోందని అర్థం అయింది.

బహుశా తను ఆడించదలుచుకున్న నాటకం నిజంగా జరుగుతోందా?

అలా అయితే దొంగ ఏడి?

ఇప్పటికే ఇంట్లోకి వెళ్ళి ఉంటాడా? ...

ఆ అనుమానం రాగానే ఇంట్లోకి పరుగె త్తాడు బాజీరావు.

గులాబ్‌చంద్ అయోమయంగా అతనిని అనుసరించాడు.

హాల్‌లో టీపాయ్ మీద ఉండవలసిన ఇనప్పెట్టె తాళాలు లేవు. వాటి స్థానంలో ఒక తెల్ల కాగితం రెపరెపలాడుతుంది.

గులాబ్‌చంద్ "మర్‌గయారే!" అని అరుస్తూ గబగబా మెట్లెక్కి ఇనప్పెట్టె ఉన్న గదివైపు పరుగు తీశాడు.

బాజీరావు తెల్ల కాగితం చేతిలోకి తీసు కుని తెరచి చూశాడు. అతనిని ఆశ్చర్యప రుస్తూ అది అతనినే సంబోధించి ఉంది.

బాజీరావ్!

అన్యాయంగా రామకోటిని బాధపెట్టే ఆలోచనలు మానుకో! రామకోటి మీద దొంగకేసు సంగతి తరువాత ఆలోచిద్దువు. ముందు ఇప్పుడు జరిగిన దొంగసొమ్ము రికవరీ గురించి ఆలోచించు.

ఇంకా నీ ఆరాచకాలు రామకోటి మీద ఇలాగే కొనసాగితే... ఈ సారి మేము చొరబడేది నీ ఇంట్లోకే! అయితే ఈ సారి మేము ఎత్తుకు పోయేది నీ సొమ్ములు కాదు... నీ కొడుకు ప్రాణాలు!

మర్యాదగా రామకోటిని వదిలిపెట్టిన మరుక్షణం ఇప్పుడు దోచుకున్న సొమ్ము మీకు క్షేమంగా చేరుస్తాం...

ఆపై మీ ఇష్టం!

కింద ఎవరి సంతకం లేదు.

## కొత్తగాలి...

**కోరికలు**
**క్రోటాన్స్ లాంటివి**
**కట్ చేయకపోతే**
**మనుగడ సాగించలేం!**

– పి.వి. సుజాతారాయుడు,
సికింద్రాబాద్

ఇంతలో అతని ఆలోచనలను భగ్నం చేస్తూ పైనుండి గులాబ్‌చంద్ అరచిన అరుపు వినిపించింది.

పైకి పరుగెత్తుకుంటూ వెళ్ళిన బాజీరావుకు... తెరచి ఉంచిన ఇనప్పెట్టె, దాని ముందు నెత్తిన చెంగువేసుకు కూర్చున్న గులాబ్‌చంద్ కనిపించారు.

అప్పటికే ఇంట్లో అందరూ నిద్రలేచి గులాబ్‌చంద్ శోకాల్లో పాలు పంచుకుంటున్నారు.

"ష్‌ష్‌ష్..." గట్టిగా అన్నాడు బాజీరావు. "మీ సొమ్ము ఎక్కడికీ పోదు... గొడవ చెయ్యకండి..." అనునయిస్తూ చెప్పాడు.

"ఎక్కడికీ పోదేంటయ్యా... ఎప్పుడో పోయింది..." ఇంకా శృతి పెంచుతూ అన్నాడు గులాబ్‌చంద్.

"నోర్మూయ్యండి... ఎవరన్నా నోరు తెరిస్తే కాల్చి పారేస్తాను..." అంటూ రివాల్వర్ తియ్యబోయాడు బాజీరావు.

అప్పుడు కానీ... అందరూ శోకాలు ఆపలేదు.

"మీ సొమ్ము తెచ్చి ఇచ్చే బాధ్యత నాది. కానీ... ఈ విషయం ఎవరికీ తెలియకూడదు..." అంటూ వడివడిగా బయటకు వెళ్ళిపోయాడు.

అప్పటిదాకా జరగని దొంగతనం జరిగిందని ఎందుకు చెప్పమన్నాడో... ఇప్పుడు జరిగిన దొంగతనాన్ని ఎందుకు ఎవరికీ చెప్పవద్దంటున్నాడో... గులాబ్‌చంద్‌కి అర్థం కాలేదు.

మరుసటి రోజు ఉదయాన్నే రామకోటి ఇంటికి చేరాడు. ఆ తరువాత కాసేపటికి బాజీరావుకి ఫోన్ వచ్చింది- పోయిన నగలు గులాబ్‌చంద్ ఇంటిపైన వాటర్ ట్యాంకులో ఉన్నాయని.

బాజీరావు ఎంత ప్రయత్నించినా... ఆ రోజు దొంగతనం చేసింది ఎవరో తెలియలేదు.

అతను ఆ తరువాత రామకోటి జోలికి రాలేదు. కానీ... అతను సరైన సమయం కోసం ఎదురుచూస్తూ మాత్రమే ఊరుకున్నాడని పాండుకి తెలియదు.




**రో**జులు ఎప్పుడూ లేనంత ప్రశాంతంగా గడిచి పోతున్నాయి.

రామకోటి ఎన్నిసార్లు అడిగినా పాండు నవ్వి ఊరుకున్నాడు తప్ప... ఆ రోజు ఏం జరిగిందో చెప్పలేదు.

పాండు డిగ్రీ పూర్తికావటం, యూ.పీ.ఎస్.సీ. పరీక్షల్లో పాస్ అయి ఇంటర్వ్యూకి సెలక్ట్‌కావటం... అదేదో సహజమయిన విషయాల్లాగా జరిగిపోయాయి.

అతను తన మేధనంతా లగ్నం చేసి ఇంటర్వ్యూకి ప్రిపేర్ అవుతున్నాడు.

అలాంటి సమయంలో ఒక రోజు మిట్ట మధ్యాహ్నం పూట వారి ఇంటికి పోలీసు కానిస్టేబుల్ వచ్చాడు.

ఈ మధ్య రామకోటి ఇంటికి పోలీసులు వచ్చి చాలా కాలమయింది. మరలా ఇన్ని రోజుల తరువాత వచ్చిన కానిస్టేబుల్ రాక అందరినీ ఆశ్చర్యపరచింది.

"ఒకసారి బాజీరావుగారు వచ్చి కనిపించమన్నారు..." కాంతం ఇచ్చిన మంచినీళ్ళు తాగుతూ, రామకోటిని ఉద్దేశించి చెప్పాడు వచ్చినతను.

దీర్ఘంగా నిట్టూర్చి, "ఎప్పుడు రమ్మ

న్నారు?" అడిగాడు రామకోటి.

"నీ యిష్టం... వీలయినపుడు రమ్మన్నారు..."

ఆ మాటతో అప్పటివరకూ జరుగుతున్నది మౌనంగా చూస్తున్న పాండులో టెన్షన్ తగ్గిపోయింది.

బాజీరావు మరలా తన తండ్రిని ఏ కేసులోనో ఇరికించే ఉద్దేశంలో ఉన్నట్లయితే... ఇలా తీరిగ్గా సమయం ఉన్నప్పుడు వచ్చి కలవమని చెప్పడు. ఉన్నవాడిని ఉన్నట్లు తీసుకువెళ్ళేవారు. ఆ ధైర్యంతో పాండు తిరిగి తన చదువులో మునిగిపోయాడు.

ఆ సాయంత్రం రామకోటి బాజీరావుని కలుసుకున్నాడు.

పోలీస్‌స్టేషన్ చాలా ప్రశాంతంగా ఉంది.

బాజీరావు కూడా రామకోటిని చూడగానే నవ్వుతూ ఆహ్వానించి ఎదురుగా కూర్చోమన్నాడు.

"వద్దులే సార్..." చేతులు కట్టుకుని నిలబడ్తూ అన్నాడు రామకోటి. కూర్చోమని బలవంతం చెయ్యలేదు బాజీరావు.



చాలాసేపు ఆలోచిస్తున్నట్లు ఉండిపోయి చివరకు తప్పదన్నట్లు మొదలుపెట్టాడు.

"చూడు రామకోటీ... నీ మీద నాకు చాలా కోపం! ఎంతకోపం అంటే, నిన్ను చంపెయ్యాలన్నంత కోపం!! కానీ... ఇన్ని రోజులూ నా కోపాన్ని నాలోనే అణచుకోవలసి వచ్చింది. కారణం... నీ తరుపున నాకు అందిన బెదిరింపు. చిన్న చిన్న కారణాలతో తగాదాలు పెద్దవి చేసుకోవటం నాకు ఇష్టం ఉండదు. అందుకే ఇన్ని రోజులూ నేను నీ జోలికి రాలేదు. అయితే ఇప్పుడు మరలా నీ అవసరం పడింది. ఒక పని జరగాలి. అది ఎంతో పెద్ద పని. నీలాంటి వాడివల్ల తప్ప జరగని పని. అందుకే నిన్ను పిలిపించవలసి వచ్చింది..."

రామకోటి అభ్యంతరం చెప్పబోయాడు.



"నాకు తెలుసు రామకోటీ!... నాకు తెలుసు. 'దాదాపు మరణం అంచుల వరకూ తీసుకువెళ్ళినా ఒప్పుకోని వాడిని... ఇప్పుడు మాత్రం ఈ పని ఎందుకు చేస్తానని...' అనాలనుకుంటున్నావు కదూ! కరక్టే... అయితే! రామకోటీ నీ మరణాన్ని నువ్వు లెక్కచెయ్యలేదు! ఎందుకూ? ... నీ కొడుకు భవిష్యత్తు కోసం. అవునా! ...మరి నీ కొడుకు భవిష్యత్తే అనుమానంలో పడిందనుకో..."

రామకోటి కళ్ళు కోపంతో ఎర్రగా మారాయి. ఆవేశంతో ఏదో అనబోయాడు.

"అంత ఆవేశం వద్దు రామకోటీ... నేను చెప్పేది ప్రశాంతంగా విను! ముందుగా ఇదిగో... ఇది చూడు. నీ కొడుకు గురించి రిపోర్టు పంపమని ఢిల్లీ నుండి వచ్చిన కాగితాలు. హాయిగా కలెక్టర్ కావలసిన వాడు నీ కొడుకు. మన మధ్య గొడవలతో అతని భవిష్యత్తు చెడగొట్టకు." టేబుల్ సొరుగులోంచి కాగితాలు తీసిచూపిస్తూ అన్నాడు బాజీరావు.

అతని చేతిలోని కాగితాలు చూడగానే రామకోటి ఆవేశం చప్పున చల్లారింది. "నా

కొడుకు గురించి చెడ్డగా రాయటానికి ఏముంది? అబద్ధాలు రాసి వాడి జీవితాన్ని ఎందుకు పాడుచేస్తావ్?" ఆక్రోశంగా అడిగాడు.

"నిజమే! నేనూ అదే ఆలోచిస్తున్నాను... పోనీ ఒక పని చేద్దాం! ఇద్దరం ఇప్పటివరకూ జరిగిన విషయాలు మరిచిపోదాం. ...నీ కొడుకు గురించి బ్రహ్మాండంగా రిపోర్ట్ పంపే బాధ్యత నాది. అయితే ఒకటే షరతు. నువ్వు మాత్రం నాకు ఒక పని చేసిపెట్టు. ఇంక ఎప్పుడూ నీ సహాయం అడగను..."

రామకోటి ఆలోచనలో పడ్డాడు. ఉడిగిపోతున్న ఈ వయసులో తన నిజాయితీ నిరూపించుకోవటం కోసం... కొడుకు భవిష్యత్తు పాడుచెయ్యాలా? ... అని.

ఎంతకీ అతని ఆలోచన తెగలేదు.

అయినా ఈ వయసులో తను ఏమి చెయ్యగలడు?

"అయ్యా! నా వయసు అయిపోయింది. ఇప్పుడు నేను వెనుకటి రామకోటిని కాదు. వెతికితే... నాకంటే బాగా పనిచేసి పెట్టే వారు మీకు దొరకక పోరు..."

"లేదు... ఈ పని నువ్వు చెయ్యగలవు రామకోటీ... నాకు ఆ నమ్మకం ఉంది. ఆ మాటకొస్తే నేను నిన్ను తప్ప వేరేవారిని ఈ విషయంలో నమ్మలేను. నువ్వు ఊ... అను చాలు. మిగిలిన విషయాలు నేను చూసుకుంటాను."

రామకోటికి ఆలోచించుకునే సమయం కూడా ఇవ్వకుండా తన వాదనతో అతనిని ఒప్పించే ప్రయత్నం చేస్తున్నాడు బాజీరావు.

"సరే!..." బలవంతంగా అన్నాడు రామకోటి.

బాజీరావు మొహం ఆనందంతో వెలిగిపోయింది. "అన్నట్లు ...ఈ విషయంలో మీ ఊరి వారి సహాయం తీసుకోవద్దు. ఈ విషయం నీకు తప్ప ఎవరికీ తెలియడం నాకు ఇష్టం లేదు... అలా అయితేనే మిగిలిన విషయాలు మాట్లాడతాను..."

"ఈ విషయం వేరే వారికి తెలియటం నాకూ ఇష్టం లేదు..."

"భేష్... రోగి కోరిందీ, వైద్యుడిచ్చిందీ ఒకటే అవటమంటే ఇదే!"

"ముందు ఏమి చెయ్యాలో చెప్పండి.." విసుగ్గా అన్నాడు రామకోటి.

చెప్పటం మొదలుపెట్టాడు బాజీరావు.

★ ★ ★

"వద్దు నాన్నా... ఇన్ని సంవత్సరాల తరువాత ఇంత రిస్కు చెయ్యటం, అదీ మనసుకు నచ్చని పనిచెయ్యటం... నాకు ఇష్టం లేదు. ఇప్పుడు ఆ ఉద్యోగం రాకపోయినా కొంప మునగదు. మరొక మంచి ఉద్యోగం దొరుకుతుందన్న నమ్మకం నాకు ఉంది. ఒకవేళ ఉద్యోగం రాకపోయినా పర్వాలేదు. ఏదో విధంగా బతకలేకపోం. వద్దు!" చాలాసేపటి నుండి జరుగుతున్న చర్చకు ముగింపుగా అన్నాడు పాండు.

అయితే రామకోటికి సపోర్టు ఈసారి కాంతం నుండి వచ్చింది. "కలక్టరు కావటానికి అన్ని అర్హతలూ ఉన్న నువ్వు... మా ఇంట్లో పుట్టిన కారణంగా అనామకుడిగా మిగిలిపోకూడదు. మీ నాన్నను వెళ్ళ

**కొత్తగాలి...**

**నేటి**
**మన బాలలే**
**రేపటి**
**అమెరికా పౌరులు**

– ఇంద్రగంటి నరసింహమూర్తి,
కాకినాడ

నియ్!... మహా అయితే ఏమవుతుంది? ... పట్టుబడతాడు... అంతే కదా! పట్టుబడితే రెండేళ్ళు జైలులో కూర్చుని వస్తాడు... కొంప ఏమీ మునగదు!" తేల్చి చెప్పింది.

చేసేదేమీ లేక "సరే!" అన్నాడు పాండు. అయితే ఒక షరతు మీద మాత్రమే దీనికి ఒప్పుకుంటున్నానని ముందే స్పష్టం చేశాడు. రామకోటి ఆ పని చెయ్యవలసిన రోజు తను కూడా పక్కన ఉండాలన్నదే ఆ షరతు.

పాండు తన పక్కన ఉండటానికి అభ్యంతరం ఏమీలేదు. కానీ... ఎట్టి పరిస్థితులలోనూ తన పనిలో కల్పించుకోకూడదని హెచ్చరిస్తూ ఒప్పుకున్నాడు రామకోటి.

"ఇంతకీ బాజీరావు చెప్పిన పని ఏమిటి? "

క్లుప్తంగా చెప్పాడు రామకోటి. హైదరాబాద్‌లోని ఒక కోటీశ్వరుడి ఇంట్లోకివెళ్ళి... అతని సేఫ్‌లో ఉన్న ఎర్రబాక్సు తెచ్చి ఇవ్వాలి. డబ్బు, నగలు లాంటివి బాజీరావుకి అవసరం లేదు.

చిన్నగా నవ్వాడు పాండు. "ఇంకా ఏ రోజుల్లో ఉన్నావు నాన్నా!... ఇప్పుడు ఎవరూ విలువయిన వస్తువులు ఇంట్లో ఇనప్పెట్టెల్లో పెట్టుకోవటం లేదు."

"మరి అందులో ఏమి ఉండవచ్చు? ..."

"ఏ డాక్యుమెంటో... రహస్య పత్రమో ఉండి ఉంటుంది. అయినా బాజీరావుని అడగలేదూ అందులో ఏముందో? ..."

"అడిగాను... అతనికీ తెలియదంట..."

"మరి ఎలా? ... తీరా నువ్వు ఆ బాక్సుని తీసుకువచ్చాక అందులో అతనికి కావలసింది లేదంటే ఏమి చేస్తావ్? మరలా లోపలకు వెళ్తావా? "

"ఆ ఇంటికి సంబంధించిన ప్లానూ, సెక్యూరిటీ వివరాలూ అన్నీ అతనే ఇస్తున్నాడు. అతనికి కావలసిన వస్తువు అందులో ఉందో, లేదో నాకు అనవసరం!... ఆ బాక్సు తెచ్చి ఇవ్వటం వరకే నా పని."

"ఈ వ్యవహారమంతా అనుమానస్పదంగా అనిపించటం లేదూ..."

"అందుకే నిన్ను రావద్దంటున్నాను... నువ్వేమో వినటం లేదు."

"అనుమానంగా ఉంది కాబట్టే నేను రావాలనుకుంటున్నాను. ఒకరి కంటే ఇద్దరు ఉంటే నయం కదా!"

ఏమీ మాట్లాడలేదు రామకోటి.

అతనికి ఎన్నడూ లేనిది ఏదో అసహనంగా ఉంది. వెళ్ళొద్దన్నట్లు అతని మనసు హెచ్చరికలు పంపుతుంది. 'ముసలివాడిని అవటంవలన ఏమో...' అనుకున్నాడు కాసేపు. లేకపోతే ఇలాంటి పని చేసి చాలా రోజులు అవబట్టి అలా ఉందేమో అనుకున్నాడు మరి కాసేపు.

అంతే తప్ప ఒప్పుకున్న పని ఆపివేసే ఆలోచన అతనికి రాలేదు.

★ ★ ★

మరొకసారి బాజీరావుని కలిశాడు రామకోటి.

బాజీరావు తను ఇస్తానన్న ఇంటిప్లానూ, ఇతర వివరాలూ ఇచ్చాడు. చివరగా తను చెప్పదలుచుకున్నది క్లియర్‌గా చెప్పాడు. "ఈ రోజు తరువాత ఇక నన్ను కలవవద్దు. ఏమి చెయ్యాలో... ఏ రోజు చెయ్యాలో అన్నీ వివరంగా చెప్పాను కదా! ఆ రోజు నేను అక్కడ ఉంటాను. నిన్ను కలిసే బాధ్యత నాది. నువ్వు మాత్రం నన్ను కలవాలని ప్రయత్నించకు..."

'సరే!' అన్నట్లు తల ఊపి బయటకువచ్చాడు రామకోటి.

అతను బయటకు వెళ్ళగానే బాజీరావు ఫోను ఎత్తి డయల్ చేశాడు. అవతలవైపు మాట్లాడుతున్నది తనకు కావలసిన వ్యక్తే

అని రూఢి చేసుకుని తను చెప్పదలుచుకున్నది చెప్పాడు. "అతను బయలుదేరుతున్నాడు. అనుకున్న రోజు అనుకున్న పని పూర్తి అవుతుంది. మీ ఏర్పాట్లలో మీరు ఉండండి..." అని ఎవరికో చెప్పి ఫోన్ పెట్టేశాడు.

★ ★ ★

ఒక రోజు ముందుగానే హైదరాబాదు చేరుకున్నారు రామకోటి, పాండు.

వారిద్దరికీ ఆ నగరంతో పెద్ద పరిచయం లేదు. వారికి లగేజ్ కూడా ఎక్కువ లేదు. వారికి ఏ లాడ్జిలోనూ దిగే ఉద్దేశం లేదు. లాడ్జిలో దిగితే ఊరుపేరు చెప్పాలి. ఐడెంటిటీ ప్రూఫ్ చూపించాలి. తరువాత దొంగతనం జరిగిన సమయంలో తాము ఇక్కడ ఉన్నారని తెలిస్తే... అనుమానం తమ మీదకే వస్తుంది. అందుకే ఉన్న కాస్త సామానూ రైల్వేస్టేషన్ క్లాక్‌రూంలో పెట్టి బయటకు వచ్చారు.

అక్కడ నుండి తాము వెళ్ళవలసిన అడ్రసు గురించి ఎంక్వయిరీ చేసుకుంటూ... సిటీ బస్‌లో అక్కడకు వెళ్ళారు. ఆటోలో అయితే తేలికగా వెళ్ళవచ్చు కానీ... అలాంటి పోష్ ఏరియాలో దించిన ఇలాంటి లోక్లాస్ మనుషులను ఆటోవాళ్ళు తేలిగ్గా మరచిపోరు. తరువాత ఎంక్వయిరీలో తమ పోలికలు పోలీసులుకు తెలిపే అవకాశం ఇవ్వటం ఇష్టం లేదు రామకోటికి.

వారు వెళ్ళవలసిన అడ్రసు చేరుకుని... ఆ ఇంటిని పరిశీలనగా చూశారు.

అలాంటి ఇళ్ళు కూడా ఉంటాయా అన్నట్లు అందంగా, హుందాగా, గంభీరంగా ఉంది ఆ ఇల్లు.

దాని ఆనుపానులు పూర్తిగా గమనించటానికి వీలులేకుండా, చుట్టూకట్టిన ప్రహరీ గోడ దాదాపు ఎనిమిది అడుగుల ఎత్తులో ఉంది.

ఆ ఇంటి ముందు రోడ్డు మీద రెండు సార్లు అటూ ఇటూ తిరిగారు. కాసేపు ఆ ఇంటి ఎదురుగా నిలబడ్డారు.

రోడ్డు మీద ఆ ఇంటికి ఎదురుగా ఎక్కువ సేపు నిలబడితే అనుమానం వస్తుంది కాబట్టి... ఏమి చెయ్యాలో అర్థం కాలేదు.

పాండు తండ్రి చెవిలో మెల్లిగాచెప్పాడు - "ఆ ఇంటి వెనుక కొండ ఉంది చూడు... దాని మీద నుండి అయితే ఇల్లు పూర్తిగా కనిపిస్తుంది. మనం ఎవరికీ కనిపించే అవకాశం ఉండదు."

నిజమే! ఆ ఇల్లు కొండ మొదలులో కట్టారు. ఎత్తుపల్లాలు సరిచెయ్యటానికి గానూ కొండలో కొంత భాగాన్ని తొలచి ఆ కట్టడం కట్టారు. అంతేకాకుండా కొండ మీద ఉన్న కొన్ని పెద్ద పెద్ద శిలలు ఇంట్లో అమరినట్లు కనిపించటానికి... ఇంటిని బాగా వెనక్కి జరిపారు. దానితో అది దాదాపు కొండకు ఆనుకుని ఉంది.

అయితే సమస్య కొండ మీదకు వెళ్ళటం ఎలా అనే! అది పరిశీలించటానికి వారు కాలినడకన కొండ చుట్టూ ఒకసారి తిరిగి వచ్చారు. ఆ ఇంటి చుట్టు పక్కల పూర్తిగా ఇళ్ళు ఏర్పడలేదు. అక్కడక్కడా రోడ్డు మీద నుండి వెనుక ఉన్న కొండవరకూ ఖాళీ స్థలాలు కనిపిస్తున్నాయి. కొండపైకి చేరుకోవటం పెద్ద కష్టమేమీ కాదు. కాకపోతే... ఆ ప్రయత్నం పగలు చేస్తే ఎవరైనా చూసే అవకాశం ఉంది. అందుకే రాత్రికి ఆ పని చెయ్యాలని నిర్ణయించుకున్నారు.

ఒకసారి ప్లాను నిర్ణయించుకున్న తరువాత జరగవలసిన పనులు చకచకా జరిగిపోయాయి.

తిరిగి స్టేషన్‌కు చేరుకుని తమ లగేజ్ తీసుకున్నారు. పొద్దుపోయే వరకూ అక్క

# కథ అడ్డం తిరిగింది!

చతుర ప్రపంచం

ప్రపంచం గుర్తించనంత మాత్రాన మనలో ప్రతిభ లేదనుకోవడం పొరపాటు' అని అమెరికా చిత్రకారుడు థియోడర్ ఎస్. గెస్సెల్ చెప్పాడు. 'ఫ్లిట్' అనే పురుగులమందు కంపెనీలో ప్రకటనలకు బొమ్మలు వేస్తుండిన థియోడర్ తీరిక సమయాల్లో రాసేవాడు. 'ఎ స్టోరీ నోవన్‌కెన్ బీట్' అనే పుస్తకాన్ని పిల్లలకోసం రాసి, దానికి బొమ్మలు కూడా గీసి ప్రచురణకర్తలకు పంపాడు. మొత్తం ఇరవైఏడు మంది ఆయన పుస్తకాన్ని తిరగ్గొట్టారు.



ఆఖరుసారి తను రాసిన పుస్తకం ఓ ప్రచురణ సంస్థ నుండి తిరిగివచ్చాక ఆఫీసు నుంచి ఇంటికి వెళ్తూ పరిపరివిధాలా ఆలోచించాడు. దాన్ని కాల్చేస్తే తనకు మానసికవ్యధ ఉండదనుకున్నాడు. అయితే దారిలో చిన్ననాటి మిత్రుడు కనిపించాడు. మాటల్లో అతను 'వ్యాన్‌గార్డ్ ప్రెస్' ప్రచురణ సంస్థలో పిల్లల పుస్తక విభాగంలో ఎడిటర్‌నని చెప్పాడు. థియోడర్ వెంటనే అతనికి తన రచనను ఇచ్చి, ఓసారి చూసి బాగాలేకపోతే పడేయమని కోరాడు. ఆ మిత్రుడు పుస్తకాన్ని చదివి 'అండ్ టు థింక్ దట్ ఐసా ఇట్ ఆన్ మల్‌బెర్రీ స్ట్రీట్'గా పేరుమార్చి ప్రచురించాడు. ఆవిధంగా థియోడర్ మొదటి పిల్లలపుస్తకం వెలువడింది. దాంతో చివరికి తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి పిల్లల రచయితగా స్థిరపడ్డాడాయన. 1984లో అతనికి ఫిక్షన్‌లో పులిట్జర్ ప్రైజ్ కూడా లభించింది. 1991లో అతడు చనిపోయేనాటికి 46 పుస్తకాలు రాసాడు. అప్పటికి అతని పుస్తకాలు మొత్తం ఇరవైకోట్ల కాపీలు అమ్ముడయ్యాయి. వారానికి 15 వందల ఉత్తరాలు అభిమానుల నుంచి అతనికి వచ్చేవి.

డక్కడా కాలక్షేపం చేసి... చీకటిపడిన తరువాత తాము అనుకున్న ప్రదేశానికి చేరుకున్నారు.

రాత్రి చీకట్లో... తడబడుతూనే పైకి ఎక్కి అనువయిన ప్రదేశం చూసుకుని సెటిల్ అయ్యారు.

వారు తెచ్చుకున్న లగేజ్‌లో మంచి నీరూ, బిస్కెట్ ప్యాకెట్లూ ముందే పెట్టుకుని ఉండటంతో... రేపు రాత్రి వరకూ అలా ఎదురుచూడటం అంత కష్టమేమీ అవబోదు.

మరుసటి రోజు పగలంతా ఆ ఇంటినీ... దానిలోకి వచ్చిపోయే వారినీ గమనించారు. అంత పెద్ద ఇంట్లో పనిమనుషులుకాక ఉండే అసలు వ్యక్తులు ఇద్దరు ముగ్గురే!

ఆ రోజు మధ్యాహ్నం ఒక స్త్రీ పెద్ద కారులో బయటకు వెళ్ళటం కనిపించింది. ఆమెతో పాటు సూట్‌కేస్ ఉండటంతో బహుశా ఊరికి వెళ్తోందని ఊహించారు.

ఇంటిచుట్టూ ఆవరణంతా శుభ్రంగా ఉంది. స్విమ్మింగ్ పూల్‌లోని నీరు బ్లూ కలర్‌లో స్వచ్ఛంగా మెరుస్తున్నాయి. ఆ ఇల్లు రెండు అంతస్తుల్లో కట్టి ఉంది. పైనుండి చూస్తుంటే... త్రీ డైమెన్షన్ మీనియేచర్ బొమ్మలాగా కనిపిస్తుంది. ఇల్లంతా సెంట్రల్లీ ఏసీ పెట్టించారు. దాని కండెన్సర్లూ, చల్లటి గాలిని లోపలకు పంపే అల్యూమినియం డక్టులూ... డాబా పైన చాలా భాగం ఆక్రమించుకున్నాయి. అలాగే మరొకవైపు నుండి వేడిగాలి బయటకువచ్చే డక్టులు ఇంట్లో నుండి బయటకు వస్తున్నాయి.

"గులాబ్‌చంద్ ఇంటికి ఉన్నంత రక్షణ

కూడా ఇప్పుడు ఈ ఇంటికి లేదా? .." తనలో తను అనుకుంటున్నట్లు పైకే చెప్పేశాడు రామకోటి.

"...అంటే దొంగలు దోచుకుపోయే అంత విలువయిన వస్తువులేమీ ఇంట్లో ఉండి ఉండవు. లేదా ఏ దొంగా దోచుకోలేనంత గట్టి ఏర్పాట్లన్నా చేసి ఉండాలి".

"ఒకసారి ఇంట్లోకి వెళ్ళాక నేను తెరవలేని ఇనప్పెట్టె ఉంటుందనుకోను..."

అపనమ్మకంగా చూశాడు పాండు. తన తండ్రి ఈ వృత్తి మానేసి చాలాకాలం అయింది. అప్పటికీ, ఇప్పటికీ చాలా మార్పులు వచ్చాయి. లోపల ఎలాంటి లేటెస్ట్ మోడల్ సేఫ్ ఉందో ఎవరికి తెలుసు? ... దానిని తెరవటం అంత తేలిక అయితే... ఎక్కడినుండో తమను ఇంతదూరం పిలిపించవలసిన అవసరం ఏమి ఉంటుంది? ...

"ఈ సమయానికి బాజీరావు వస్తానన్నాడు... ఎక్కడ ఉంటాడో మాత్రం చెప్పలేదు..." అన్నాడు రామకోటి.

"అది వాడి సమస్య! పని అయ్యాక ఇంకొక్క క్షణం కూడా మనం ఇక్కడ ఉండవద్దు. వెంటనే మన ఊరు వెళ్లిపోవాలి..."

అంగీకరిస్తున్నట్లు తల ఊపాడు రామకోటి.

సమయం గడిచిపోయింది.

అర్ధరాత్రి దాటింది.

తన ఏర్పాట్లు మొదలుపెట్టాడు రామకోటి. మరొకసారి ఆ ఇంటి ప్లానూ, సేఫ్ ఉన్న స్థలం సరిచూసుకున్నాడు. తను తెచ్చుకున్న సరంజామా అంతా జాగ్రత్తగా సర్దుకుని బయలుదేరాడు.

పాండు ఇంటి ప్రహరీ వరకూ తండ్రిని అనుసరించాడు. 'ఒకవేళ ఏదన్నా ఇబ్బంది ఎదురయితే మాత్రం... తెగించి ముందుకు వెళ్ళకు. వెనక్కి వచ్చెయ్!... ఏ ఉద్యోగం అయినా, నీ ప్రాణం కంటే ఎక్కువ కాదు..." వీడ్కోలు ఇస్తూ చెప్పాడు.

కొడుకు చూపిస్తున్న ప్రేమకు కళ్ళలో నీళ్ళు తిరుగుతుంటే, 'సరే!' అన్నట్లు తల ఊపి... "నువ్వు మాత్రం, అదుగో! అక్కడ నిలబడి ఉండు. నా పని అయిన మరుక్షణం మేడ మీదకు వచ్చి వారు తెమ్మన్న బాక్సు నీకు విసిరివేస్తాను. ఒకవేళ నేను పట్టుబడినా... బాక్సుని బాజీరావుకి అందించవచ్చు.."

అంగీకరిస్తున్నట్లు తల ఊపాడు పాండు.

రామకోటి కొండమీద ఉన్న బండల మీదుగా ఇంటి కాంపౌండ్‌వాల్ మీదకు చేరుకున్నాడు. చేతిలో ఉన్న తాడు సాయంతో గోడమీదుగా లోపలకు జారి... వంగి పరుగెత్తుకుంటూ బిల్డింగ్ దగ్గరకు చేరాడు.

డాబా మీద నుండి వాన నీరు కిందకు పడటానికి డ్రైనేజ్ పైపు ఒకటి ఏర్పాటు చేసి ఉంది. చూస్తుండగానే దానిని పట్టుకుని చకచకా డాబాపైకి చేరుకున్నాడు.

వేడిగాలిని బయటకు పంపే డక్టు ద్వారా లోపలకు వెళ్ళాలని ముందే నిర్ణయించి పెట్టుకున్నాడు. దాని దగ్గరకు నడచి దానిని నిశితంగా పరిశీలించి చూశాడు. తరువాత అక్కడే కూర్చుని దానికి బిగించిన మూత విప్పటానికి స్క్రూలు లూజ్ చెయ్యటం మొదలుపెట్టాడు.

మరి కాసేపటికి ఆ డక్టులోకి దూరిపోయాడు రామకోటి.

ఆపై చేయగలిగింది ఏమీలేదు కనుక, తండ్రి చెప్పిన ప్రదేశంలోనే ఉండి ఎదురు చూడసాగాడు పాండు.

★ ★ ★

తల ముందు లోపలకు చేర్చి.. ఆ

సన్నటి లోహ మార్గంలోకి దూరిన రామ కోటి మొహానికి వేడిగాలి వెచ్చగా తగి లింది.

శరీరాన్ని సన్నని ఆ ఇరుకు మార్గంలో నుండి నెట్టుకుంటూ నెమ్మది నెమ్మదిగా... నిశ్శబ్దంగా ముందుకు జరుగుతున్నాడు అతను. అతని దగ్గర ఉన్న సమాచారం ప్రకారం సేఫ్ మొదటి అంతస్తులో ఉంది.

ఇంతలో అతను వెళ్తున్న మార్గం కిందకు మరలింది. ఒడుపుగా శరీరాన్ని కూడా దిశ మార్చి కిందకు దించటం మొదలుపెట్టాడు. ఇప్పుడు అతని శరీరం పూర్తి తలక్రిందులుగా ఉంది. చేతులతో ఇరుపక్కలా ఉన్న గోడలను బిగించి పట్టు కుని కిందకు జారాడు. తిరిగి మార్గం బల్ల పరుపుగా మారింది.

'మొదటి అంతస్తులోకి వచ్చాను...' అనుకున్నాడు అతను.

బయలుదేరటానికి ముందు చూసిన ఆ ఇంటి ప్లానుని కళ్ళముందు ఊహించు కుంటూ సేఫ్ ఉందనుకున్న ప్రదేశానికి జరుగుతున్నాడు.

తనకు కావలసిన ప్రదేశం వచ్చింది... అనుకున్న తరువాత, తను వెళుతున్న మార్గంలో ఉన్న రేకులు జాయింట్ చేసిన ప్రదేశంలో ఉన్న స్క్రూలు విప్పాడు.

ఏర్పడిన చిన్న సందు నుండి కింద ప్రదేశాన్ని గమనించాడు. కింద రూమ్ ఖాళీగా ఉంది.

రేకుల మధ్య ఏర్పడిన ఖాళీని మని షిపట్టే అంత పెంచి... రూమ్‌లోకి ఫాల్స్ సీలింగ్‌కి రంధ్రం చేసి... కింద కనిపి స్తున్న రూమ్‌లోకి నిశ్శబ్దంగా జారాడు.

ఆ రూమ్‌లో లైటు వెలగటం లేదు. అయినా బయటనుండి పడుతున్న మసక వెలుతురుకు వస్తువులన్నీ స్పష్టంగానే కని పిస్తున్నాయి. రూమ్‌లో ఒక మూల కని పించింది అతనికి కావలసిన సేఫ్.

కింది అంతస్తు నుండి ఇద్దరు మను

## సున్నానికే లేకుంటే అన్నమా?

గోపీచంద్, ప్రముఖ హాస్య రచయిత రావూరు వెంకట సత్యన్నారాయణ మిత్రులు. ఒకసారి హైదరాబాదులో రావూరును గోపీ చంద్ కలిశారు. అప్పుడాయన తనచేతిలోని



అరటిపళ్లను రావూరుకు ఇవ్వబోతూ, 'ఇందులో సగంపళ్లు మీకు..' అన్నారు.

దానికి రావూరువారు, 'నేను మా బంధు వుల ఇంట్లో భోజనానికి వెళుతున్నాను. వద్దు లెండి' అన్నారు.

దానికి గోపీచంద్, 'మీకీ వూళ్లో బంధు వులూ ఉన్నారా? భోజనమూ పెడుతు న్నారా.. తమలపాకులో సున్నమూ పెట్టని ఈ ఊళ్లో!?' అంటూ హాస్యమాడారు.

షులు మాట్లాడుకుంటున్న సంభాషణ విని పిస్తోంది. అందులో ఒక గొంతు బాగా ఆవేశంగా ఉంది.

దానిని పట్టించుకోకుండా సేఫ్ వైపు నడి చాడు రామకోటి. దానిని పరిశీలించి చూశాడు.

అది అప్పటివరకూ తను చూసిన ఏ సేఫ్‌లానూ లేదు.

బయోమెట్రిక్ పద్ధతిలో... కేవలం ఉద్దే శించిన వ్యక్తి చేత మాత్రమే తెరవబడే ఎలక్ట్రానిక్ సేఫ్ అది!

అది ఎలా పనిచేస్తుందో... దానిని ఎలా తెరవాలో రామకోటికి అర్థం కాలేదు.

ఎలాంటి ఇనప్పెట్టెనయినా తెరవగల నన్న అతని ఆత్మవిశ్వాసం సడలిపోయింది.

అంత చల్లని వాతావరణంలో కూడా అతని నుదుటిపై చెమట బిందువులు ఏర్పడసాగాయి.

కింద నుండి వినిపిస్తున్న మాటలు స్వరం పెరిగి వాదనలోకి దిగి ఘర్షణగా మారుతున్నాయి.

సమయం గడిచిపోతుంది.

రామకోటిలో నిర్వేదం పెరిగిపోతుంది.

ఇంతలో హఠాత్తుగా కింద నుండి ఒక వ్యక్తి విసవిసా పైకి వస్తున్నట్లు అడుగుల శబ్దం వినిపించింది.

కొత్తగాలి...



**ఆవరణంతా**
**వెన్నెల వెలుగులే!**
**అంతరంగంలోనే**
**చీకటి!!**

– ఎడ్వర్డ్ రాజ్‌త్రే,
హైదరాబాద్

చప్పున అలర్ట్ అయ్యాడు రామకోటి. చుట్టూ చూసిన అతనికి కర్టెన్లు తప్ప మరేమీ కనపడలేదు దాక్కోవటానికి.

చురుకుగా కదిలి పరదాల చాటుకు చేరుకున్నాడు.

ఇంతలో తలుపు తెరుచుకుని... నైట్ గౌన్ వేసుకున్న ఒక వ్యక్తి ఆవేశంగా లోపలకు వచ్చాడు. అటూ ఇటూ చూడకుండా సరాసరి సేఫ్ వద్దకు నడిచి అంతవరకూ రామకోటికి కనపడని బటన్ ఏదో నొక్కాడు.

సేఫ్‌లో నుండి నీలిరంగు కాంతి కిరణం వెలువడింది. అతను తన కంటిని ఆ కిరణానికి ఎదురుగా ఉంచాడు. ఆ కిరణం అతని కళ్ళని స్కాన్ చేసిన అనంతరం ఆటోమాటిక్‌గా సేఫ్ తలుపు తెరచుకుంది.

సేఫ్‌లో నుండి పిస్టల్ బయటకు తీసి... అదే వేగంతో వెనుతిరిగి గది బయటకు వెళ్ళిపోయాడు అతను.

ఆ ఆవేశంలో సేఫ్ మూయలేదు.

అదే అవకాశంగా రామకోటి వేగంగా సేఫ్ వద్దకు వెళ్ళి లోపలకు చూశాడు.

అతను తీసుకు వెళ్ళవలసిన ఎర్ర బాక్సు కనిపించింది. అది అతను ఊహించినదానికన్నా చాలా చిన్నదిగా ఉంది. బంగారు ఆభరణాలు పెట్టే బాక్సులాగా ఉంది అది. దాన్ని చేతిలోకి తీసుకున్నాడు.

ఇంతలో కింద నుండి 'దబ్'మన్న శబ్దం, నిశ్శబ్దంలో గట్టిగా వినిపించింది.

ఎవరో బాధతో అరచిన అరుపు మరింత పెద్దగా వినిపించింది.

రామకోటి త్వరత్వరగా బయటకు వచ్చాడు.

బయట కారిడార్ నిశ్శబ్దంగా ఉంది. దూరంగా కారిడార్ చివర డాబా మీదకి వెళ్ళే మెట్లు కనిపించాయి.

చిరుతలాగా వేగంగా పరుగెత్తుతూ మెట్లను చేరుకుని పైకి ఎక్కసాగాడు. మెట్లపైన డాబా మీదకు వెళ్ళే తలుపు తాళం వేసి ఉంది. అయితే దాన్ని తియ్యటం అతనికి పెద్ద కష్టమేమీ కాలేదు. కొన్ని క్షణాల్లోనే తలుపు తెరుచుకుంది.

ఇంతలో ఎవరో పరుగెత్తుతూ మెట్లవైపు వస్తున్న శబ్దం వినిపించింది.

రామకోటి తలుపు తీసుకుని డాబా మీదకు వెళ్ళి... కొడుకుని నిలబడి ఉండమని చెప్పిన వైపు చూశాడు.

అక్కడ పాండు లీలగా కనిపించాడు.

చేతిలోని బాక్సు కొడుకు వైపు విసిరివే

శాడు.

అతను బాక్సు విసిరివేసిన మరుక్షణం డాబా తలుపు తెరుచుకుని ఎవరో పైకి వచ్చిన శబ్దం అవటంతో వెనుతిరిగి చూశాడు.

ఎవరో ఒక వ్యక్తి చేతిలో పిస్టల్ పట్టుకుని నిలబడి ఉన్నాడు.

అతను సేఫ్‌లో నుండి పిస్టల్ తీసుకు వెళ్ళిన వ్యక్తి మాత్రం కాదు.

"చేతులు పైకి ఎత్తి కిందకు పద!... ఏ మాత్రం పిచ్చివేషాలు వేసినా ప్రాణాలు పోతాయి..." అన్నాడు అతను.

అతని కళ్లలోని తీక్షణత చూస్తే అన్నంత పనీ చేసేటట్లే కనిపించాడు.

చేసేదేమీ లేక రామకోటి అతను చెప్పినట్లే చేస్తూ... కిందకు నడిచాడు.

★ ★ ★

బయట ఎదురుచూస్తున్న పాండుకి తన తండ్రి పరుగెత్తుకుంటూ మేడ మీదకు వచ్చి తన వైపు ఏదో విసిరివెయ్యటం కనిపించింది.

చీకట్లో దూసుకువస్తున్న ఆ వస్తువు వైపు అనియంత్రితంగా చేతులు చాచాడు అతను.

సరిగ్గా వచ్చి చేతుల మధ్య ఇరుక్కుంది బాక్సు.

కళ్లు తిప్పి తిరిగి మేడ మీదకు చూసేటప్పటికి అక్కడి పరిస్థితి మారిపోయి ఉంది.

ఎవరో ఒక వ్యక్తి తన తండ్రిని బలవంతంగా తిరిగి ఇంటిలోకి తీసుకువెళ్తున్నాడు.

ఒకవేళ తను పట్టుబడితే... తన గురించి ఎదురు చూడకుండా, అక్కడి నుంచి వెళ్లిపోమన్న తండ్రి మాటలు గుర్తుకు వచ్చాయి పాండుకి.

అయితే చేతిలో ఉన్న బాక్సును ఏమి చెయ్యాలి?

బాజీరావుని నమ్మి దానిని అతనికి ఇచ్చేస్తే తరువాత తండ్రి పరిస్థితి ఏమిటి?

## నాకూ ఆనందమే!

హైదరాబాద్ రేడియో కేంద్రంలో అధికారిగా పనిచేసిన బాలాంత్రపు రజనీకాంతరావు, ఆకాశవాణిలోనే పనిచేస్తుండిన గోపీచంద్‌ను ఒకసారి అభినందిస్తూ, 'ప్రముఖ కవి కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి కుమారులైన మిమ్మల్ని కలవటం ఆనందంగా ఉంది' అన్నారు.



'కవి రాజహంసలూ.. కవిపుత్రులైన మిమ్మల్నీ కలవటం నాకూ ఆనందమే' అన్నారు గోపీచంద్. తర్వాత ఇద్దరూ నవ్వుకున్నారు.

బాలాంత్రపువారు 'కవిరాజ హంస' బిరుదు పొందిన తిరుపతి వేంకట కవుల వంశీయులు కావడంతో గోపీచంద్ అలా మాటకు మాట బదులిచ్చారు.

ఆలోచించటానికి ఎక్కువ సమయం లేదు. తనకు తోచిన నిర్ణయం వెంటనే తీసుకున్నాడు పాండు.

ఒక పెద్ద రాతికింద గుంట చేసి బాక్సును దానిలో పాతిపెట్టి రోడ్డు మీదకు బయలుదేరాడు.

అతను రోడ్డు మీదకు వచ్చేలోపు బిల్డింగ్ లోపల నుండి పిస్టల్ పేలిన శబ్దం వినిపించింది. అతనికి లోపల ఏమి జరుగుతుందో అర్థం కాలేదు. తను అక్కడ ఉండాలో... వెళ్లిపోవాలో కూడా అర్థం కావటం లేదు.

కాసేపటికి బిల్డింగ్ నుండి పెద్దపేలుడు వినిపించింది.

ఇక ఆలోచించకుండా వేగంగా రోడ్డు చివరకు అడుగులు వెయ్యబోయిన అతని భుజంమీద ఒక చెయ్యి పడింది.

ఉలిక్కిపడి వెనుకకు తిరిగి చూసిన అతనికి బాజీరావు కనిపించాడు.

"బాక్సు ఎక్కడ?" ఆత్రుతగా అడిగాడు అతను.

"ఏమి బాక్సు?" ఏమీ తెలియనట్లు ఎదురు ప్రశ్నించాడు పాండు.

"నాటకాలాడకు? మీ నాన్న నీకు ఏమీ ఇవ్వలేదా? ..."

## కొత్తగాలి...

**చిన్నప్పుడు**
**చిలకపలుకులు పలికినవాడే**
**మాటకు మాట బదులిస్తున్నాడు**
**వాడే వీడు!!**

– కె.వి. లక్ష్మణరావు,
మానేపల్లి, తూ. గో. జిల్లా

"మా నాన్న ఇంకా బయటికే రాలేదు. నాకెలా ఇస్తాడు?"

బాజీరావు ఆలోచనలో పడ్డాడు.

దానితో తన తండ్రి తనకి బాక్సు ఇచ్చిన విషయం అతనికి తెలియదని అర్థం అయింది.

"మీరిద్దరూ కలిసి నన్ను మోసం చేద్దామనుకుంటున్నారేమో! ఇద్దరినీ నాశనం చేస్తాను. మర్యాదగా చెప్పు! మీ నాన్న నీకేమీ ఇవ్వలేదూ? .."

పాండు సమాధానం చెప్పేలోపు సైరన్ మోగించుకుంటూ పెట్రోలింగ్ వాహనం అటు వచ్చింది. అది వేగంగా పేలుడు జరిగిన బిల్డింగ్‌వైపు వెళ్తుంది.

రోడ్డుమీద వీరిద్దరినీ చూసిన పోలీసు వాహనం అక్కడే ఆగింది. దానిలో నుండి ఒక పోలీసు ఆఫీసరు కిందకు దిగాడు.

"ఎవరు మీరు?" అధికార దర్పం గొంతులో ఉట్టిపడుతుంటే అడిగాడు అతను.

మఫ్టీలో ఉన్న బాజీరావును పోలీసుగా అతను గుర్తించలేదు.

బాజీరావుకి ఏమి చెప్పాలో అర్థం కాలేదు.

ఎక్కడో వందల కిలోమీటర్ల దూరంలో ఉండవలసిన తను ఇక్కడ ఎందుకు ఉన్నావంటే? ఏమి సమాధానం చెప్పాలి.

అందుకే ముందు నేరం అందుబాటులో ఉన్న పక్కవాడి మీదకు తోసేస్తే తరువాత సంగతి తరువాత చూసుకోవచ్చు.. అని అనుకున్నాడు.

వెంటనే స్టిఫ్‌గా సెల్యూట్ చేసి చెప్పాడు - "నేను మఫ్టీలో ఉన్న. సీ.ఐ.ని సర్! వీడు పెద్ద దొంగ. మా ఊర్లో దొంగతనం చేసి తప్పించుకు తిరుగుతున్నాడు. వీడిని పట్టుకోవటం కోసం ఇక్కడకు వచ్చాను. లక్కీగా దొరికాడు... తీసుకు వెళ్తున్నాను..."

"నీ ఐడి ఏది?"

చూపించాడు బాజీరావు.

ఆ ఆఫీసరు మరింకేదో అడగబోతున్నంతలో... ఫైరింజన్లు ఆ వీధిలోకి ప్రవేశించాయి.

అతనికి జరిగిన పేలుడు సంగతి గుర్తుకు వచ్చింది. "సరే... సరే..." అంటూ జీపు ఎక్కి కూర్చున్నాడు.

జీపు పేలుడు జరిగిన బిల్డింగ్‌వైపు వెళ్లిపోయింది.

బాజీరావుకి పాండుని దొంగగా కోర్టులో ప్రవేశపెట్టక తప్పని పరిస్థితి ఎదురయింది.

జరుగుతున్న పరిణామాలూ, ఏం జరి

గిందో తెలియని తండ్రి పరిస్థితి కలిసి పాండును అయోమయంలోకి నెట్టివేశాయి.

★ ★ ★

పాండు తేరుకునేటప్పటికి అతను కోర్టులో దొంగగా ప్రవేశపెట్టబడ్డాడు.

అతని మీద ఏవో నేరాలు ఆరోపించబడ్డాయి.

అవేమిటో కూడా అతను పట్టించుకోలేదు.

అతనికి వ్యతిరేకంగా ఎవరెవరో సాక్ష్యాలు చెప్పారు.

వారెవరో అతను గమనించనే లేదు.

మధ్య మధ్యలో అతని తల్లివచ్చి కలిసేది.

రెండు మూడుసార్లు బాజీరావు కూడా వచ్చి బాక్సు గురించి మరీ మరీ అడిగి వెళ్లాడు.

అయితే ఎవరికీ అతని తండ్రి గురించి మాత్రం తెలియదు.

మరి తన తండ్రి ఏమయ్యాడు.?

పోలీసులకు పట్టుబడలేదు.

ఒకవేళ పేలుడులో చనిపోయాడా? చనిపోయింది వేరే వ్యక్తి అని పోలీసులు ప్రకటించారు కదా! తన తండ్రి కూడా చనిపోయి ఉంటే శవం దొరకాలి కదా!

బాజీరావు తన తండ్రిని ఏదైనా చేసి ఉంటాడా?

ఆ బాక్సు దొరకనంత వరకూ అతను తన తండ్రిని చంపడు.

కాబట్టి తన తండ్రి బతికే ఉండి ఉండాలి. అలా అయితే మరి అజ్ఞాతంలో ఎందుకు ఉంటున్నట్లు? కనీసం తన తల్లినయినా ఎందుకు కలవలేదు?

ఎంత ఆలోచించినా అంతకంటే పాండు ఆలోచన ముందుకు సాగటం లేదు.

ఈ చిక్కుముడి బహుశా తను జైలు నుండి బయటపడితే తప్ప విడిపోదేమో!

అలా పాండు తన ఆలోచనలలో కొట్టుమిట్టాడుతున్నపుడే విచారణ పూర్తి అయింది. పాండుకి మూడేళ్ళు శిక్ష పడింది.

దూరంగా ఉన్న ఈ సెంట్రల్ జైలుకి తరలించ బడ్డాడు.




**వా**న ఎప్పుడు తగ్గిపోయిందో గమనించనే లేదు పాండు.

తన ఆలోచనల నుండి తేరుకునేటప్పటికి ఆకాశం నిర్మలంగా ఉంది. మబ్బుల చాటునుండి బయటపడిన సూర్యుడు శక్తినంతా పుంజుకుని ప్రతాపం చూపటం మొదలుపెట్టాడు.

కారిడార్లో సెంట్రీ పాండు సెల్ ముందు ఆగాడు.

తలుపు తాళం తీస్తూ - "వార్డెన్‌గారు అర్జంటుగా పిలుచుకు రమ్మన్నారు..." కారణం చెప్పాడు.

పాండు బయటకు రాగానే సెల్ తలుపు మూసి తాళం వేశాడు.

వార్డెన్ దగ్గర పాండుని హాజరుపరచి సెల్యూట్ చేశాడు సెంట్రీ.

అతన్ని వెళ్ళవచ్చు అన్నట్లు సైగ చేశాడు వార్డెన్.

సెంట్రీ బయటకు వెళ్లిపోయాడు.

వార్డెన్ తన ఎందురుగా ఉన్న ఫైల్ మూసేశాడు. ఫైలు మీద పేరును బట్టి

అది తనదే అని పాండుకి అర్థం అయింది.

"పాండూ!... నిన్ను సెల్ మారుద్దామనుకుంటున్నాను..."

ఎందుకన్నట్లు చూశాడు పాండు.

"చూడు పాండూ... నీకు చెప్పకుండా నేనే సెల్ మార్చవచ్చు. కానీ కారణం చెప్పటం వలన నీకూ... నీతో పాటు నీ సెల్‌లో ఉండబోతున్న మరో వ్యక్తికీ... ఇద్దరికీ సౌకర్యంగా ఉంటుంది"

"నా సౌకర్యం సంగతి ఎందుకులెండి? ..."

"ఆ ఎగతాళే వద్దు... నేను చెప్పేది జాగ్రత్తగా విను... నీ సెల్‌లో ఉండబోతోంది సహదేవ్ అని మన రాష్ట్రం మొత్తం మీద బాగా డబ్బున్న వ్యక్తి. నాయుడమ్మ అండ్ కంపెనీ గురించి వినే ఉంటావు కదా..."

"నిమ్స్‌లో బెడ్స్ ఖాళీ లేవా? "

అర్థం కానట్లు చూశాడు వార్డెన్.

"అంత డబ్బున్న వాళ్ళ జైలు అదే కదా!..."

సీరియస్‌గా ఉందామనుకున్నా... వార్డెన్ నవ్వకుండా ఉండలేకపోయాడు. "ఆ స్టేజ్‌లన్నీ అయిపోయాయి పాండూ! రెండేళ్లు నిమ్స్‌లోనే ఉన్నారు. హైకోర్టు కల్పించుకోవటంతో ఇక్కడికిరాక తప్పటం లేదు. ఆయన ప్రతికదలికనీ మీడియా భూతద్దంలో చూస్తుంది. ఇప్పుడు ఆయన ఒక్కడికీ వేరే గది ఇస్తే... మళ్ళీ అదొక అదనపు సౌకర్యం అని గోల చేస్తారు. నువ్వయితే బాగా చదువుకున్న వాడివి. ఎవరితో ఎలా మెలగాలో తెలిసిన వాడివి. అందుకే నిన్ను ఆయనతో ఉంచుదామనుకుంటున్నాను"

తనకు అభ్యంతరం లేదన్నట్లు భుజాలు ఎగరేశాడు పాండు.

★ ★ ★

సహదేవ్ జైలుకి వచ్చేలోపే అతనిని ఉంచబోయే గదిని సాధ్యమైనంత శుభ్రం చేశారు. ఎయిర్ ఫ్రెషనర్లు కొట్టారు. బూజులు దులిపారు. వాళ్ళు చేస్తున్న ఏర్పాట్లు చూసిన ఎవరైనా ఇన్‌స్పెక్షన్‌కి వస్తున్న పైఅధికారిని ప్రసన్నం చేసుకోవటానికి పడుతున్న పాట్లు అనుకుంటారు. కానీ... రాబోతున్న కొత్త ఖైదీ కోసం చేస్తున్న ఏర్పాట్లు అనుకోరు.

ఆ విధంగా సహదేవ్ కంటే ముందే అతన్ని ఉంచబోతున్న గదిలో ఉండి అతనికోసం జరుగుతున్న ఏర్పాట్లు చూస్తూ... అతని రాక కోసం ఎదురుచూస్తున్న పాండుకి... అసలు అతను ఎవరో? ఎలా ఉంటాడో అన్న కుతూహలం ఎక్కువయింది.

అతనిని ఎక్కువసేపు ఎదురుచూపులకు గురి చెయ్యకుండా... ఆ మధ్యాహ్నమే వచ్చేశాడు సహదేవ్!

దాదాపు యాభై ఏళ్ల వయసు ఉంటుందతనికి. మనిషి తెల్లని తెలుపు. తీర్చిదిద్దినట్లున్న రూపం, చెరగని జుట్టు, అప్పుడప్పుడే తెల్లబడుతున్న వెంట్రుకలు... పదిమందిలో నిలబడ్డా తన రూపం ద్వారానే ప్రత్యేక గుర్తింపు పొందగల ఆకారం అతనిది.

అతను రావటంతోనే జైలు సిబ్బంది మీద చిందులు వేస్తాడనీ... తనకి ఆ సౌకర్యం కావాలి, ఈ సౌకర్యం కావాలి.... అని హఠం చేస్తాడనీ అనుకున్న పాండుకు నిరాశ కలిగిస్తూ... అతను మామూలు ఖైదీలానే ప్రవర్తించాడు.

పలుకరింపుగా పాండుని చూసి ఒక నవ్వు నవ్విన అతను మౌనంగా తనకు కేటాయించిన స్థలంలో కూర్చుని, చేతులు వెనుకకు ఆనించి, కళ్లు మూసుకుని, ఆలోచనలలోకి జారిపోయాడు.

పాండుకి అతని ప్రవర్తనతో కొద్దిగా

నిరుత్సాహం కలిగింది. అయితే జైలుకు వచ్చిన కొత్తలో తను కూడా అలాగే ప్రవర్తించానన్న విషయం గుర్తుకు తెచ్చుకుని సమాధాన పడ్డాడు.

★ ★ ★

సహదేవ్ ఉదయాన్నే ఫ్రెష్ కావటానికి అవసరమయిన టూత్‌పేస్టూ, బ్రష్షూ, శుభ్రమయిన టవలూ, సోపూ, షాంపూ, గడ్డం చేసుకోవటానికి అద్దం, రేజర్ లాంటివి అన్నీ జైలు సిబ్బందే సమకూరుస్తున్నారు. వాటితో పని అవగానే... ఆ వస్తువులు సెల్‌లో కనపడకుండా తీసేస్తున్నారు. అతడికి ఆ వస్తువులు సమకూర్చిన ఆనవాళ్ళు ఎక్కడా లేకుండా జాగ్రత్తలు తీసుకుంటున్నారు.

## కొత్తగాలి...

**రైతు చెమట చుక్క**
**లోకానికి**
**ఆకలి తీర్చే**
**మహాసముద్రం**

*– జి. శ్రీశైలం,*
పెద్దచెల్మెడ, మెదక్ జిల్లా

'చక్కనమ్మ చిక్కినా అందమే!' అన్నట్లు డబ్బున్న వాడు జైలుకెళ్లినా భోగమే అనుకున్నాడు పాండు.

అంతేకాదు... ఉదయాన్నే చదువుకోటానికి పేపర్లు, కాలక్షేపానికి మేగజైన్లు, నవలలు, అన్నీ సమకూరుతున్నాయి. మూడు పూటలా అతను తినే ఆహారం ఇంటి నుండే వస్తుంది.

ఇన్ని రూల్సు... ఇంతమంది అతిక్రమిస్తున్నారంటేనే అతను ఎంత డబ్బు ఖర్చు పెడుతున్నాడో, అవసరమయితే ఇంకెంత ఖర్చు పెట్టగలడో అర్థమయిపోతుంది.

అయితే అన్ని సౌకర్యాల మధ్య కూడా అతను అసహనంతో రగిలిపోతున్నాడని గమనించాడు పాండు. కారణం ఏమిటో తెలుసుకోవాలన్న కుతూహలం కలుగుతున్నా... తను అనవసరమయిన విషయాలలో కల్పించుకోడన్న ఒకే ఒక్క కారణంతో తనని ఈ గదిలో ఉంచారన్న విషయం గుర్తుకువచ్చి పాండు మౌనంగా ఉండిపోయాడు.

★ ★ ★

రెండు వారాలు గడిచాయి.

ఇన్నాళ్ళూ తన తోటి ఖైదీలు మాట్లాడిస్తుంటే.. తను పొడిపొడి సమాధానాలు ఇస్తున్నప్పుడు వారికి ఎలా ఉండి ఉంటుందో ఇప్పుడు పాండుకి అర్థం అవుతోంది.

ఆ రోజు కూడా సహదేవ్ ధ్యానం చేస్తున్నట్లు కళ్ళుమూసుకుని కూర్చుని ఉన్నాడు. అతని పక్కన ఇంగ్లీషు న్యూస్ పేపర్ పడి ఉంది. కుతూహలంతో ఆ పేపరు తీసుకుని చూడటం మొదలుపెట్టాడు పాండు.

క్రీగంట గమనించినట్లున్నాడు సహదేవ్!... "అందులో సినిమా బొమ్మలు ఉండవు..." అన్నాడు.

పాండుకి అర్థం అయింది- అతని గురించి తనకు అంత ఉపోద్ఘాతం చెప్పిన వార్డెన్ తన గురించి అతనికి ఏమీ చెప్పలేదని.

"ఉన్నా... నాకు సినిమాల మీద ఆసక్తి ఉండదు..."

"మరి ఏమి చూస్తున్నావు ఆ పేపర్లో... క్రికెట్ స్కోర్లా? "

"నాకు వాటి మీద కూడా ఆసక్తి లేదు..."

"మరి నీకా పేపరు ఎందుకు? " వద్దనుకున్నా అతని గొంతులో ఎగతాళి ధ్వనించింది.

"మీరు కళ్ళుమూసుకుని ధ్యానం చేస్తున్న

ఇన్ని రోజుల్లో మీ కంపెనీ షేరు వాల్యూ ఎంత తగ్గిందా... అని చూస్తున్నాను."

కాసేపు నిశ్శబ్దం ఆ గదిలో రాజ్యమేలింది.

"నీ పేరేంటి? "

చెప్పాడు పాండు.

"నా పేరు..."

"నాకు తెలుసు..."

★ ★ ★

ఆ రోజు భోజనాల సమయంలో తన పళ్ళెం తీసుకుని బయటకు వెళ్ళబోతున్న పాండుని ఆపాడు సహదేవ్. "చూడు పాండూ... నాకెలాగూ ఇంటి నుండి భోజనం వస్తుంది. అది ఒక మనిషికి చాలా ఎక్కువ. నాతో కలిసి భోంచెయ్యవచ్చు కదా! నాకు కూడా కంపెనీ ఇచ్చినట్లు ఉంటుంది..."

"వద్దు సార్!... నేను రోజూ నాకు దొరికే భోజనమే చేస్తాను. ఈ రోజు మీరు రమ్మన్నారు కదా అని మీతో భోంచేస్తే... రేపటి నుండి రోజూ అదే కావాలనిపిస్తుంది. అంతగా మీకు తోడుకావాలంటే... నేను నా భోజనం తెచ్చుకుంటాను. ఇద్దరం కలిసి భోంచేద్దాం!" సమాధానం కోసం ఎదురు చూడకుండా వెళ్ళిపోయాడు పాండు.

వెళ్తున్న అతనిని చూస్తూ ఉండిపోయాడు. సహదేవ్.

★ ★ ★

మధ్యాహ్నం విశ్రాంతిగా కూర్చుని ఒక్కడే చిన్నరాళ్ళూ పెద్దరాళ్ళూ జరుపుతూ ఆడుకుంటున్నాడు. పాండు.

కుతూహలంగా చూసిన సహదేవ్ "ఏమిటా ఆట? " అని అడిగాడు.

"పులి జూదం..."

"ఎలా ఆడతారు? "

"ఎలా ఆడాలో వివరించి చెప్పాడు పాండు. "మీరూ ఆడతారా? "

సందేహిస్తూనే అతను వచ్చి పాండు ఎదురుగా కూర్చున్నాడు.

ఒకటి రెండు ఆటలు తరువాత సహదేవ్‌కి ఆ ఆట బాగానే అలవాటయ్యింది.

అప్పటి నుండి బోరుగా అనిపించినప్పుడల్లా ఇద్దరూ ఆ ఆటే ఆడుకునే వారు.

"మేకలను పులి చంపటంలో వింత లేదు. మేకలన్నీ కలిసి పులిని చంపగలగటమే ఈ ఆటలోని మజా.." సహదేవ్ ఆ ఆటను మెచ్చుకుంటూ అనేవాడు.

★ ★ ★

రోజులు గడిచేకొద్దీ ఇద్దరి మధ్యా పరిచయం పెరిగింది. చిన్న చిన్న సంభాషణలు చోటు చేసుకోవటం ప్రారంభించాయి.

"ఏం చదువుకున్నావ్? " ఒక రోజు విశ్రాంతిగా కూర్చున్నప్పుడు అడిగాడు సహదేవ్.

అందరికీ చెప్పినట్లే "పెద్దగా ఏమీ లేదు.." అని చెప్పాలనుకున్నాడు పాండు. అయితే సహదేవ్ స్వరంలో ధ్వనించిన నిజాయతీ గమనించాక అలా చెప్పలేకపోయాడు. అందుకే నిజం చెప్పాడు.

ఆశ్చర్యపోయాడు సహదేవ్.

"మరి అంత పెద్ద ఉద్యోగానికి అంత దగ్గరవరకూ వచ్చి.. నేరం చెయ్యవలసిన అవసరం ఏమి వచ్చింది? "

## కొత్తగాలి...

**బంధం నువ్వే**
**గంధం నువ్వే.. గ్రంథం నువ్వే**
**బాణం నువ్వే.. గాయం నువ్వే**
**గేయం నువ్వే**

– పట్ల యాదగిరి,
గుండాల, నల్గొండ జిల్లా

"జైలులో ఉన్న వారంతా నేరం చేశారన్న మీ అభిప్రాయం తప్పు సార్! ముందు అది మార్చుకోండి"

"అయితే నువ్వు ఏ నేరం చెయ్యకుండానే ఇక్కడకు వచ్చావా? " ఆశ్చర్యంగా అడిగాడు సహదేవ్.

"అవును..." బాధగా అన్నాడు పాండు.

"నీ బాధ నేను అర్థం చేసుకోగలను! ఎందుకంటే.. ఏ నేరం చెయ్యకుండా ఇన్నాళ్ళ నుండి శిక్ష అనుభవిస్తున్న నాకంటే ఆ విషయం ఎవరు అర్థం చేసుకోగలరు? "

ఈసారి ఆశ్యర్యపోవటం పాండు వంతయింది.

"మీరు కూడా ఏ నేరం చెయ్యలేదా? మరి జైలుకు ఎందుకు వచ్చారు? మీకు అభ్యంతరం లేకపోతే చెప్పవచ్చు కదా!"

"నా సంగతి అడిగే ముందు నీ కథ ఎందుకు చెప్పవు? "

"మిగిలిన విషయాలన్నీ పక్కన పెడితే.. ఇక్కడ మీరు నాకు జూనియర్! ముందు మీ విషయాలు చెప్పండి. తరువాత నా సంగతి చెప్తాను"

కాసేపు ఆలోచించిన సహదేవ్ తన కథ చెప్పటం మొదలుపెట్టాడు.

★ ★ ★

సహదేవ్ తండ్రి నాయుడమ్మ.

వారిది జమిందారీ వంశం. బ్రిటీషు ప్రభుత్వానికి అత్యంత సన్నిహితంగా మెలిగిన చరిత్ర వారిది.

నాయుడమ్మ విద్యాభ్యాసం అంతా ఇంగ్లాండులోనే జరిగింది.

అవి అప్పుడప్పుడే స్వాతంత్ర్యం వచ్చిన రోజులు.

జమీందారీ వారసత్వంగా వచ్చిన ఆస్తులు ఎంతకాలం ఉంటాయో తెలియని రోజులు.

ఉన్నత విద్య చదివి భారతదేశం వచ్చిన నాయుడమ్మకి ఇక్కడి రాజకీయ పరిస్థితులు త్వరగానే అర్థమయ్యాయి.

పెరిగిపోతున్న పేదరికాన్ని అరికట్టలేకపోయినా... ఆ నెపం వెయ్యటానికి ఎవరో ఒకరు కావలసిన తరుణం ఆసన్నమవుతుందని అతనికి అర్థం అయింది.

వెంటనే తమ స్థిరాస్తులన్నీ అమ్మివెయ్యటం మొదలుపెట్టాడు.

అతని మీద నమ్మకంతో అతని కుటుంబం పూర్తిగా అతని పక్షాన నిలిచింది.

అలా డబ్బు రూపంలోకి మార్చిన తమ ఆస్తులను స్విస్ బ్యాంకు ఎకౌంట్‌లోకి తరలించాడు.

ఇంగ్లాండులో చదువుకుంటున్నప్పుడు ఏర్పడిన అనేక పరిచయాలు అతనికి తను అనుకున్నది చెయ్యటంలో అన్ని విధాలుగా సహాయపడ్డాయి.

చివరకు భారత ప్రభుత్వం రాజభరణాలు రద్దుచేసి, భూ సంస్కరణలు ప్రవేశపెట్టేటప్పటికి... అతని నుండి స్వాధీనం చేసుకోవటానికి సెంటు భూమి కూడా మిగలలేదు.

ఆ విధంగా ప్రభుత్వం నుండి తన ఆస్తులు కాపాడుకున్న నాయుడమ్మ... నెమ్మదినెమ్మదిగా తన డబ్బును వ్యాపార రంగంలోకి మరలించాడు.

నాయుడమ్మ అండ్ కంపెనీ పేరుతో సివిల్ కాంట్రాక్టులు చెయ్యటానికి స్థాపించిన అతని కంపెనీ దేశంలోనే ప్రముఖ వ్యాపార సంస్థగా ఎదిగింది.

ముఖ్యంగా దేశానికి ఎప్పుడు ఏ రంగంలో అవసరం ఉంటుందో.. ఆ రంగాలన్నిటిలోకి తన వ్యాపారాలను విస్తరింప చేశాడు.

మొదట కొన్ని సంవత్సరాలు వ్యవసాయ ప్రాజెక్టుల మీద గురిపెట్టిన అతను... తరువాత ప్రభుత్వం ప్రయారి

టీలు మారటంతో రోడ్లు, ఫ్లై ఓవర్ల నిర్మాణంలోకి ప్రవేశించాడు.

అలా ఎప్పటికప్పుడు తనని తాను సవరించుకుంటూ అతని సంస్థ అగ్రస్థానంలోకి చేరింది.

అయితే నాయుడమ్మకి ఏనాడూ ఇక్కడి బ్యాంకుల మీదా, ఇక్కడి ప్రభుత్వాల మీద నమ్మకం లేదు.

అందుకే.. వ్యాపారంలో తను సంపాదిస్తున్న డబ్బు ఎప్పటికప్పుడు స్విస్ బ్యాంకుల్లోకి తరలించేవాడు.

సహదేవ్ ఎప్పుడయితే వ్యాపారంలో అందివచ్చాడో.. అతనికి తండ్రి చెప్పిన మొదటి పాఠం ఎప్పటికప్పుడు డబ్బును దేశం దాటించమని.

ఆ విషయంలో సహదేవ్‌కి తండ్రికి ఉన్నన్ని అనుమానాలు లేవు. అయినా తండ్రికి ఎదురు చెప్పటం ఇష్టంలేక అదే ధోరణి కొనసాగించాడు.

ఆ విధంగా వారి డబ్బు వందలాది కోట్లు స్విస్ బ్యాంకు ఖాతాలలో పోగయింది.

నాయుడమ్మ మరణం తరువాత సహదేవ్ మరింతగా తన కంపెనీని విస్తరించాడు. ఆర్థిక సంస్కరణల తర్వాత ప్రభుత్వం ఇస్తున్న సహకారాన్ని పూర్తిగా అందుకుని తన కంపెనీని అంతర్జాతీయ స్థాయికి పెంచాడు. ప్రపంచంలోని ఇతర దేశాలలో ఎయిర్‌పోర్టుల నిర్మాణ కాంట్రాక్టులు ఇప్పుడు నాయుడమ్మ అండ్ కంపెనీకి దక్కుతున్నాయి.

అంతటితో ఆగలేదు సహదేవ్.

భారతదేశంలో ఎక్కడ చూసినా పెరుగుతున్న రియల్ ఎస్టేట్ ధరలు అతన్ని ఆ దిశగా ఆలోచించేటట్లు చేశాయి. అలాగే విస్తరిస్తున్న భారత ఆర్థికశక్తికి తగినన్ని హోటళ్లు కూడా లేవని అతను గుర్తించాడు. అందుకే ఆ రెండు రంగాలలోకి తన కంపెనీని విస్తరింపచేయాలనుకున్నాడు.

అయితే ఈ రెండు రంగాలు అతని

## 'చతుర'లో మొదటి నవల



పుట్టగంటి గోపీకృష్ణ

పుట్టింది గుంటూరు జిల్లా కొల్లూరులో. స్థిరపడింది తెనాలిలో. చిన్నప్పటి నుండి సాహిత్యం అంటే అమితమైన ఆసక్తి. సాహిత్యం ఏ రకానిదైనా చదవటం నాకిష్టం. నా శ్రీమతి ప్రోత్సాహంతో మూడేళ్ల క్రితం రచనలు చేయటం మొదలుపెట్టాను. అప్పటి నుంచి నేను రాసిన నవలల్లో ప్రచురితమవుతున్న నాలుగో నవల ఇది. అయితే 'చతుర'లో ప్రచురితమవుతున్న నా తొలి నవల 'పులిజూదం'. ప్రతి రెండు మూడేళ్లకు వృత్తిరీత్యా ఊరు మారటం తప్పనిసరి. ప్రస్తుత నివాసం పూనేలో. కథలో కొత్తదనం కథనం ద్వారానే సిద్ధిస్తుందనేది నా విశ్వాసం. ఎంత వరకూ నా ప్రయత్నంలో సఫలీకృతుడినయ్యాననేది పాఠకులే తేల్చి చెప్పాలి. ఈ నవలను ప్రచురణకు స్వీకరించి ప్రోత్సహిస్తున్న 'చతుర' సంపాదకులకు కృతజ్ఞతాభివందనాలు.

చిరునామా :
పుట్టగంటి గోపీకృష్ణ,
సిండికేట్ బ్యాంక్,
జిఏటి నెం. 769. కూడల్ వాడి,
చిఖాలి, హవేలి(తాల్లూక్), పూనే (జిల్లా),
మహారాష్ట్ర - 412114

సంస్థకు కొత్తవి. తెలిసీ తెలియకుండా కొత్త రంగంలోకి అడుగుపెట్టి నష్టాలు మూటకట్టుకోవటం అతనికి ఇష్టంలేదు.

అందుకుగానూ అతనికి ఒక అనుభవజ్ఞుడు అవసరమయ్యాడు.

ఆ అన్వేషణలో భాగంగానే అతనికి శివరామన్‌తో పరిచయం అయింది.

★ ★ ★

శివరామన్‌కి చిన్నప్పటినుంచే విపరీతమైన తెలివితేటలు సంక్రమించాయి.

అతను తమిళనాడులోని తంజావూరు దగ్గర ఉన్న ఒక పల్లెటూర్లో జన్మించాడు.

చిన్నప్పటినుండి అతను తనకున్న తెలివితేటల వలన ప్రత్యేక గుర్తింపు పొందేవాడు. అయితే ఆ గుర్తింపులేవీ అతనికి తృప్తి కలిగించేవి కాదు. అన్ని తెలివితేటలున్న తనకు డబ్బెందుకులేదో అతనికి అర్థం అయ్యేది కాదు.

తెలివితేటలకూ, డబ్బు సంపాదనకూ సంబంధం లేదని అతనికి చాలామంది వివరించి చెప్పే ప్రయత్నం చేశారు.

అతను అర్థం చేసుకోవటానికి ఇష్టపడని విషయాల్లో అది కూడా ఒకటి.

డబ్బుతో పాటు అతనికి మరొక లోటు కూడా ఉంది. అతనికి సెంటిమెంట్లూ, ప్రేమలూ తెలియవు. ఎంత ప్రయత్నించినా అతనికి ఇంకొక మనిషిని ఎందుకు ప్రేమించాలో అర్థం అయ్యేది కాదు. తల్లిదండ్రులతో సహా అందరినీ అవసరాలకు మెట్లుగా వాడుకోవటమే అతనికి తెలుసు. అందుకే అతను పరిచయస్తులందరికీ ఒక తెలివిగల కుర్రవాడిగా గుర్తుండిపోయాడు తప్ప.. అంతకంటే ఎక్కువగా అతనితో ఎవరికీ గుర్తుంచుకోదగ్గ ఆప్యాయతలు, అనుబంధాలు లేవు.

అతనికి ఐఐటిలో సీటు వచ్చినప్పుడు ఊరంతా అతని తల్లితండ్రులను అదృష్టవంతులని అభినందించారు.

అతను ఆ ఊరి నుండి బయటి ప్రపంచంలోకి అడుగు పెట్టాడు.

అంతే!

ఆ తరువాత అతను ఇంతవరకూ తిరిగి ఆ ఊరు వెళ్ళలేదు.

ఐఐటీలో ఇంజనీరింగ్ పూర్తిచేసిన అతను ఆ తరువాత ఐఐఎంలో మేనేజ్‌మెంట్ డిగ్రీ పొందాడు.

చదువు పూర్తిచేసిన తరువాత అతనికి ఎన్నో అవకాశాలు వచ్చాయి. ప్రముఖ అంతర్జాతీయ కంపెనీలు ఆకర్షణీయమైన జీతాలు ఇవ్వటానికి ముందుకువచ్చాయి.

ఏదో ఒక కంపెనీలో జీతం తీసుకుంటూ జీవితాంతం పనిచెయ్యటం అన్నది అతను మొదటి నుండి అంగీకరించని విషయం.

తనే ఒక కంపెనీ స్థాపించాలి అన్నది అతని ఆశయం. అయితే ఏదో చిన్న కంపెనీ స్థాపించి నెమ్మదిగా పైకి ఎదిగే ఓపిక అతనికి లేదు.

తనకి దేవుడు ఇన్ని తెలివితేటలు ఇచ్చింది.. కష్టపడుతూ, నెమ్మదిగా పైకిరావటానికి కాదని అతని అభిప్రాయం.

అడ్డదారులు తొక్కుతూ పైకిరావటానికి మనదేశంలాంటి అనువయిన ప్రదేశం మరెక్కడా ఉండదని అతని గాఢమయిన

## కొత్తగాలి...

**'ఓ మైఫ్రెండ్' అంటూ**
**ఒకవైపు పలకరింపు**
**'ఇట్స్ మై లవ్‌స్టోరీ' అని**
**ఇంకోవైపు ముక్తాయింపు!**

– నేమాన సుభాష్ చంద్రబోస్,
శ్రీకాకుళం

నమ్మకం.

అందుకే అతను వేరే దేశాలలో వచ్చిన ఏ ఆఫరూ అంగీకరించలేదు.

ప్రస్తుతం అతను ఒక రియల్ఎస్టేట్ సంస్థలో పని చేస్తున్నాడు.

ఆకలితో ఉన్న చిరుత ఆహారం కోసం మాటువేసి ఎదురుచూస్తున్నట్లు.. అతను అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు.

★ ★ ★

నాయుడమ్మ అండ్ కంపెనీ రియల్ ఎస్టేట్ వ్యాపారంలోకి ప్రవేశించాలన్న నిర్ణయాన్ని బోర్డు ఆ రోజే అప్రూవ్ చేసింది.

సహదేవ్ ఆ ఆనందంలో ఉండగా సెక్రటరీ చెప్పింది- కన్వెన్షన్ సెంటర్లో రియల్ ఎస్టేట్ బూమ్ మీద సింపోజియం జరుగుతుందని.

అనుకోకుండా ఆ రోజు సాయంత్రం కుదుర్చుకున్న అపాయింట్మెంట్ వాయిదాపడటంతో సమయం ఎలా గడపాలో తెలియని పరిస్థితి ఏర్పడింది.

రోజూ అసలు తను ఇంట్లో గడపటం లేదని భార్య భారతి చేసే ఆరోపణలు గుర్తుకువచ్చి.. పోనీ ఆమెను తీసుకుని బయటకు వెళ్దామా అనుకున్నాడు.

వెంటనే భార్యకు ఫోన్ చేశాడు.

"ఏమిటి?" రహస్యంగా మాట్లాడుతున్నట్లు గుసగుసగా అంది భారతి.

"ఎక్కడ ఉన్నావ్?"

"ప్రివ్యూ థియేటర్లో!.. సినిమా సగం అయిపోయింది.."

హఠాత్తుగా అతనికి ఉదయాన్నే భార్య ఈరోజు ఏదో రిలీజ్ కాబోతున్న కొత్త సినిమా ప్రివ్యూకి వస్తారా.. అని అడగటం, తను కుదరదని చెప్పటం గుర్తుకు వచ్చింది.

ఇప్పుడు వెళ్తే అసహ్యంగా ఉంటుంది. అందుకే, "ఏమీలేదులే! ఎంజాయ్ ది మూవీ!" అని ఫోన్ పెట్టేశాడు.

అతనికి ఇంతలో మధ్యాహ్నం సెక్రటరీ చెప్పిన సింపోజియం గురించి గుర్తు కొచ్చింది.

వెంటనే డ్రైవర్ని కారు అటు తిప్పమని చెప్పాడు.

అది అంతర్జాతీయ కంపెనీలు పాల్గొంటున్న సింపోజియం.

అక్కడ పాల్గొంటున్నవారు తమతమ లేటెస్ట్ ప్రాజెక్టుల గురించి.. ఈ రంగంలో రాబోయే మార్పుల గురించి చర్చించుకుంటున్నారు.

వాటినన్నిటినీ గమనిస్తూ ఆసక్తిగా ముందుకు నడుస్తున్నాడు సహదేవ్.

ముంబయ్కి సంబంధించిన ఒక కంపెనీ ఏర్పాటు చేసిన స్టాల్ దగ్గర మిగిలిన చోట్లకంటే ఎక్కువమంది ఉండటం చూసి తను కూడా అటు నడిచాడు.

అక్కడ పోగయిన వ్యక్తులను ఉద్దేశించి అనర్గళంగా ఉపన్యసిస్తున్నాడు ఒక వ్యక్తి.

మార్కెటింగ్ నుండి ఫైనాన్స్ వరకూ, లీగల్ నుండి పొలిటికల్ వరకూ.. రియల్ ఎస్టేట్కు సంబంధించిన అన్ని విషయాల మీదా అతను చూపిస్తున్న అథారిటీ చూస్తే సహదేవ్కి ముచ్చటవేసింది. ఎటునుండి ఎవరు ఏ ప్రశ్న సంధించినా అతని దగ్గర సమాధానం తయారుగా ఉంటుంది.

మనిషి సన్నగా, నల్లగా సాధారణంగా ఉన్నాడు. జుట్టు బాగా పొట్టిగా కత్తిరించుకోవటంతో తలకాస్త పెద్దదిగా కనిపిస్తుంది. అతని కళ్ళు జ్ఞానంతో కూడిన చురుకుదనంతో మెరుస్తున్నాయి.

తనచుట్టూ ఉన్న మనుషులను ఉద్దేశించి మాట్లాడుతున్న అతను.. దూరంగా నిలబడి తననే గమనిస్తున్న సహదేవ్ని పరీక్షగా చూసి ఆహ్వానిస్తున్నట్లు నవ్వాడు.

అతని వేపు అమితంగా ఆకర్షింపబడిన

సహదేవ్ నిదానంగా అటుకేసి నడిచాడు.

అందరి ప్రశ్నలకూ సంతృప్తికరంగా సమాధానం చెప్పిన అతను.. నెమ్మదిగా సహదేవ్‌వైపు తిరిగాడు.

“హాలో సర్.. మే ఐ హెల్ప్ యూ? ”

“ముందు మీ పేరు తెలుసుకోవచ్చా? ”

“శివరామన్ సర్..”

“ఏమి చదువుకున్నారు? ”

చెప్పాడు శివరామన్.

“యా.. మిస్టర్ శివరామన్! నా పేరు సహదేవ్. నాయుడమ్మ అండ్ కంపెనీ ఛైర్మన్‌ని”

“చాలా ఆశ్చర్యం సర్! మీ అంత పెద్ద వారు ఇలా నాతో మాట్లాడటమే గొప్ప విషయం..”

నవ్వేశాడు సహదేవ్.

“మేము అతి త్వరలో రియల్ ఎస్టేట్ రంగంలోకి రాబోతున్నాం. ఈ రంగంలో మీకున్న నాలెడ్జి చూస్తుంటే.. మీరు మాకు ఉపయోగపడగలరని అనిపిస్తుంది. మీ ఫోన్ నెంబర్ ఇవ్వండి. తరువాత మిమ్మల్ని కాంటాక్ట్ చేస్తాను”

శివరామన్ తన కార్డు తీసి ఇచ్చాడు.

అది తీసుకుని మారు మాట్లాడకుండా వెనుతిరిగాడు సహదేవ్.

★ ★ ★

ఈ సంఘటన జరిగిన రెండునెలల వరకు సహదేవ్‌కు శివరామన్‌ని కాంటాక్ట్ చెయ్యవలసిన అవసరం రాలేదు.

ఈ మధ్యకాలంలో అతని ఇంజినీర్లు ఒక రియల్ ఎస్టేట్ ప్రాజెక్ట్ ప్లాన్ చేశారు.

అది తమ కంపెనీ నుండి వస్తున్న మొదటి ప్రాజెక్ట్ కాబట్టి పెద్దగా లాభాలు ఆశించకుండా.. కంపెనీకి మంచి పేరు వచ్చేలా ప్లాన్ చెయ్యమని ఆదేశించాడు సహదేవ్.

అందుకు అనుగుణంగా హైదరాబాద్ శివార్లలోని నలభై ఎకరాల స్థలం ఎన్నుకుని దానిని గేటెడ్ కమ్యూనిటీగా తీర్చిదిద్దటానికి ప్రణాళికలు తయారుచేశారు అతని ఉద్యోగులు.

కోట్ల రూపాయల విలువ చేసే పోష్ విల్లాల నుండి.. మధ్యతరగతి వారికి నచ్చే మీడియం రేంజ్ అపార్ట్‌మెంట్ల వరకూ.. అన్నీ ఆ గేటెడ్ కమ్యూనిటీ లోపలే ఉంటాయి. అందులో నివసించే వారికి అవసరమయిన పార్కులూ, జిమ్‌లూ, దేవాలయాలూ అన్నీ లోపలే ఏర్పాటు చేస్తారు. దానిని హైదరాబాద్ మొత్తానికి ఒక మోడల్ టౌన్‌షిప్‌గా డెవలప్ చెయ్యాలన్నది సహదేవ్ ఆశయం.

కంపెనీ లాయర్లు ఆ స్థలాలకు సంబంధించిన డాక్యుమెంట్లు తెప్పించి వెరిఫై చేశారు.

అతని రెప్రజెంటేటివ్‌లు స్థలం యజమానుల నుండి దానిని అమ్మటానికి అగ్రిమెంటు రాయించుకు వచ్చారు.

కట్టబోయే బిల్డింగులకు సంబంధించిన ప్లానులు తయారు అయ్యాయి.

ప్రాజెక్టు గురించి ప్రిలిమినరీ అప్రూవల్స్ తీసుకోవటానికి అవసరమయిన కాగితాలు తయారయ్యాయి.

అధికారికంగా ప్రకటించి రంగంలోకి దిగటమే మిగిలి ఉంది.

ఫైనల్ అప్రూవల్ కోసం ఆ ఫైలు సహదేవ్ ముందుకు వచ్చింది. ఏ రకంగా చూసినా అందులో ఏ లోపమూ కనిపించ లేదు అతనికి.

దానిమీద సంతకం పెట్టబోతున్న ఆఖరి నిమిషంలో.. అతనికి శివరామన్ గుర్తుకు వచ్చాడు. ‘ఫోన్ చేస్తే నష్టమేముంది? ’ అనుకున్న అతను శివరామన్‌ని కాంటాక్ట్ చేశాడు.

పలకరింపుల తర్వాత క్లుప్తంగా తాము చేపట్టబోతున్న ప్రాజెక్టు గురించి వివరం

# సాహసం శేయరా డింభకా!



అమెరికాకు చెందిన పీటర్‌బర్డ్‌కి చిన్నప్పటి నుంచి సముద్రప్రయాణం అంటే ఇష్టం. అతను నౌకాయానంలో ఓ సాహసం చేయదలిచాడు. అమెరికాలోని పశ్చిమతీరం శాన్‌ఫ్రాన్సిస్కో నుంచి ఆస్ట్రేలియాకు ఒక్కడే ఓ పడవలో వెళ్లదలిచాడు. అంతదాకా ఎవరూ చేయని సాహసమది.



1972లో అతను తెడ్లతో నడిచే పడవలో శాన్‌ఫ్రాన్సిస్కో నుంచి బయలు దేరాడు. దారిలో అతను ప్రాణాలతో ఉండేందుకు అవసరమైనవన్నీ ఆ పడవలో సమకూర్చుకున్నాడు. 938 రోజుల పాటు అతను పడవను నడుపుతూ దాదాపు ఆస్ట్రేలియా తీరానికి చేరుకున్నాడు. అయితే అక్కడి గ్రేట్ బేరియర్ రీఫ్ ప్రాంతానికి అతని పడవ చేరుకున్నాక సముద్ర ఉద్ధృతిని అది తట్టుకోలేదని సందేహించాడు. ఇంకా ముందుకు సాగడం ప్రాణాంతకమైన సాహసమని గ్రహించాడు పీటర్‌బర్డ్. వెంటనే తన పడవలోని వైర్‌లెస్ నుంచి సహాయం కోరుతూ తానున్న ప్రదేశ వివరాలను తెలిపాడు. 8,990 మైళ్ల దూరం పడవలో ప్రయాణించి, అంతదాకా అతడు అనేక ప్రమాదాలను ఎదుర్కొన్నాడు. అయితే తన గమ్యానికి కేవలం 33 మైళ్ల దూరంలో ఉన్న పీటర్‌బర్డ్‌ను ఆస్ట్రేలియా నావికాదళం రక్షించింది. అతను అలా వారి సాయం కోరి మంచి పనే చేసాడు. అతని పడవను తాడుతో కట్టి ఒడ్డుకు లాక్కెళుతుంటే దారిలోనే అది పగిలి రెండు ముక్కలయింది.

చాడు అతను.

"వెరీగుడ్ ప్రాజెక్ట్ సార్.. మీరు చెప్తున్న వివరాలను బట్టి ఇది తప్పనిసరిగా సక్సెస్ అయ్యే ప్రాజెక్ట్.."

తను అనుకున్నదే అయినా.. ఇంకొక వ్యక్తి నుండి తన ప్రాజెక్టుకు ప్రశంసలు వస్తుంటే ఆనందించకుండా ఉండలేకపోయాడు సహదేవ్.

"ఇంతకీ లాండ్ డీల్ అయిపోయిందా?" కుతూహలంగా అడిగాడు శివరామన్.

"ఆ.. అయిపోయినట్లే!"

"ఓనర్ ఎవరు? హైదరాబాద్‌లో మనం జాగ్రత్తగా ఉండవలసింది ఈ విషయంలోనే!"

"ఓనర్ లోకల్సే!" వారి పేర్లు చెప్తూ అన్నాడు సహదేవ్.

వారి పేర్లు వింటూనే అలర్ట్ అయ్యాడు శివరామన్.

"మీ దగ్గర ఆ లాండ్‌కి సంబంధించిన సర్వే నెంబర్లు ఉన్నాయా?"

"ఆ.. ఫైల్లో ఉన్నాయి.."

"కొద్దిగా చూసి చెప్పగలరా?"

సహదేవ్ గబగబా ఫైలంతా వెతికి లాండ్‌కి సంబంధించిన సేల్ డీడ్ కాపీలు తీసి వాటి సర్వే నెంబర్లు వరుసగా చెప్పాడు.

ఇటు నుండి సహదేవ్ చెప్తుంటే.. అటు శివరామన్ ఆ వివరాలన్నీ లాప్‌టాప్‌లో ఫీడ్ చేస్తున్నట్లు శబ్దాలు వినిపిస్తున్నాయి.

"నేను మిమ్మల్ని వెంటనే కాంటాక్ట్ చేస్తాను సర్.." అని ఫోన్ పెట్టేశాడు.

అతని స్వరంలో మునుపటి ఉత్సాహం లేకపోవటం గమనించాడు సహదేవ్.

పావుగంట తరువాత మరలా లైనులోకి వచ్చాడు శివరామన్.

"సారీ టు సే సో.. బట్ ఈ డీల్ మీరు చేసుకోకపోతే మంచిది.." సందేహిస్తూనే చెప్పాడు.

"ఎందుకు? "

"ఎందుకంటే..? " ఏదో చెప్పబోయి ఆగిపోయాడు అతను.

"అది ఫోన్‌లో చెప్పటం కంటే.. ప్రత్యక్షంగా వివరిస్తేనే బాగుంటుంది. నేను ఇప్పుడే బయలు దేరుతున్నాను. మరో రెండుగంటల్లో ఫ్లైట్ ఉంది. అన్ని విషయాలూ మీకు చెప్తాను"

"మంచిది.. ఎయిర్‌పోర్ట్‌కి కారు పంపిస్తాను. సరాసరి ఇక్కడికే వచ్చేయండి. మీరు వచ్చేవరకూ నేను ఆఫీసులోనే ఉంటాను"

శివరామన్ హైదరాబాద్ చేరుకుని సహదేవ్ ఆఫీసుకు వచ్చేటప్పటికి రాత్రి అయింది.

ఈ ప్రాజెక్టులో పనిచేసిన సిబ్బంది అందరూ సహదేవ్‌తో పాటు అతని కోసం ఎదురుచూస్తున్నారు.

బయటకు చెప్పకపోయినా.. తమకు ఇంత మందికి కనిపించని లోపం అతనికి ఏమి కనిపించిందా అన్న కుతూహలం అందరిలో ఉంది.

శివరామన్ రావటంతోనే అందరికీ 'సారీ' చెప్పాడు.

"నేనేదో మీకంటే తెలివయిన వాడిననీ.. గొప్పవాడిననీ రుజువు చేసుకోవటానికి ఈ పని చెయ్యటం లేదు. నాకు తెలిసి ఒక మోసం జరుగుతుంటే.. చూస్తూ ఊరుకోలేక వచ్చాను" అన్నాడు శివరామన్.

"మోసమా? " అందరూ ఒకేసారి అన్నారు.

"అవును. మీకు లాండ్ అమ్ముతున్న వారు అసలు ఓనర్స్ కాదు. మీరు గమనించారో, లేదో.. రేటు కూడా మీకు అనుకూలంగానే కుదిరింది.. ఆ లాండ్ త్వరగా వదిలించుకోవటానికే వారు తొందరపడుతున్నారు.."

"కానీ.. మేము అన్ని విధాలుగా వెరిఫై చేశామే!"

"చేశారు. కానీ జరిగిన మోసం చాలా పాతది. అందుకే మీ దృష్టికి రాలేదు. అసలేం జరిగిందంటే.. మీరు కొందామనుకుంటున్న స్థలం అసలు యజమానులు - నిజాం వారసులు. నగరానికి ఎక్కువ దూరంలో బయట ఉన్న ఈ స్థలం ముందు ముందు ఇంత విలువ చేస్తుందని వారు ఊహించలేదు. అందుకే దాని గురించి వారు పట్టించుకోలేదు. పైగా వారు ఆస్ట్రేలియాలో సెటిల్ అవటంతో.. ఇక్కడి వివరాలు, లేటెస్ట్ డెవలప్‌మెంట్స్ గురించి వారికి ఆలస్యంగా తెలిసింది. ఈ స్థలాలను స్వాధీనం చేసుకోవటానికి తమ తరపున ఇక్కడ ఒక లాయర్ని పెట్టుకున్నారు. అతని ఎంక్వయిరీలో ఈ స్థలాలన్నీ ఇప్పటికే అనేకమంది చేతులు మారాయని తేలింది. అతను అదే విషయం వారికి తెలియచేశాడు. ఇప్పుడు వారు స్వయంగా ఇక్కడకు రాబోతున్నారు. తమ దగ్గర ఉన్న డాక్యుమెంట్స్ సమర్పించి తమ స్థలం తమకు అప్పచెప్పమని ప్రభుత్వాన్ని అడగబోతున్నారు. ఒక రాజకీయ పార్టీ వారికి సహకరించబోతోంది. ఈ సమస్య ఎప్పటికి తేలుతుందో ఎవరికీ తెలియదు. అది తేలేవరకూ మీ ప్రాజెక్టు ముందుకు జరగదు.."

వింటున్న అందరి కళ్లూ ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

"ఎవరికీ తెలియని ఈ విషయాలు మీకు ఎలా తెలిశాయి? " ఎవరో ఇంకా అనుమానంగా అడిగారు.

"వారు ఏర్పాటు చేసుకున్న లాయర్ నా

స్నేహితుడే! అయినా ఈ విషయం వచ్చే గురువారం ప్రెస్‌మీట్ పెట్టి వారే చెప్పబో తున్నారు. మీరు అప్పటి వరకూ రిజిస్ట్రే షన్ ఆపుకోండి. అన్ని విషయాలూ బహి ర్గతమవుతాయి.

ఆ హాలంతా నిశ్శబ్దంతో నిండిపో యింది.

సహదేవ్ ముందుగా తేరుకున్నాడు.

"ఎవరూ నిరుత్సాహ పడవలసిన అవ సరం లేదు. మనకి ప్రస్తుతం జరిగిన నష్టం ఏమీ లేదు! కాకపోతే మరొక స్థలం దొరికే సరికి సమయం పడుతుంది. కాబట్టి మన ప్రాజెక్ట్ కొంత ఆలస్యం కావచ్చు. బెటర్ లేట్ దాన్ నెవర్! రేపటి నుండి మరొక స్థలం కోసం అన్వేషణ ప్రారంభిద్దాం!"

అందరూ అతని పాజిటివ్ దృక్పథానికి స్పందించి చప్పట్లు కొట్టారు.

సమావేశం ముగిసిందనుకుంటున్న సమయంలో.. శివరామన్ సన్నగా దగ్గాడు.

అందరి దృష్టీ మరలా శివరామన్‌వైపు తిరిగింది.

"మీ ప్రాజెక్ట్ లేటయ్యే అవసరం కూడా లేదు. మీకు అంగీకారం అయ్యే పక్షంలో సరిగ్గా మీ ప్రాజెక్ట్‌కు సరిపోయే స్థలం నేను చూపిస్తాను. మిగిలిన విషయాలన్నీ అంగీకారం అయిన పక్షంలో.. ఆ డీల్ కుదుర్చుకుని మీరు అనుకున్న సమయా నికి మీ ప్రాజెక్ట్ పూర్తి చేసుకోవచ్చు"

"మీ దగ్గరలేని సొల్యూషన్ లేదా?" ఆనందంగా అన్నాడు సహదేవ్.

"ప్రపంచంలో ప్రాబ్లమ్స్ ఉన్నంత వరకూ వాటి పరిష్కారాలూ ఉంటూనే ఉంటాయి. మనం చేయవలసిందల్లా వాటిని వెతికి పట్టుకోవటమే!"

అందరి మనసులూ ఆనందంగా మారాయి. అక్కడ పండుగ వాతావరణం నెలకొంది.

అందరూ బయటకు వచ్చారు.

"కమాన్.. రండి! మా ఇంటికి వెళ్దాం" శివరామన్‌ని ఆహ్వానించాడు సహదేవ్.

"మీకెందుకు సార్ ఇబ్బంది.. నేను హోటల్‌కి వెళ్తాను.."

"మనం మాట్లాడుకోవలసిన విషయాలు ఇంకా ఉన్నాయనుకుంటున్నాను. తరు వాత హోటల్‌కి వెళ్దురులెండి.." అంటూ శివరామన్‌ని తన ఇంటికి తీసుకువెళ్లాడు సహదేవ్.

ఇంటికి వెళ్ళగానే అతని భార్య భారతిని 'అక్కా' అని పిలిచి వరుస కలిపాడు శివ రామన్.

ఆమె మొహమాటంగా నవ్వి భోజనాలు

## కొత్తగాలి...

**తాళి కట్టినప్పుడు ఆమె**
**తల వంచుకొంది, సిగ్గువల్ల కాదు!**
**ఆ మొగాడ్ని**
**కొనుక్కునే ఖర్మ పట్టినందుకు!!**

– ఎన్.కె. నాగేశ్వర్,
పెనుగొండ, ప.గో. జిల్లా

అవగానే పక్కకు వెళ్లిపోయింది.

చివరకు తను అడగదలుచుకుంది అడి గాడు సహదేవ్, "శివరామన్! మీరు మా కంపెనీలో ఎందుకు చేరకూడదు? మిమ్మల్ని మా కొత్త రియల్ ఎస్టేట్ డివి జన్‌కి వైస్ ప్రెసిడెంట్ చేస్తాను. మీరు అడిగినంత పేమెంట్ ఇస్తాను"

"ఇప్పటికిప్పుడు కంపెనీ మారట మంటే.. అయినా ఆలోచించి చెప్తాను.." అన్నాడు శివరామన్.

ఇంతలో ఏదో గుర్తుకు వచ్చి "అన్నట్లు, లాండ్ ఖరీదు పేమెంట్ ఎలా చేస్తు

న్నారు? " అన్నాడు.

"కొంటుంది కంపెనీ తరపున కదా! బ్లాక్‌లో కొనటం కుదరదు.. అందుకే మొత్తం ఖరీదు అఫీషియల్‌గానే చూపిస్తున్నాం.."

"ఇందాక మీరన్నారు కదా! నా దగ్గర ప్రతి సమస్యకీ ఒక సమాధానం ఉంటుందని.. మీరు వింటానంటే ఒక సలహా చెప్తాను.."

"చెప్పండి.. చెప్పండి.." కుతూహలంగా అడిగాడు సహదేవ్.

"మీరు కొనబోతున్న స్థలం నలభై కోట్లనుకోండి. దాని గవర్నమెంటు వాల్యూ పది కోట్లనుకోండి. కాగితాల మీద గవర్నమెంటు వాల్యూ చూపించి మిగిలింది బ్లాకులో ఇచ్చారనుకోండి.. పదిహేను శాతం టాక్సు, ఖర్చులు ఆదా అనుకుంటే.. ఇప్పటికిప్పుడు మీకు నాలుగున్నర కోట్ల ఆదాయం అన్నమాట. కాకపోతే ఈ పని చెయ్యాలంటే మీ దగ్గర ముప్పై కోట్ల బ్లాక్ మనీ ఉండాలి!"

"బ్లాక్ మనీ సమస్య కాదు. కానీ మనం స్థలం కొంటున్నది కంపెనీ పేరుతో కదా! తిరిగి మనం పెట్టుబడి పెట్టిన బ్లాక్ మనీ వసూలయ్యేది ఎలా? "

"నలభై కోట్ల స్థలంలో మీరు కట్టే టౌన్‌షిప్ విలువ వెయ్యికోట్లు ఉంటుందనుకోండి. దానిలో పది శాతం కాష్ పేమెంట్‌ను బిల్లు ఇవ్వకుండా తీసుకోండి. వంద కోట్లు వస్తుంది. ముప్పై కోట్ల పెట్టుబడితో రెండేళ్ళలో వంద కోట్లు సంపాదించవచ్చు."

"ముప్పై కోట్లు తీసుకురావటం పెద్ద విషయం కాదు. కానీ.. నా డబ్బు మొత్తం స్విస్ బ్యాంకులో ఉంది. అంత పెద్ద మొత్తం ఇండియన్ కరెన్సీలోకి మార్చి ఇక్కడకు తేవటం.."

"సమస్యే కాదు.. మీరు 'ఊ' అనండి. నాకు తెలిసిన హవాలా ఏజెంట్ ద్వారా మీకు కావలసిన సొమ్ము ఇండియన్ కరెన్సీలో అందే ఏర్పాటు చేయిస్తాను. మీరు మీ స్విస్ ఎకౌంట్ నుండి అతను చెప్పిన ఎకౌంట్‌కి ఫారిన్ కరెన్సీలో డబ్బు పంపండి"

సహదేవ్‌కి అతను చెప్తున్న మాటలు వింటుంటే.. అమృతం తాగినంత రుచిగా ఉంది. ఇటువంటి వ్యక్తిని ఇంతకాలం కలుసుకోనందుకు విచారిస్తూ ప్రస్తుతానికి అతనికి వీడ్కోలు పలికాడు.

ఇద్దరూ విడిపోయినా.. ఇద్దరి ఆలోచనలూ అంతవరకూ తమ మధ్య జరిగిన సంభాషణ చుట్టూనే పరిభ్రమిస్తున్నాయి.

సహదేవ్ తనకు రాబోతున్న వందల కోట్ల లాభం గురించి ఆలోచిస్తుంటే.. శివరామన్ ఆలోచనలు సహదేవ్ స్విస్ బ్యాంకు ఎకౌంట్ చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

★ ★ ★

సంభాషణ ముగించి శివరామన్‌కి గుడ్‌బై చెప్పి బెడ్‌రూంలోకి వెళ్ళిన సహదేవ్‌కి ఇంకా నిద్రపోని భారతి కనిపించింది.

"ఏమిటి? ఇంకా నిద్రపోలేదా? "

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పకుండా "ఎవరతను? " అని అడిగింది ఆమె.

"అతనా.. శివరామన్! అని గొప్ప తెలివితేటలు ఉన్న వ్యక్తి. ఈ రోజు మన కంపెనీకి మంచి సలహా ఇచ్చి రాబోతున్న పెద్ద నష్టాన్ని నివారించాడు. అంతేకాకుండా ముందు ముందు లాభాలు సంపాదించే ఐడియా కూడా ఇచ్చాడు"

"అతని తెలివితేటలు సంగతేమో కానీ.. మనిషి మాత్రం నిజాయతీపరుడూ, నమ్మదగిన వ్యక్తీ అనిపించటం లేదు"

"నీకెలా తెలుసు? " ఆశ్చర్యంగా అడిగాడు సహదేవ్.

"అతని కళ్ళలో నిజాయతీ లేదు. అవి

కపటత్వంతో నిండి ఉన్నాయి. నా మనసు అతనితో జాగ్రత్తగా ఉండమని చెబుతోంది"

"నాకేమీ అలా అన్పించలేదే? "

"మీరు నా మాట ఎప్పుడువిన్నారు కనుక! నేను చెప్పదలుచుకున్నది చెప్పాను. ఆపై మీ ఇష్టం.." అని అటు తిరిగి పడుకుంది ఆమె.



5

**శి**వరామన్ చెప్పిన విధంగానే లాండ్ డీల్ కుదుర్చుకుంది నాయుడమ్మ అండ్ కంపెనీ. పనులు పూర్తివేగంతో జరుగుతున్నాయి. ఆ ప్రాజెక్టుకు మంచి పేరు రావటంతో.. దానిలోని విల్లాలూ, అపార్ట్‌మెంట్లూ హాటు కేకుల్లాగా అమ్ముడుపోతున్నాయి. అవి కొంటున్నవారు కూడా పది శాతం బ్లాక్ మనీగా ఇవ్వటానికి సందేహించటం లేదు. సహదేవ్ స్విస్ బ్యాంక్ ఎకౌంట్‌లో డబ్బు ఎప్పటికన్నా ఎక్కువ వేగంగా పెరగసాగింది.

సహదేవ్ ఆహ్వానం మీద శివరామన్ వైస్ ప్రెసిడెంట్ హోదాలో అతని కంపెనీలో చేరాడు.

సహదేవ్‌కి శివరామన్ మీద పూర్తి నమ్మకం ఏర్పడింది. అలాగే శివరామన్‌కి సహదేవ్ ఇంట్లో చనువు బాగా పెరిగింది. ఇంట్లో మనిషిలా రాకపోకలు సాగిస్తున్నాడు. అతని మీద భారతి వెలిబుచ్చిన అభిప్రాయాలను అసలు పరిగణనలోకి తీసుకోలేదు సహదేవ్.

★ ★ ★

సంవత్సరం గడిచింది. మరొక పెద్ద ప్రాజెక్టుకు అంకురార్పణ చేశాడు శివరామన్. తను తయారుచేసిన కొత్త ప్రాజెక్టు గురించి చర్చించటానికి సహదేవ్‌తో పాటు అతని ఇంటి గార్డెన్‌లో స్విమ్మింగ్ పూల్ పక్కన కూర్చుని ఉన్నాడు.

ఈ మధ్య ఆఫీసు విషయాలు కూడా ఎక్కువగా ఇక్కడ కూర్చునే చర్చించుకుంటున్నారు వారిద్దరూ!

ఇద్దరి మధ్యా టేబుల్ మీద డ్రింక్సు ఉన్నాయి.

శివరామన్ అప్పుడప్పుడూ డ్రింక్ సిప్ చేస్తూ తన కొత్త ప్రణాళిక గురించి చెప్తున్నాడు.

"ఇది కనుక మనం సక్సెస్‌ఫుల్‌గా అమలు చెయ్యగలిగితే రాష్ట్రంలోనే కాదు, దేశంలోనే పెద్ద ప్రాజెక్టు అవుతుంది. హైదరాబాద్ నగరం రోజు రోజుకీ పెరిగిపోతోంది. దానికి తగినట్లు స్టార్ హోటల్స్ పెరగటం లేదు. ప్రస్తుతం నగరంలో ఫైవ్ స్టార్ హోటల్స్ కొరత బాగా ఉంది. అలాగే అంతర్జాతీయ స్థాయి సమావేశం ఏది జరగాలన్నా.. నగరంలో ఆ స్థాయికి తగ్గ సదుపాయాలు లేవు. ఉన్న ఒకటి రెండు సెంటర్లూ ట్రాఫిక్ మధ్య చిక్కుకుపోతున్నాయి. ఎయిర్‌పోర్ట్ వరకూ వచ్చిన అతిథులు సమావేశాలకు హాజరు కావటానికి కష్టపడవలసి వస్తుంది. ఒక్కొక్కసారి అసలు అటెండ్ కాకుండానే వెనుతిరగవలసి వస్తుంది"

"అవును! నాకూ అలాంటి అనుభవమే ఎదురయింది. ఒకరోజు సాయంత్రం ఎయిర్‌పోర్ట్‌లో ఫ్లైట్ దిగిన నేను ఇంటికి చేరేటప్పటికి అర్ధరాత్రి అయింది.."

"అందుకే మనం కట్టే హోటల్‌పైన హెలీపాడ్ ఉంటుంది. ఎయిర్‌పోర్ట్ నుండి హెలికాప్టర్ సర్వీసులు లభ్యం అవుతాయి. లేదా మనం కల్పిస్తాం. అతిథులు సరాసరి అయిదు నిమిషాలలో నగర విహారం చేస్తూ.. మన హోటల్ చేరుకుంటారు. అందులోనే ఒక పెద్ద ఆడిటోరియం అత్యంత ఆధునిక సదుపాయాలతో ఉంటుంది. అతిథులకు కావలసిన కాన్ఫరెన్సులు అక్కడే ఏర్పాటు చేసుకుంటారు.."

"కానీ.. ఊరి బయట ఎక్కడో హోటల్ ఉంటే అది ప్రజలకు అందుబాటులో ఉండదు కదా!"

"నేను ఊరి బయట సంగతి చెప్పటం లేదు. నగరం మధ్యలోనే కడదామని అంటున్నాను. అతి తక్కువ స్థలంలో.. ఎక్కువ అంతస్తులతో స్కైస్క్రాపర్ కడదాం! దానిని హోటల్‌తో పాటు వేరే అవసరాలకు కూడా వాడవచ్చు. కొన్ని అంతస్తులు ఆఫీస్ స్పేస్ కింద అమ్మే పక్షంలో ఎగబడి కొంటారు. పూర్తిగా నాలుగయిదు అంతస్తులు పార్కింగ్‌కు వదిలివెయ్యటంతో.. ఆ సమస్య కూడా ఉండదు"

"ఇన్ని సౌకర్యాలతో కట్టే హోటల్లో రేటు ఎంత పెట్టాలి? ఎంతమంది దీనిలో ఉండగలుగుతారు?" అనుమానంగా అడిగాడు సహదేవ్.

"ఈ మధ్యే హైదరాబాద్‌లోని ఒక పాత కాలం నాటి ప్యాలెస్‌ను ప్రభుత్వం నుండి లీజుకు తీసుకున్న ప్రముఖ హోటల్ చైన్.. దానిని ఫైవ్‌స్టార్ హోటల్‌గా మార్చింది. దానిలోని రాయల్ సూట్ అద్దె రోజుకు ఐదు లక్షలు. అది కొన్ని నెలల వరకూ ముందుగానే బుక్ అయింది తెలుసా? ఇప్పుడు మన దేశంలో డబ్బుకు కొరత లేదు. ఖర్చుపెట్టే అవకాశాలే లేవు. మనం జస్ట్ ఆ అవకాశాలు కల్పిస్తున్నాం! అంతే!!"

"ప్రాజెక్ట్ మొత్తం ఖర్చు ఎంతవుతుంది?"

"అప్పుడే చెప్పలేను. కానీ మనం ఇంత వరకూ టేకప్ చేసిన అన్నిటికంటే పెద్దదని మాత్రం చెప్పగలను"

"ఫైనాన్స్ ప్రాబ్లమవుతుందేమో!"

"లేదు. మొన్న మనం చేసిన వెంచర్ సూపర్ సక్సెస్ అవటంతో బ్యాంకులన్నీ మనకు ఫైనాన్స్ చెయ్యటానికి ఉవ్విళ్ళూరుతున్నాయి"

"మరి స్థలం సంగతి ఏమిటి?"

## కొత్తగాలి...

**సంహరణ కాదు**
**కావలసింది- సంస్కరణ!**
**మరణం కాదు**
**కావలసింది- మార్పు!!**

– చుండూరు ఉమాబాల,
హైదరాబాద్

"తయారుగా ఉంది. కాకపోతే రేటు బాగా ఎక్కువ. అందులో ఎక్కువ భాగం బ్లాక్‌లో పేమెంట్ ఇవ్వాలి"

"ఎంత చెప్తున్నారు రేటు?"

"వంద కోట్లు!"

"స్థలానికే అంతా!"

"తప్పదు! ఆ స్థలం అయితే మరి వెనక్కు చూసుకునే పనిలేదు"

"మన కంపెనీ ఇంత ఎదిగాక కూడా.. ఇంకా బ్లాక్‌లో డీల్ చేయవలసి రావటం అసౌకర్యంగా అనిపించటం లేదూ?"

"మన దేశంలో.. అందులో రియల్ ఎస్టేట్ రంగంలో ఇవన్నీ తప్పవు. ఇప్పుడు మనకు స్థలం అమ్మబోతున్న

వ్యక్తుల్నే తీసుకోండి. వారు రాజకీయాల్లో కీలక స్థానాలలో ఉన్నారు. వారికి రాబోయే ఎన్నికలలో ఖర్చుపెట్టడానికి బ్లాక్‌మనీ అవసరం. మీరు మొత్తం వైట్ మనీ ఇస్తే వారేమి చేసుకుంటారు? "

"మిగిలిన విషయాలన్నీ వెరిఫై చేశావు కదా? "

"ఆ విషయాలన్నీ నాకు వదిలెయ్యండి. మీ నిర్ణయం చెప్పండి చాలు.."

సహదేవ్ ఆలోచనలో మునిగిపోయాడు

ఆ రాత్రి సహదేవ్ కొత్త ప్రాజెక్టు గురించి భారతికి చెప్పాడు.

ఆమె శివరామన్ గురించి మరలా హెచ్చరించింది.

"డోంట్ వర్రీ భారతీ.. నువ్వు ఊహిస్తున్న చెడ్డతనం అతనిలో నాకేమీ కన్పించడం లేదు. పైగా మనం చేపడుతున్న ప్రాజెక్టులన్నీ కంపెనీ తరపున కదా! మనకి జరిగే వ్యక్తిగత నష్టం ఏమి ఉంటుంది? "

"ప్రాజెక్టు కంపెనీ పేరుతో అయినా.. స్థలం మీ షేరుతోనే కదా కొంటోంది? జరిగే మోసాలన్నీ అందులోనే జరుగుతున్నాయి. అందుకే ఒకటికి రెండుసార్లు పరిశీలించి కొనండి. జాగ్రత్తగా ఉండండి.."

ఆడవారి ఛాదస్తం కింద ఆమె మాటలను మరొకసారి కొట్టేశాడు సహదేవ్.

★ ★ ★

సహదేవ్ ఎన్ని విధాలుగా ఆలోచించినా శివరామన్ చెప్పిన ప్రణాళికలో లోపం కనబడలేదు. అందుకే.. అతను ఆ విషయంలో ముందుకు వెళ్ళటానికే నిర్ణయించుకున్నాడు.

ఈ లోపు కొనదలుచుకున్న లాండ్‌కి సంబంధించి లీగల్ క్లియరెన్సులన్నీ సంపాదించి తయారుగా ఉంచాడు శివరామన్.

ఇక పేమెంట్ చెయ్యటం ఒక్కటే మిగిలింది.

తిరిగి ఆ రాత్రి శివరామన్, సహదేవ్ ఇంటికి వచ్చాడు.

మొత్తం డెబ్భైకోట్లు హవాలా మార్గంలో తెప్పించాలని నిర్ణయించుకున్నారు.

"నాకు ఎప్పటినుండో ఒక అనుమానం.. స్విస్ బ్యాంకులో ఎకౌంట్ ఉన్న వాళ్ళు, అక్కడకు వెళ్ళకుండా ఎలా ఆపరేట్ చేస్తారా అని..? " శివరామన్ యథాలాపంగా అడిగినట్లు అడిగాడు.

అప్పటికే అతని మీద పూర్తి నమ్మకం ఏర్పడింది సహదేవ్‌కి. దానికితోడు కడుపులో చేరిన డ్రింకు అంతకుముందులేని ఉత్సాహాన్ని ఇస్తోంది.

"చూపిస్తాను.. రా!" అంటూ అతన్ని వెంటబెట్టుకుని ఇంట్లోకి నడిచాడు సహదేవ్.

ఇద్దరూ ఇంట్లోని పై అంతస్తులోకి వెళ్ళారు. ఇంతవరకూ శివరామన్ ఎన్నిసార్లు ఆ ఇంటికి వచ్చినా పై అంతస్తులోకి రాలేదు.

అక్కడి కారిడార్లో నుండి నడుచుకుంటూ ముందుకు వెళ్ళి ఒకగది ముందు ఆగారు. తన దగ్గర ఉన్న తాళం చెవి ఉపయోగించి గది తాళం తీశాడు సహదేవ్.

పరిసరాలన్నీ పరికిస్తూ.. ఆ ఇంటి ప్లాను మనసులోనే గుర్తుపెట్టుకుంటున్నాడు శివరామన్.

సహదేవ్ ముందు దారితీస్తుండగా.. అతనిని అనుసరిస్తూ శివరామన్ ఆ గదిలోకి నడిచాడు. గదిలో ఒక మూల అమాయకంగా నిలబడి ఉంది సేఫ్.

"ఐరిస్(కనుపాప)ను చూసి తెరచుకునే టెక్నాలజీతో పనిచేసే సేఫ్ ఇది.." చెప్పాడు సహదేవ్.

"వేలిముద్రలలానే ఏ మనిషి కంటి రెటీనా కూడా ఇంకొక మనిషి రెటీనాని పోలి ఉండదు. కేవలం నా కంటినే ఈ

సేఫ్ ఒప్పుకుంటుంది. మరెవరికీ తెరచుకోదు..”

తరువాత సేఫ్ తలుపు తెరిచాడు సహదేవ్. సినిమాలలో చూపినట్లు దానినిండా డబ్బులు ఉంటాయేమో అనుకున్న శివరామన్‌కి నిరుత్సాహం కలిగిస్తూ దానిలో కొన్ని డాక్యుమెంట్లు తప్ప ఏమీ కనపడలేదు. ఒక మూల మాత్రం నిగనిగలాడుతూ మెరుస్తున్న రివాల్వర్ కనిపించింది. డాక్యుమెంట్ల పక్కన ఒక చిన్న బాక్సు ఉంది. దానిని బయటకు తీసి తెరిచాడు సహదేవ్.

దానిలో నుండి బయట పడింది ఒక కాగితం. దాని మీద ఏదో రాసి ఉంది. దానితో పాటు ఒక చిన్న పుస్తకం కూడా ఉంది.

“ఇదేనా పాస్‌వర్డ్ అంటే..? ” ఆత్రుతగా అడిగాడు శివరామన్ దానిని పరిశీలనగా చూస్తూ.

జ్యూరిచ్‌లోని బ్యాంకు పేరు రాసి ఉన్న లెటర్‌హెడ్ మీద కొన్ని నెంబర్లు చేతితో రాసి ఉన్నాయి. ఎనిమిదీ, ఏడూ, సున్నా, పన్నెండూ, పదిహేడు.. ఆ పైన నెంబర్లు అతను చూసేలోపే సహదేవ్ కాగితం మడత పెట్టేశాడు.

“ఇది ఎకౌంట్ నెంబర్. పాస్‌వర్డ్ వేరేగా ఉంటుంది. అది రోజూ మారుతూ ఉంటుంది. అది ఎలా కాలిక్యులేట్ చెయ్యాలన్న వివరాలు ఈ పుస్తకంలో ఉంటాయి” చెప్పాడు సహదేవ్.

“ఎంత తేలికయిపోయింది సర్? కోట్ల రూపాయలు ఫింగర్‌టిప్స్ మీద ప్రపంచంలో ఎక్కడికయినా బదిలీ చెయ్యవచ్చు. ఇంత సులభ పద్ధతులు మన దేశంలో ఎప్పటికి వస్తాయో? అన్నట్లు ఒక అనుమానం సర్.. ఒకవేళ ఆ బాక్సు మొత్తం ఎవరి చేతిలో అయినా పడిందనుకోండి! అప్పుడు పరిస్థితి ఏమిటి? ”

“డబ్బు మీద ఆశ వదులుకోవటమే! అఫ్‌కోర్స్ వెంటనే నేను స్వయంగా స్విట్జ

ర్లాండ్ వెళ్తే.. నా వేలి ముద్రలూ, ఐరిస్ గుర్తులూ అక్కడ ఫీడ్ అయి ఉన్నాయి కాబట్టి.. నన్ను గుర్తుపట్టిన తరువాత.. నేను కోరితే నా ఎకౌంట్ నెంబరు మార్చి వేరే పాస్‌వర్డ్ ఇస్తారు. కానీ ఈలోపు దానిని దొంగతనం చేసిన వ్యక్తి చూస్తూ ఊరుకోడు కదా! డబ్బు మొత్తం లాగెయ్యడూ? " నవ్వుతూ అన్నాడు సహదేవ్.

తరువాత మరలా సేఫ్ మూసి ఇద్దరూ కిందకు దిగి వచ్చారు.

"బాగా పొద్దుపోయింది. వెళ్ళివస్తాను, సర్!" అని వీడ్కోలు చెప్పి బయటకు వచ్చాడు శివరామన్.

అతని చురుకయిన మెదడు ఈ మొత్తం సెటప్‌లో ఒక లూప్‌హోల్ కనిపెట్టింది. దానిమీద తర్జన భర్జన పడుతూ అతను తన ఇంటివైపు వెళ్ళిపోయాడు.

★ ★ ★

సహదేవ్‌కి కావలసిన డెబ్బై కోట్లు అనుకున్న విధంగా అందాయి.

శివరామన్ ఆధ్వర్యంలో అన్ని పనులూ చకచకా జరుగుతున్నాయి. ఇప్పుడు సహదేవ్ మిగిలిన టీమ్ డీలా పడిపోయింది. అతను ప్రతి పనికీ శివరామన్ మీదే ఆధారపడుతున్నాడు. మిగిలినవారు చెప్పిన సలహాలు పట్టించుకునే స్థితిలో లేడు. కాబట్టి అందరూ రొటీన్‌గా పనులు చేసుకుపోతున్నారు తప్ప ఎవరూ వ్యక్తిగత శ్రద్ధ తీసుకోవటం లేదు.

అనుకున్న విధంగా రిజిస్ట్రేషన్ పూర్తి అయింది. డాక్యుమెంట్లు చేతికి రావటానికి ఇంకా సమయం ఉంది. ఆఫీసులో చిన్న సైజు పార్టీ జరిగింది. అందరూ శివరామన్‌ని ఆకాశానికి ఎత్తివేశారు. అయితే అతను మాత్రం ఎప్పటికన్నా ఎక్కువ మూడీగా ఉన్నాడు.

అతని ప్లాను మొదటి సగం అనుకున్న విధంగా పూర్తయింది. అందరూ అనుకుంటున్నట్లు స్థలం రిజిస్ట్రేషన్ పనయితే పూర్తయింది. కాని అది రిజిస్టర్ అయింది సహదేవ్ కంపెనీ పేరుమీద కానీ, సహదేవ్ పేరుమీద కానీ కాదు. శివరామన్ తన బినామీగా ఏర్పాటు చేసిన ఒక ముంబయ్ పార్టీకి ఆ స్థలం రిజిస్ట్రేషన్ చెయ్యబడింది. కంపెనీ తరపునా, తన తరపునా సహదేవ్ ఇచ్చిన పవర్ ఆఫ్ అటార్నీని అడ్డగోలుగా వాడి శివరామన్ ఈ పని చేశాడు. మరికొన్ని రోజుల్లో స్థలం కొన్న వ్యక్తి.. తిరిగి దానిని అసలు సొంతదారులకు బదలాయిస్తాడు. ఈ దొంగ డీల్‌లో సంపాదించిన డబ్బు.. స్థలం యజమానులూ, శివరామన్ కలిసి పంచుకుంటారు.

అయినా ఇంకా శివరామన్ తన అవతారం చాలించి పారిపోలేదంటే కారణం- ఆ రోజు రాత్రి సహదేవ్ ఇంట్లో సేఫ్‌లోని స్విస్ బ్యాంకు కాగితాలు దాచిన బాక్సు చూసినప్పటి నుండి.. అతనికి తన జీవితమంతా ఎదురుచూస్తున్న అవకాశం అదే అనిపించింది. ఎలాగైనా దానిని సంపాదించాలని అతని మనసు ఉవ్విళ్ళూరుతోంది.

అయితే అది అంత తేలిక కాదని అతనికి తెలుసు. తనకు కావలసినంత తెలివితేటలు ఇచ్చిన దేవుడు.. ఇలాంటి దొంగతనాలు చేసే నైపుణ్యం ఇవ్వలేదు. దానికి గానూ ఒక అనుభవజ్ఞుడు కావాలి. అతను వస్తున్నాడు. ఈ రాత్రికే పని పూర్తవుతుంది.

అప్పుడు ఆ బాక్సు తీసుకుని.. తన విషయం బయట పడేలోపు పారిపోతాడు.

ఇదీ అతని మొత్తం ప్లాను.

★ ★ ★

అనుకోని విధంగా జరిగిపోయిన సంఘటనలు తన జీవితాన్ని ఎలా మలుపు తిప్పాయో తలచుకుంటే సహదేవ్‌కి ఇంకా

ఆశ్చర్యంగా ఉంటుంది.

పైగా ఈ విధంగా జైలులో ఉండవలసి రావటం.. అది కూడా చెయ్యని నేరానికి.. అతనికి సహించరానిదిగా అనిపించేది. అయితే కాలం చాలా విషయాలను మర చిపోయేటట్లు చేస్తుంది.

అతను ఇప్పుడిప్పుడే అన్నీ మరచిపోయి తన జైలు జీవితానికి అలవాటుపడుతు న్నాడు.

అలాంటి సమయంలో మరలా ఒకసారి గతం తవ్వుకోవటంతో చేదు తిన్న నోరు లాగా మనసు కూడా వికారంగా మారింది.

"తరువాత ఏం జరిగింది? " ఏం చెప్ప కుండా మౌనంగా ఉన్న సహదేవ్‌ని అడి గాడు పాండు.

"ఆ రాత్రి చాలా విషయాలు జరి గాయి.. ఇప్పుడవన్నీ గుర్తు చేసుకుం టుంటే ఫాస్ట్ ఫార్వర్డ్‌లో ముందుకు జరిగి పోతున్న సినిమా సీను గుర్తుకు వస్తుంది. మందుమత్తులో ఉన్న నాకు జరిగిన విష యాలు పూర్తిగా గుర్తు కూడా లేవు. మొత్తానికి ఆ రాత్రి నేను శివరామన్‌ని చంపానని నన్ను పోలీసులు అరెస్టు చేశారు. ఎలా చంపానో.. ఎప్పుడు చంపానో వారు చెప్తేనే నాకు తెలిసింది. శివరామన్‌ని నేను పిస్టల్‌తో కాల్చి శవాన్ని మాయం చెయ్యటానికి గ్యాస్ సి లిండర్ పేలుడు సృష్టించానని పోలీసుల ఆరోపణ. అది చేసింది నేను కాదని ఎంత చెప్పినా, ఎవరూ పట్టించుకోలేదు. నాకు శిక్ష వేసికానీ అందరూ శాంతించలేదు"

పిస్టల్ కాల్పులు, గ్యాస్ సిలిండర్ పేలుడు అనగానే పాండు ఉలిక్కి పడ్డాడు.

"మీ ఇల్లు ఎక్కడ ఉంది? " ఆత్రుతగా అడిగాడు.

"హైదరాబాద్ జూబ్లీ హిల్స్‌లో..."

"సరిగ్గా చెప్పండి.. ఎక్కడ ఉందో? "

వివరంగా చెప్పాడు సహదేవ్.

అదే ఇల్లు!

ఆ రోజు తనూ, తన తండ్రి అంత దూరం నుండి దొంగతనం చెయ్యటానికి వచ్చిన ఇల్లు.

అంటే తన తండ్రి దొంగతనం చెయ్యబో యింది సహదేవ్ స్విస్ బ్యాంకు పాస్‌వర్డ్ అన్నమాట.

"మరి మీ స్విస్ బ్యాంకు పాస్‌వర్డ్ ఉన్న బాక్సు ఏమయ్యింది? "

"తెలియదు. అది సేఫ్‌లో నుండి మాయమయింది. అయినా.. హత్యానే రంలో ఇరుక్కుని అరెస్ట్ అయి లాకప్‌లో ఉన్న నాకు ఆ విషయమే ముందు గుర్తుకు రాలేదు. తరువాత చూడమని మా ఆవిడకు చెప్పాను. అది సేఫ్‌లో లేదు. మిగిలిన ఇల్లంతా వెదికింది. ఎక్కడా దొరకలేదు. స్విస్ బ్యాంకుకు వెళ్ళి పాస్‌వర్డ్ మార్చాలంటే.. నేను వ్యక్తి గతంగా వెళ్ళాలి. జైలులో ఉన్న నాకు అది సాధ్యం కాదు. అయినా అది కొట్టేసిన వాడు ఇప్పటివరకూ దానిలో డబ్బు కది లించకుండా ఉండడు కదా? అందుకే తేలు కుట్టిన దొంగలా కిమ్మనకుండా ఉండి పోయాను"

"కుట్టింది తేలేమో కానీ.. మీరు మాత్రం దొంగ కాదులెండి. అయినా వస్తువు ఒక చోట ఉంటే.. మీరు ఇంకొక చోట వెతికితే

## కొత్తగాలి...

**మొట్టమొదటి స్నానం**
**చిట్టచివరి స్నానం**
**మధ్య**
**కొట్టుకునేదే జీవితం**

– ఏ. సూర్యప్రకాశ్,
నిజామాబాద్

# పొరపాటుతో మహర్దశ!




అమెరికన్ కార్పొరేట్ సంస్థ ప్రొక్టెర్ అండ్ గేంబుల్ 1879లో అమ్మే ప్రధాన వస్తువుల్లో ఒకటి కొవ్వొత్తులు. థామస్ ఆల్వా ఎడిసన్ బల్బుని కనిపెట్టడంతో కొవ్వొత్తులకు గల గిరాకీ తగ్గిపోతుందని ఆ కంపెనీ ఎగ్జిక్యూటివ్స్ భయపడ్డారు. వారి కంపెనీకి అధిక ఆదాయం తెచ్చే ఉత్పత్తుల్లో కొవ్వొత్తులు ప్రధానం కాబట్టి తమ కంపెనీ భవిష్యత్ ఏమవుతుందోనని వారు ఆందోళనకు గురయ్యారు. వారు భయపడ్డట్టుగానే క్రమంగా కొవ్వొత్తుల అమ్మకాలు తగ్గి కంపెనీ లాభాలు పడిపోయాయి. సరిగ్గా ఇదే సమయంలో వారి సిన్సినాటి ఫాక్టరీలోని ఓ కార్మికుడు భోజనానికి వెళ్లే ముందు తన కొవ్వొత్తుల యంత్రాన్ని ఆపేయడం మరచిపోయాడు. అతను తిరిగి వచ్చి చూసేసరికి ఎయిర్ బబుల్స్ గల నురగలా ముడిపదార్థం మారడం కనుగొన్నాడు. దాన్ని అతను



శుభ్రం చేసి పారేయబోయే ముందు ఓ ఆలోచన వచ్చి, దాంతో ఓ సబ్బును తయారు చేసాడు. ఆ సబ్బు నీళ్లల్లో తేలింది! అలా ఈనాటికీ ప్రొక్టెర్ అండ్ గేంబుల్ ప్రధాన ఉత్పత్తుల్లో ఒకటైన ఐవరీ సోప్‌కు అంకురార్పణ జరిగింది. ఆ సమయంలో కొందరు అమెరికన్లు నదుల్లో స్నానం చేసేవారు. వారు తెచ్చే సబ్బులు స్నానమప్పుడు నీళ్లల్లో మునిగిపోవడంతో ప్రత్యామ్నాయంగా ఈ కొత్తసబ్బును కొనసాగారు. ఆ విధంగా ఓ కార్మికుడు పొరపాటు వల్లనే ఆ కంపెనీ నేటికీ కొనసాగుతుండటం విశేషం.

ఎలా దొరకుతుంది? "

"దేని విషయం నువ్వు మాట్లాడుతోంది? "

"మీ రెడ్ కలర్ బాక్సు.. అదేనండీ స్విస్ బ్యాంకు పాస్‌వర్డ్ దాచిన బాక్సు గురించి.."

"అది ఎర్రగా ఉంటుందని నీకెలా తెలుసు? ..నేను చెప్పలేదే? " అనుమానంగా అన్నాడు సహదేవ్.

"ఇంటి వెనక ఉన్న దానిని.. ఇంటి లోపల వెతికితే ఎలా దొరుకుతుందని నేను అంటున్నది దాని గురించే.."

"ఇంటి వెనుకా? "

"మీ ఇంటి వెనుక కాంపౌండ్‌వాల్ కి ఆనుకుని అనేక కొండ శిలలు ఉన్నాయా? "

"అవును.. అది నీకెలా తెలుసు? "

"తెలుసులెండి! ముందు ఈ విషయం చెప్పండి. ఆ బండరాళ్ళ మధ్య ఒక పెద్ద రాయి.. కింద సన్నగా, పైన వెడల్పుగా.. తన బరువును తానే బ్యాలన్స్ చేసుకోలేనట్లు నిలబడి ఉంటుందా? "

"నువ్వు చెప్తుంటే చూసినట్లే ఉంది"

"ఆ రాతి కింద గుంట తీసిచూస్తే.. మీ బాక్సు దొరకుతుంది."

"దీనిని ఏ రకమయిన జోస్యం అంటారు? "

"దాచి పెట్టినవాడు మాత్రమే చెప్పగలిగే జోస్యం.."

"అంటే? .."

"ఆ బాక్సు అక్కడ దాచింది నేనే!"

సహదేవ్ చాలాసేపు ఆశ్చర్యం నుండి తేరుకోలేదు.

"అది నీ దగ్గరకు ఎలా వచ్చింది? "

అనుమానం తీరక అడిగాడు సహదేవ్.

"చెప్తాను. మనిద్దరం క్లారిఫై చేసుకోవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి. ఒకటొకటిగా చెప్పుకుందాం.. శివరామన్‌కి తన పని చేసి పెట్టటానికి ఒక నైపుణ్యం ఉన్న దొంగ అవసరమని అనుకుని ఉంటాడు. అలాంటి దొంగలు ఎక్కడ ఉంటారని చేస్తున్న ఎంక్వయిరీలో మా ఊరి ప్రస్తావన వచ్చి ఉంటుంది. అక్కడి సీఐ బాజీరావుని ఎవరో పరిచయం చేసి ఉంటారు. అతనితో ఒక చురుకయిన దొంగని కుదిర్చి పెట్టడానికి ఒప్పందం చేసుకుని ఉంటాడు. అందుకే బాజీరావు మా నాన్నని బెదిరించీ, బ్లాక్‌మెయిల్ చేసీ.. ఈ పనికి ఒప్పించాడు. అంతవరకూ ఓకే! కానీ వాడు చేసింది మోసమని మీకు ఎలా తెలిసింది? "

"చాలా యాదృచ్ఛికంగా తెలిసింది. మా కంపెనీలోని ఒక స్టాఫ్ తన వ్యక్తిగత పని మీద రిజిస్ట్రార్ ఆఫీసుకు వెళ్లాడు. ఆ రోజే జరిగిన కోట్లు విలువ చేసే డీల్ గురించి అక్కడ అతనికి ఎవరో మాట్లాడుకోవటం వినిపించింది. అయితే వారి మాటల్లో ఆ లాండ్ కొన్న వ్యక్తి పేరు నాదికాక వేరే చెప్పుకుంటూ ఉండటంతో.. అతను మరి కాస్త ఎంక్వయిరీ చేశాడు. ఏదో మోసం జరిగిందని భావించి విషయం నాకు చేరవేశాడు. తరువాత నేను రెండు ఫోన్లు చెయ్యగానే అసలు విషయం తెలిసిపోయింది"

"మరి వెంటనే శివరామన్‌ని అడగలేదా? ఇలా ఎందుకు చేయవలసి వచ్చిందని? .."

"ఆ రోజు అతనికి చాలా సార్లు ఫోన్ చేశాను. అతను రిసీవ్ చేసుకోలేదు. రాత్రి పొద్దుపోయాక మెసేజ్ పంపాడు. రాత్రికి ఇంటికి వస్తున్నాను. అప్పుడు మాట్లాడుకుందామని"

"తన మోసం గురించి మీకు తెలిసిందని అతను ఊహించి ఉండడు. అలా అయితే అసలు మిమ్మల్ని కలవనే కలవడు. అతను ఏర్పాటు చేసిన దొంగతనం ఆ రాత్రికి జరగబోతుంది. ఆ సమయంలో అతను అక్కడ ఉండటం వల్ల ఉపయోగం అనుకుని ఉంటాడు. అందుకే అప్పటివరకూ మాట్లాడటానికి కూడా కుదరనంత బిజీగా ఉన్నట్లు నటించి రాత్రికి మీ ఇంటికి వచ్చాడు"

"అంతే అయి ఉంటుంది. వాడి కోసం ఎదురుచూస్తూ కోపంతో నేను పెగ్గు మీద పెగ్గు ఖాళీ చేస్తూ కూర్చున్నాను. వాడు వచ్చేటప్పటికీ పూర్తిగా నిషా తలకు ఎక్కి ఉంది.."

"మరి మీ ఇంట్లో ఎవరూ లేరా? "

"ఇంట్లో ఎవరుంటారు? పిల్లలు విదేశాల్లో చదువుకుంటున్నారు. భారతి ఆ రోజే ఊరు వెళ్లింది.."

"అవును ఆవిడ ఊరు వెళ్లటం నేను చూశాను.."

"నువ్వు చూశావా? ఎలా? "

"అదేలెండి. మీ ఇంటిమీద రెక్కీ చేస్తున్నపుడు కనిపించింది.."

"రెక్కీ! అంటే.."

"ఇప్పుడవన్నీ అవసరమా సార్? తరువాత జరిగింది చెప్పండి"

"ఏం జరిగిందో క్లియర్‌గా గుర్తులేదు. మొత్తానికి వాడిని బాగా తిట్టాను. కొట్టానేమో కూడా గుర్తులేదు. వాడు మాత్రం ఏమీ సమాధానం చెప్పిన గుర్తు లేదు"

"అప్పుడు సమయం ఎంత అయింది? "

"అర్ధరాత్రి అయి ఉంటుంది"

"అప్పుడు మా నాన్న మీ ఇంటిలోనే ఉన్నాడు"

"ఏమిటో! మా ఇంట్లో ఎవరెవరున్నారో నిన్నడిగి తెలుసుకోవలసి వస్తోంది" అని చెప్పటం కొనసాగించాడు సహదేవ్.

"చివరకు వాదన పెరిగింది. నాకు ఆవేశం వచ్చింది. పరుగెత్తుకుంటూ పైకి వెళ్లాను. సేఫ్ తెరచి పిస్టల్ తీసుకుని.. అదే వేగంతో కిందకు వచ్చాను.."

"వచ్చేటప్పుడు సేఫ్ మూశారా? తెరిచే ఉంచారా? "

"గుర్తులేదు. అయినా ఆ ఆవేశంలో వేసి ఉండను"

"అప్పటికే సమయం కోసం వేచి చూస్తున్న నా తండ్రికి తెరచి ఉన్న సేఫ్ కనిపించి ఉంటుంది. అదే అదనుగా తనకు కావలసిన బాక్సును చేజిక్కించుకుని ఉంటాడు" తనలో తను అనుకుంటున్నట్లు అన్నాడు పాండు.

మళ్లీ సహదేవ్‌వైపు తిరిగి- "అయినా ఎంత కోపం ఉంటే మాత్రం.. తుపాకి తీసుకుని ఎదురుగా కనిపించిన వారినందరినీ కాల్చి చంపటానికి మీకేం అధికారం ఉంది? మీరేమైనా హీరో అనుకుంటున్నారా? "

"నేనెక్కడ కాల్చాను? పిస్టల్ తీసుకుని తూలుకుంటూ కిందకు దిగానా..? అక్కడ శివరామన్ నాకు ఎక్కడా కనిపించలేదు. ఇంతలో ఏమయివుంటాడా? అని అటూ ఇటూ చూస్తున్నంతలో చాటు నుండి వచ్చి ఫ్లవర్ వాజ్‌తో నా నెత్తిన కొట్టాడు"

**కొత్తగాలి...**

**అమ్మ సేవకు**
**వెల కట్టలేం..**
**వెల లేదు కనకే**
**నేడు విలువ లేదు**

– శ్రీకాళహస్తి వెంకటశేషగిరిరావు,
నెల్లూరు

"ఊ.. తరువాత? "

పాండుకి తన తండ్రి విషయం ఏమన్నా తెలుస్తుందేమోనని ఆత్రుతగా ఉంది.

"నాకు మాత్రం ఏమి తెలుసు? మళ్లీ మెలకువ వచ్చేటప్పటికి కింద పడి ఉన్నాను.."

"ఈ మధ్యలో జరిగింది కొంత నాకు తెలుసు. మీరు కాకుండా మరొక వ్యక్తి మేడమీదకు వచ్చి పారిపోబోతున్న మా నాన్నను బలవంతంగా కిందకు తీసుకువెళ్లాడు. అతని చేతిలో పిస్టల్ ఉంది. కాస్సేపటికి అది పేలింది కూడా! మీరు చెప్పిన వర్ణన బట్టి బహుశా అతను శివరామనే అయ్యుండాలి.."

"అదే కదా! నేను నెత్తి, నోరు బాదుకుని చెప్పినా ఎవరూ పట్టించుకోనిది.. నేను ఎవరినీ చంపలేదని!"

"ఆ విషయంలో నాకు ఏ అనుమానం లేదు. మిగిలింది చెప్పండి.."

"ఏముంది? నాకు మెలకువ వచ్చేటప్పటికి ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. నెత్తి తడుముకు చూసుకున్నాను. దెబ్బ పెద్దది కాదు. అందుకే వెంటనే మెలకువ వచ్చింది. ఇల్లంతా చీకటిగా ఉంది. తడుముకుంటూ వెళ్ళి లైటు స్విచ్ నొక్కాను. అంతే! పెద్ద పేలుడు జరిగింది! కిచెన్‌లో గ్యాస్ లీకయిందని తరువాత తెలిసింది. నాకు మళ్ళీ స్పృహ తప్పింది.."

"అది తప్ప మీకు వేరే పనేమీ లేదనుకుంటాను. సరిగ్గా టైము చూసుకుని స్పృహ తప్పుతుంటారు" గొణుక్కుంటున్నట్లు అన్నాడు పాండు విసుగ్గా.

అదేమీ పట్టించుకోలేదు సహదేవ్.

"ఇంక తరువాత చెప్పేందుకు ఏముంది? పోలీసులు వచ్చారు. శవం ఇంట్లో ఉంది. అంతకు ముందు శివరామన్ ఇంట్లోకి రావటం చాలామందే చూశారు. అందుకే అతన్ని చంపిన నేరం

కింద నన్ను అరెస్టు చేశారు. పేలిన గ్యాస్ సిలిండర్ ధాటికి శవం బాగా ఛిద్రమై పోయింది. నేను దూరంగా ఉండటంతో నాకేమీ కాలేదు. దానితో నేనే కావాలని పేలుడు సృష్టించానని పోలీసులు నామీద కేసు పెట్టారు. అన్నట్లు చెప్పటం మరిచాను.. శవంలో ఒక బుల్లెట్ కూడా ఉందంట. తరువాత పోస్టుమార్టం రిపోర్ట్‌లో తెలిసింది. అది నా పిస్టల్ నుండి పేల్చిందేనని ఫోర్సెనిక్ రిపోర్ట్ వచ్చింది. పిస్టల్ మీద నావి తప్ప వేరే ఎవరివీ వేలి ముద్రలు లేవని కూడా వారే చెప్పారు. నేను ఫుల్లుగా మందుకొట్టి ఉన్నానని డాక్టర్ సర్టిఫికెట్ ఇచ్చాడు. దానితో శివరామన్‌ని చంపింది నేనే అని కోర్టు నమ్మింది. తీరా చూస్తే.. ఆ శివరామన్ బతికే ఉన్నాడు. కానీ.. నా మాటను నమ్మేవారే లేరు.."

"శివరామన్ బతికే ఉన్నాడా?" కళ్ళలో నీళ్ళు తిరుగుతుంటే అన్నాడు పాండు.

"అవునూ! అయితే.."

"అయితే.. చనిపోయిన వ్యక్తి మా నాన్న.." రెండుకాళ్ళ మధ్య తలపెట్టుకుని రోదిస్తూ అన్నాడు పాండు.

హఠాత్తుగా జరిగిన ఆ పరిణామానికి ముందు ఆశ్చర్యపోయినా.. వెంటనే తేరుకుని పాండుని ఓదార్చాడు సహదేవ్.

కాసేపటికి తేరుకున్నాడు పాండు.

"ఇలాంటిదేదో జరిగుంటుందని ఊహిస్తూనే ఉన్నాను. శివరామన్ పోలీసులతో కుమ్మక్కయ్యాడు. అందుకే అతను చేసిన నేరం మీకూ.. అసలు చెయ్యని నేరం నాకూ ఆపాదించి జైలుకు పంపారు. ఆ రోజు తుపాకీతో బెదిరించి కిందకు తీసుకు వెళ్లిన మా నాన్నను శివరామనే చంపేసి ఉంటాడు. మనిషి పోలికలు తెలియకుండా గ్యాస్ ప్రమాదం సృష్టించి ఉంటాడు. ఆ రోజు స్పష్టంగా నాకు పిస్టల్ మోత వినిపించింది. అది వినిపించిన తరువాతే.. నేను ఆ ప్రదేశం నుండి బయటపడటానికి ప్రయత్నించి బాజీరావు కంట్లో పడ్డాను.."

అర్థమయినట్లు తలూపుతూ.. "శివరామన్ నన్నే అనుకున్నాను.. నిన్ను కూడా చెప్పలేనంత దెబ్బ కొట్టాడన్నమాట.." అన్నాడు సహదేవ్.

"ఇంతకీ చనిపోయింది శివరామన్ కాదని మీకెప్పుడు తెలిసింది?"

"నాకు మొదట్లో అసలు ఆ అనుమానమే రాలేదు. అందరూ నమ్మినట్లే చనిపోయింది శివరామనే.. అని నేను కూడా నమ్మాను. తాగిన మత్తులో హత్య చేశానని ఆరోపిస్తున్న పోలీసుల వాదనలే నిజమయి ఉంటాయని నమ్మాను. అందుకే కోర్టులో నా కేసు గురించీ.. దాని మీద జరుగుతున్న వాదనల గురించీ పెద్దగా ఉత్సాహం చూపలేదు. అయితే నా ఆరోగ్యం బాగోకపోవటంతో నన్ను నిమ్స్‌లో చేర్చారు.." అంటూంటే పాండు వ్యంగ్యంగా నవ్వటం గమనించి,

"...ఎందుకు నవ్వుతున్నావ్?" సీరియస్‌గా అడిగాడు.

"నిమ్స్ అంటేనూ.."

"అంత ఎగతాళి అక్కరలేదు. నాకు నిజంగా ఆరోగ్యం బాగోకే చేరాను" అంగీ

## కొత్తగాలి...

**టైము**
**పన్నెండు**
**గడియారంలో ముళ్లు**
**కౌగలించుకున్నాయి!**

– పురిజాల సుధాకర్,
నరసన్నపేట, శ్రీకాకుళం జిల్లా



కరిస్తున్నట్లు పాండు తల ఊపాక చెప్పటం కొనసాగించాడు.

"నిమ్స్‌లో ఉన్నపుడు ఒకరోజు టీవీలో వస్తున్న వార్తలు చూస్తున్నాను. తాజ్ హోటల్ మీద దాడులు జరిగిన సంవత్సరంలోపే హోటల్ పునః నిర్మాణం పూర్తి చేసి దానిని తిరిగి ప్రారంభిస్తున్న వార్త అది. హోటల్‌లో పెద్ద ఫంక్షన్ జరుగుతోంది. దానిని బ్యాక్‌డ్రాప్‌గా చూపిస్తూ వార్తను కవర్ చేస్తున్నారు టీవీ క్రూ. అక్కడ కూర్చుని ఉన్న అతిథుల మధ్య కనిపించాడు శివరామన్. అప్పుడు.. అప్పుడు నమ్మాను! నేను నేరం చెయ్యలేదని.."

"ఏమో.. మీరు చంపింది శివరామన్‌ని కానప్పుడు.. మా నాన్నను చంపింది మీరే అయి ఉండవచ్చు కదా? "

"అదే నిజమయితే.. శివరామన్ అజ్ఞాతంలోకి వెళ్ళవలసిన అవసరం ఏముంది? " ఎదురు ప్రశ్నించాడు సహదేవ్.

"నిజమే!" ఒప్పుకున్నాడు పాండు.



లక్షల్లో ఖర్చు అయింది. కానీ ఫలితం శూన్యం"

"మిమ్మల్ని జైల్లో పెట్టి మరీ మీ డబ్బుని ఎంజాయ్ చేస్తున్నాడన్న మాట.."

ఇద్దరూ సుదీర్ఘ ఆలోచనలో మునిగిపోయారు.

★ ★ ★

పాండు, సహదేవ్‌ల మధ్య సాన్నిహిత్యం రోజు రోజుకీ పెరగసాగింది.

కేవలం ఒక సెల్‌లో ఉండటమే కాదు.. ఒకే వ్యక్తిచేత మోసపోయిన భావన వారిని ఏకం చేసింది.

అయితే పాండు శిక్షా కాలం పూర్తికావటంతో.. అతను విడుదల అయ్యే రోజు వేగంగా దగ్గరకు వస్తోంది.

వెల్లకిలా పడుకుని, రెండు చేతులూ తలకింద పెట్టుకుని, సీలింగ్ వైపు దీర్ఘంగా చూస్తూ.. ఆలోచిస్తున్నాడు పాండు.

అతనిని మాట్లాడించటానికి ప్రయత్నించాడు సహదేవ్.

"బయటకు వెళ్ళిన తరువాత ఏం చేద్దామనుకుంటున్నావ్?"

"ఏమి చేసినా చెయ్యకపోయినా, కలెక్టర్ ఉద్యోగం మాత్రం చెయ్యదలుచుకోలేదు. ఎందుకంటే.. అది మనకు ఇకరాదు కాబట్టి!"

"నేను మాట్లాడుతున్నది దాని విషయం

"నా మీద హత్యానేరం మోపి జైలుకు పంపినప్పటికంటే.. అది తప్పుడు ఆరోపణ అని తెలిసినప్పటి నుండి నా మనస్తాపం ఎక్కువయింది"

"మరి ఈ విషయం ప్రభుత్వానికి తెలియచేసి మీరు బయటపడవచ్చు కదా!"

"నేను చెప్పిన మాటలు నమ్మేది ఎవరు? అదే నిజమయితే.. అతన్ని చూపించమంటున్నారు.." నిర్వేదంగా చెప్పాడు సహదేవ్.

"అతన్ని వెతికే ప్రయత్నాలు చేసి ఉండవలసింది.."

నవ్వాడు సహదేవ్.

"ప్రముఖ ప్రైవేటు డిటెక్టివ్‌లను ఏర్పాటు చేశాను. ఆరు నెలలు గడిచాయి.

కాదు.."

కాసేపు మౌనంగా ఉన్నాడు పాండు.

"అన్యాయంగా మా నాన్నను చంపిన ఆ శివరామన్‌ను ఏమీ చెయ్యకుండా వదిలెయ్యటం అంటే.. మా నాన్నను మరొకసారి చంపటమే! అందుకే వాడు ఎక్కడ ఉన్నా బయటకు తీసుకువస్తాను.. చట్టానికి పట్టి ఇస్తాను.."

"ఇవన్నీ చేయాలంటే బాగా డబ్బు అవసరం.."

మాట్లాడలేదు పాండు.

"నువ్వు చేసే పని వల్ల అందరికంటే ఎక్కువ లాభం ఎవరికో తెలుసా?.. నాకే!"

ప్రశ్నార్థకంగా చూశాడు పాండు.

"నువ్వు శివరామన్‌ని చట్టానికి అప్పచెప్పిన మరుక్షణం నేను నా నేరం నుండి బయటపడతాను"

"అవును.."

"అందుకే.. నీకు కావలసిన అన్ని సదుపాయాలూ, డబ్బూ ఏర్పాటు చెయ్యమని భారతికి చెప్పాను. నువ్వు బయటకు వెళ్ళేసరికి నీ అపాయింట్‌మెంట్ ఆర్డర్ తయారవుతుంది. బయటకు వెళ్ళిన రోజే మా కంపెనీలో వైస్ ప్రెసిడెంట్‌గా చేరు. నీకు అప్పచెప్పే ఏక సూత్ర ఎజెండా- శివరామన్‌ని పట్టుకోవటం! తద్వారా నన్ను విడుదల చేయించటం.."

"నాకేమీ క్వాలిఫికేషన్ ఉందని.. అంత పెద్ద పోస్టు?"

అతని మాటలు మధ్యలోనే ఖండించాడు సహదేవ్- "నాతో కలిసి ఒక గదిలో ఇన్ని రోజులు గడిపావు. నా భార్య తరువాత నాకు అత్యంత సన్నిహితుడివి నువ్వే! అంతకంటే ఇంకేమి క్వాలిఫికేషన్ కావాలి? నీ గురించి నాకు బాగా తెలిసింది. నేను చెప్పినట్లు చెయ్యి. మన ఇద్దరికీ మేలు జరుగుతుంది."

"సరే!" అన్నాడు పాండు.




మరో మూడు రోజుల తరువాత విడుదల అయ్యాడు పాండు.

విడుదల అయిన వెంటనే సరాసరి సహదేవ్ ఇంటికి వెళ్ళి ఆయన భార్య భారతిని కలిశాడు.

ఆమెకి అన్ని విషయాలూ ఎప్పటికప్పుడు సహదేవ్ ద్వారా తెలుస్తూనే ఉన్నాయి. అందుకే పాండును సాదరంగా ఆహ్వానించింది.

"ఎలా ఉన్నారు ఆయన?" ఆ మాటలు అడుగుతుంటే భారతి కళ్ళలో గిర్రున తిరగాయి నీళ్లు.

వాటిని చూడలేనట్లు తల వంచుకున్నాడు పాండు.

"ఎలా బాగుంటారు మేడమ్? చేయని నేరానికి శిక్ష అనుభవిస్తున్నానన్న బాధ ఒక వైపూ.. ఒక వ్యక్తి పన్నిన వలలో ఇంత తేలికగా చిక్కుకున్నానన్న అవమానం ఇంకొకవైపూ ఆయనను పట్టి పీడిస్తున్నాయి"

"నాకు తెలుసు.." కాసేపు ఆలోచిస్తున్నట్లు ఉండిపోయింది భారతి.

"మొదటిసారి శివరామన్‌ని చూడగానే నాకెందుకో అతను నచ్చలేదు. అతని ప్రవర్తన నటనలాగా అనిపించింది. ఆ విషయం ఆయనకు చెప్పాను కూడా!

అయితే నా మాటలు పట్టించుకోలేదు. నేనూ ఆ విషయం వదిలివేశాను. అదే నేను చేసిన తప్పు. ఆయన నమ్మినా, నమ్మకపోయినా.. నేను చెప్పిన విషయం గురించి మరింత జాగ్రత్త తీసుకుని ఉండ వలసింది.."

"జరిగిపోయిన విషయాలు తవ్వుకుని ఉపయోగంలేదు మేడమ్! జరగవలసినవి చూద్దాం!! దాని వలన ఆయన త్వరగా బయటపడే అవకాశం ఉంది.."

"ఆయన ముందే చెప్పి ఉంచారు. ఆయన చెప్పినట్లే మీకు ఆఫీసులో ఒక గది ఏర్పాటు చేయించాను. నేను స్వయంగా మిమ్మల్ని మిగిలిన స్టాఫ్ అంద రికీ పరిచయం చేస్తాను. వారు పూర్తిగా మీకు సహకరిస్తారు"

"థ్యాంక్యూ మేడమ్! ముందుగా రెండు రోజులు మా ఊరు వెళ్లి వస్తాను. అక్కడ మా అమ్మ ఒంటరిగా ఉంటుంది. ఆమెని తీసుకుని వస్తాను"

"త్వరగా రండి! ఆయన ఎంత త్వరగా బయటకు వస్తార్నది మీ మీదే ఆధారపడి ఉంది.."

అర్థం చేసుకున్నట్లు తలూపి బయటకు నడిచాడు పాండు.

★ ★ ★

ఊరు ఏమీ మారలేదు.

ఊరిలో పరిస్థితులూ ఏమీ మారలేదు.

కాంతం మాత్రం బాగా మారిపోయింది. ఒక్కసారిగా వృద్ధాప్యం మీద పడినట్లు కుంగిపోయింది.

కొడుకుని చూడగానే బావురుమని ఏడ్చింది

ఆ దుఃఖంలో ఇన్నేళ్ళ ఎడబాటు ఉంది.

భర్త ఏమయ్యాడో తెలియని ఆవేదన ఉంది.

"ఊరుకో అమ్మా.. ఊరుకో!" ఊరడిస్తూ అన్నాడు పాండు.

నెమ్మదిగా సంబాళించుకుంది ఆమె.

"ఊరుకోక చెయ్యగలిగింది మాత్రం ఏముంది నాయనా? జీవితమంతా నీ భవిష్యత్తు బాగుండాలని ఆరాటపడ్డాము. నువ్వు కూడా కష్టపడ్డావు. కేవలం ఒక వ్యక్తి అరాచకానికి బలి అయి మనందరి జీవిత కష్టం నేలపాలు అయింది కదా? "

తల్లి తన ఉద్యోగం గురించి మాట్లాడుతోందని అతనికి అర్థం అయింది.

"అదొక్కటే ఉద్యోగం కాదమ్మా! అంత కంటే ఎక్కువ జీతం వచ్చే ఉద్యోగమే వచ్చింది. ఆ మాట చెప్పి నిన్ను తీసుకువెళ్ళటానికే వచ్చాను. కాకపోతే ఎక్కువ సమయం లేదు. వెంటనే చేరాలి"

"మా నాయనే! మంచి మాట చెప్పావు నాయనా! ఆనందంతో మనసు ఉప్పొంగుతోంది" అంది కాంతం.

అంతలోనే! ఏదో గుర్తుకువచ్చినట్లు మరలా దుఃఖంలో మునిగిపోయింది. "ఈ విషయం తెలిస్తే మీ అయ్య ఎంత సంతోషించేవాడో? ఎక్కడ ఉన్నాడో? ఏమైపోయాడో? ఆ రోజు నుండి ఆచూకీ లేకుండా పోయాడు. అసలు ఉన్నాడో, లేడో కూడా తెలియదు.." వెక్కిళ్ల మధ్య అంది ఆమె.

పాండు మనసులోనే తర్జన భర్జన పడ్డాడు- తల్లికి తండ్రి చనిపోయిన విషయం చెప్పాలా? వద్దా? - అని. చివరకు చెప్పటమే మంచిదనే నిర్ణయానికి వచ్చాడు.

విషయం తెలిసిన కాంతం కుంగిపోయింది.

మనసులో ఇంతకాలం ఎక్కడో ఒక మూల అనుమానం తొలుస్తున్నా.. అది నిజమని తెలిసిన బాధ ఆమెను కుదిపేసింది.

దాదాపు గంట తరువాత ఆమె కోలుకుంది.

"ఇంకా ఇక్కడ ఎందుకమ్మా? నాతో పాటు రా!"

"తొందరేముంది నాయనా? నెమ్మదిగా వస్తాన్లే!" మంచం మీద నుండి లేస్తూ అంది.

"ఇంతకీ నీకొచ్చింది ఏమి ఉద్యోగం?" కుతూహలంగా అడిగింది.

"నాన్నని చంపినవాడిని పట్టుకునే ఉద్యోగం!"

★ ★ ★

పాండు వచ్చాడని తెలిసి ఊర్లోనివారు చాలామంది పలకరించటానికి వస్తు న్నారు.

తమలో ఒకడు జైలు జీవితం గడిపి బయటకు రావటం అన్నది పెద్ద విశేషం కాకపోయినా.. సొంతం బయటకు రాక ముందే పెద్ద ఉద్యోగం సంపాదించటం మాత్రం వారి దృష్టిలో విశేషమే!

వారి మాటల ద్వారా అతనికి వారి పరి స్థితి ఏమీ మారలేదని అర్థం అయింది. మార్పు అంటూ ఉంటే.. అది బాజీరావు చేస్తున్న దౌష్ట్యాల విషయంలోనే! అవి రోజు రోజుకీ పెరుగుతున్నాయి.

వారిలో ఒకడుగా.. వారు అనుభవి స్తున్న బాధలు చూసి కూడా, ఏ బాధ్యతాలేనట్లు పట్టించుకోకుండా వెళ్ళిపో లేడు.

అందుకే ఒకసారి బాజీరావుని కలుసుకో దల్చుకున్నాడు.

అతన్ని కలుసుకోవటానికి మరొక కారణం- శివరామన్ ఆచూకీ అతనికి తెలిసే అవకాశం ఉండటం.

★ ★ ★

లోపలకు వస్తున్న పాండుని చూడగానే బాజీరావు మొహం కళ తప్పింది.

మేకపోతు గాంభీర్యం మొహం మీదకి తెచ్చుకుని "రావోయ్ పాండు, రా! ఎప్పుడు వచ్చావేమిటి?" అంటూ పలకరించాడు.

"నిన్న వచ్చాను లెండి.." క్లుప్తంగా చెప్పాడు పాండు.

ఆతనితో ఏమి మాట్లాడాలో బాజీరావుకి అర్థం కావటం లేదు. అతనికి చేసిన ద్రోహం తెచ్చిపెట్టిన గిల్టీఫీలింగ్ ఎక్కడో ఓ మూల పట్టి పీడిస్తోంది.

అతన్నే తదేకంగా గమనిస్తున్న పాండు- "ఏంటి సార్! ఎప్పుడు కనిపించినా రెడ్ బాక్స్ గురించి అడిగేవారు. ఈ సారి అడ గలేదేమిటి?" అన్నాడు.

"ఇప్పుడు దాని అవసరం లేదులే!" అన్నాడు బాజీరావు

"ఏం శివరామన్ మీకు కూడా కనప డటం లేదా?"

ఉలిక్కి పడ్డాడు బాజీరావు.

"శివరామన్‌కూ దీనికి సంబంధం ఏముంది? అయినా శివరామన్ చచ్చి పోయి సంవత్సరాలవుతుంది.." తత్తర పాటు కనిపించకుండా ఉండటానికి ప్రయ త్నిస్తూ అడిగాడు అతను, "ఇంతకీ... అతను నీకెలా పరిచయం?"

"అతనితో నాకేమీ పరిచయం లేదు సార్! అతన్ని నేను ఇంతవరకు కలుసు కోను కూడా లేదు. అయితే.. నేను జైల్లో ఉన్నప్పుడు ఒక రూమర్ ప్రచారంలో ఉండేది! ఆ రోజు సహదేవ్‌గారి ఇంట్లో చనిపోయింది శివరామన్ కాదనీ.. మా నాన్న రామకోటి అనీ! ఆ విషయం గురించి మీకు ఏమన్నా వివరాలు తెలుసే మోనని వచ్చాను.."

"ఆ ఇంట్లో ఏమి జరిగిందో.. ఎవరు ఎవరిని చంపారో నాకు మాత్రం ఎలా తెలుస్తుంది? పేపర్లలో వచ్చింది మాత్రమే నాకూ తెలుసు. ఒకటి మాత్రం నిజం.. శివరామన్ బతికి ఉండి అతని ఆచూకీ తెలిస్తే నాకు చెప్పు. వాడి అంతు నేను చూస్తాను" పళ్ళు పటపటలాడిస్తూ అన్నాడు బాజీరావు.

ఆ మాటలు అంటున్నప్పుడు అతని మొహంలో కదలాడిన కోపం చూస్తే.. అది నటన అనిపించలేదు. బహుశా బాజీరావు రెడ్‌బాక్స్ అందించలేక పోయాడు కాబట్టి శివరామన్ అతనికి ఇవ్వవలసిన డబ్బులు ఇచ్చి ఉండడు. పనిచేసినా చెయ్యకపోయినా డబ్బులు నొక్కే బాజీరావుకి బహుశా అందుకే అతని మీద అంత కోపం.

మొత్తానికి ఒకటి మాత్రం తేలిపోయింది. శివరామన్ ఆచూకీ బాజీరావుకి తెలియదు.

"పోనీ.. మా నాన్న సంగతి ఏమయింది? ఆచూకీ ఏమన్నా తెలిసిందా?"

"లేదోయ్! అప్పటి నుండి ఎంక్వయిరీ చేస్తూనే ఉన్నాము. ఏమయ్యాడో తెలియటం లేదు.."

"సరేలెండి! వెళ్ళి వస్తాను" అంటూ బయటకు నడిచాడు పాండు.

★ ★ ★

బాజీరావుతో మాట్లాడి బయటకువచ్చాక పాండుకి ఒక విషయం అర్థమైంది. అది బాజీరావు మారలేదు. అతని స్వార్థ బుద్ధీ మారలేదు.

తన ఊరివారిని పీడించటం ఆపలేదు.

అలాంటి వాడికి జీవితమంతా గుర్తుండే గుణపాఠం చెప్పాలని మనసు ఉరకలు వేస్తుంది.

కానీ తను ఏ మాత్రం రిస్కు తీసుకునే పరిస్థితుల్లో లేడు. తన ప్రస్తుత ధ్యేయం శివరామన్ ఆచూకీ కనిపెట్టటం. ఎట్టి పరిస్థితుల్లోనూ తన పని పూర్తయ్యే వరకూ మరలా జైలుకి వెళ్ళే పరిస్థితులు కల్పించుకోకూడదు.

అలా అని 'తన' అనుకున్నవారు పడుతున్న బాధలు చూస్తూ ఎలా ఊరుకోవటం?

అందుకే అతను ఆ రాత్రి చురుకైన కొందరిని తనవద్దకు పిలిపించుకున్నాడు.

## ఎలా రాస్తారో?

సాహితీవేత్తల మదిలో కథలు ఎలా పుడుతాయో తెలుసుకోవాలనే ఉత్సుకతతో ఓ పాత్రికేయుడు, 'గోపీచంద్‌గారూ! మీరు కథలెలా రాస్తారు?' అని ప్రశ్నించాడు.

'నేను ఇంటి దగ్గర పడుకుని.. చూరువైపు



చూస్తూ రాస్తాను. పదిమందిలో మాట్లాడుతూ రాస్తాను. అన్నింటిలోకీ నాకు నడుస్తూ రాయటమే సరదా!' అన్నారు గోపీచంద్ వ్యంగ్యంగా.

ఆ విలేఖరి నివ్వెరపోయాడు.

దాంతో గోపీచంద్, 'సాహిత్య సృష్టికి సంబంధించిన ఆలోచనలే నిరంతరం మనస్సులో మెదులుతూ ఉంటాయి' అన్నారు.

వారికి జరగవలసిందంతా పూసగుచ్చినట్లు వివరంగా చెప్పాడు. తరువాత తన దారిన తను హైదరాబాద్ బయలుదేరి వెళ్ళాడు. తను చెప్పిన ప్లాను అమలు జరిగే సమయంలో తను ఆ ఊరికి దూరంగా ఉన్నట్లు 'ఎలిబీ' సృష్టించుకోవటం ఎంతయినా అవసరం.

మరుసటి రోజు రాత్రి బాజీరావు ఇంట్లో దొంగతనం జరిగింది. పాండు ఊరికి చెందిన మెరికల్లాంటి కొందరు దొంగలు అతని ఇంట్లోకి ప్రవేశించి, అతను ఇన్ని సంవత్సరాలుగా సంపాదించిన డబ్బు,

నగలు మొత్తం మూటకట్టుకుపోయారు. ఇంకా ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే.. డబ్బుతో పాటు ఇంతవరకూ ఎవరి ఇంట్లోనూ తీసుకువెళ్ళని లాకర్ తాళాలు, స్థలాల కాగితాలు, ప్రామిసరీ నోట్లు.. అన్నీ పట్టుకు వెళ్ళారు.

వచ్చిన దొంగలు ఇంట్లోని వారందరికీ మత్తుమందు వాసన చూపించటంతో.. వారికి అడ్డు లేకుండా పోయింది.

తరువాత తాము ఏమేమి తీసుకువెళ్ళారో ఒక జాబితా రాసి.. దానితో సహా ఆ మూటను యాంటీకరప్షన్ బ్యూరో ఆఫీసు ముందు పడేశారు.

అలాంటిదే ఇంకొక మూట గులాబ్ చంద్ ఇంటి నుండి అదే ఆఫీసుకు చేరింది.

ఈ వివరాలు క్షణాల్లో అన్ని టీవి ఛానెళ్ళకూ చేర్చే పనికూడా వారే చేశారు.

తెల్లగా తెల్లవారి మెలకువ వచ్చేవరకూ బాజీరావుకి తన ఇంట్లో ఏమి జరిగిందో తెలియదు. ఒళ్ళు విరుచుకుంటూ లేచి కూర్చుంటున్న అతని మంచం చుట్టూ టీవీ కెమెరాలు పట్టుకున్న మనుషులు నిలబడి ఉండటం చూసి ఉలిక్కి పడ్డాడు.

"ఏయ్? ఎవరు మీరు?" అంటూనే లుంగీ సర్దుకుంటూ లేచి నిలబడ్డాడు.

అతని ఇల్లంతా రైల్వే ప్లాట్‌ఫాంలా ఉంది. ఎవరుపడితే వారు వస్తున్నారు, పోతున్నారు. బాజీరావు బాత్‌రూమ్‌కి వెళ్ళాలన్నా వీలులేకుండా గుంపులు కట్టి ఉన్నారు.

అతని గొంతులో తడి ఆరిపోయింది. ఏమి జరుగుతుందో అతనికి అర్థంకావటం లేదు.

ఇంతలో అతనికి మెలకువ రావటం గమనించిన టీవీ రిపోర్టర్లు అతని చుట్టూ మూగారు.

"పట్టుబడ్డ ఆస్తి అంతా మీదేనా?"

"అంత ఆస్తి ఎలా సంపాదించారు?"

"మీ ఇంట్లో దొంగతనం చేసినవాళ్లు దానిని ప్రభుత్వానికి ఎందుకు అప్పజెప్పారు?"

"దొంగలు చెప్తున్నట్లు ఇంతకాలం వాళ్ళు చేస్తున్న దొంగతనాలన్నీ మీరు చేయించినవేనా?"

అతనికి మతిపోతోంది. తలను చేతుల మధ్య పెట్టుకుని "అసలు ఏమి జరిగిందో నాకు తెలియదు. దయచేసి నన్ను వదలండి.." అంటూ వేడుకున్నాడు.

ఇంతలో ఏసీబీ అధికారులు బిలబిలమంటూ జీపుల్లో నుండి దిగారు.

అతను ఎంత పలుకుబడి కలవాడయినా.. ఇంత సెన్సేషనల్ సంఘటనను పట్టించుకోకుండా వదిలి వెయ్యటం కుదరదు కాబట్టి.. అతన్ని, అతనితో పాటు గులాబ్‌చంద్‌నూ అరెస్ట్ చెయ్యక తప్ప లేదు.

అతను ఎన్ని రోజులు జైలులో ఉంటాడో.. అతని మీద పెట్టిన కేసులు ఏ మాత్రం నిలుస్తాయో ఎవరికీ తెలియకపోయినా.. కనీసం ఇకముందు తనవారికి అతని వల్ల ఏ సమస్యా ఉండదన్న తృప్తితో నిట్టూర్చాడు వార్తలు చూస్తున్న పాండు.

★ ★ ★

నాయుడమ్మ అండ్ కంపెనీలో పాండుకి ఒక ప్రత్యేక రూం ఏర్పాటు చేశారు. అతనికి అవసరమయిన అన్ని సదుపాయాలూ కల్పించమని జైలులో నుండే ఆదేశించాడు సహదేవ్.

పాండు తన పనిలో పూర్తిగా నిమగ్నమయ్యాడు.

శివరామన్!

వాడిని పట్టుకోవటమే తన పని. అది పూర్తి అయ్యేవరకూ మరొక వ్యాపకం కానీ, ధ్యాస కానీ ఉండకూడదన్న కృతనిశ్చ

యంతో తన పనిలో నిమగ్నమయ్యాడు పాండు.

తను ఆలస్యం చేసే ప్రతిరోజూ అక్కడ సహదేవ్ అనవసరంగా జైలులో గడపవలసిన రోజుల సంఖ్యను పెంచుతుంది.

అయితే అతనికి ఎక్కడి నుండి మొదలుపెట్టాలో అర్థంకావటం లేదు.

అందుకే ముందుగా సహదేవ్ ఏర్పాటు చేసిన ప్రైవేట్ డిటెక్టివ్ ఏజన్సీవారిని పిలిపించాడు.

ప్రస్తుతం కెప్టెన్ రాజేందర్ ఆ ఏజన్సీ తరపున వచ్చి అతని ఎదురుగా కూర్చుని ఉన్నాడు.

"మేము చెయ్యగలిగిన అన్ని ప్రయత్నాలూ చేశాము.. చేస్తున్నాము. కానీ 110 కోట్ల జనాభాలో ఒక మనిషిని వెదికి పట్టుకోవటం అంత తేలిక కాదు. అది మాకు కూడా ఇప్పుడే తెలిసింది"

"110 కోట్ల జనాభాలోనే వెదకాలని ఎందుకు అనుకుంటున్నారు? అతను వేరే దేశం కూడా వెళ్ళి ఉండవచ్చు కదా? "

"ఆ విషయం వరకూ కన్ఫర్మ్ సర్. అతనికి అసలు విదేశాలకు వెళ్ళే ఉద్దేశమే ఉండేది కాదని.. అతని పరిచయస్థులు అందరూ చెప్పారు. అందుకే అతనికి పాస్‌పోర్ట్ కూడా లేదు"

"సరే! మీరు పరిశోధన ఎలా మొదలు పెట్టారో చెప్తారా? "

"ముందుగా బ్యాక్‌ట్రాక్ చేసుకుంటూ పోయాం సర్. అతను మన దగ్గర కనపడిన ఆఖరి రోజు నుండి అంతకుముందు అతను ఎక్కడెక్కడ ఉండే అవకాశం ఉందో.. ఆ ప్రదేశాలన్నీ కవర్ చేస్తూ పోయాము. అతను మన కంపెనీకి రాక ముందు ముంబయ్‌లోని ఒక రియల్ ఎస్టేట్ సంస్థలో పనిచేసేవాడన్న విషయం అందరికీ తెలుసు. అక్కడినుండి మొదలుపెట్టాం మా పరిశోధన!" కాసిని మంచినీళ్ళు తాగటానికి ఆగుతూ చెప్పాడు

## డిసెంబరు - 2011
### చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **మక్కెన రాధాకుమారి**
   - కుంకలమర్రు, ప్రకాశం జిల్లా
2. **మంగళంపల్లి వేంకటసీతారామయ్య**
   -ఎడబ్ల్యూ హెచ్ఓ కాలనీ, సికింద్రాబాద్
3. **జె. లక్ష్మి**
   - మల్కాజ్‌గిరి, సికింద్రాబాద్
4. **భవ్య**
   - రేపల్లె, గుంటూరు జిల్లా
5. **పి. సుబ్బారావు**
   - సంగారెడ్డి, మెదక్ జిల్లా

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. ముక్త | 6. నళిని |
| 2. కుమారన్ | 7. దుబాయి |
| 3. శామ్యూల్ | 8. పట్టాభి సీతారామయ్య |
| 4. బనారస్ | 9. 1997 |
| 5. రామదుర్గై | 10. అమెరికా |

రాజేందర్.

"ఏమయింది అక్కడ? " ఆలస్యం భరించలేనట్లు అడిగాడు పాండు.

"శివరామన్ అక్కడ పని చేసిన మాట వాస్తవమే! కానీ అది రెండు, మూడు నెలలు మాత్రమే! ఆ కంపెనీకి మన కంపెనీతో మంచి సంబంధాలు ఉండటంతో వారు కూడా పూర్తిగా సహకరించారు. అతని ఫైలు తీసుకుని ఉద్యోగంలో చేరినప్పుడు అతను ఇచ్చిన వివరాలు సేకరించాము"

"అందులో అతని అడ్రస్ లేదా? "

"పర్మనెంట్ అడ్రస్ అన్న దగ్గర తమిళ నాడులోని ఒక పల్లెటూరు పేరు రాసి ఉంది. టెంపరరీ అడ్రస్ అని అతను ఇచ్చింది ముంబయ్‌లోని ఒక బ్యాచిలర్ హాస్టల్ అడ్రస్"

అటెండర్ కాఫీలు తెచ్చి ఇచ్చి వెళ్ళాడు.

అతను వెళ్ళే వరకూ ఆగి మరలా మొదలుపెట్టాడు రాజేందర్- "మా ఆఫీసు నుండి ఒక మనిషిని తమిళనాడు పంపాం. శివరామన్ ఇచ్చిన అడ్రస్ కరక్టే! అక్కడ అతని తల్లిదండ్రులు ఉన్నారు కూడా! ఆశ్చర్యమేమిటంటే.. ఇంకా వారు కూలి పని చేసుకు బతుకుతున్నారు.

కొత్తగాలి... 

**నీడనిచ్చే**
**చెట్లను కూల్చకు**
**నిలువునా**
**భూమాతను చీల్చకు**

**- కోట ధరణీశ్రీ,**
హైదరాబాద్

వారికి అతను కనపడి పది సంవత్సరాల పైనే అయింది. ఊర్లో మేము చేసిన ఎంక్వయిరీల ఆధారంగా తేలిందేమిటంటే అతను ఇకముందు వస్తాడన్న నమ్మకం కూడా ఎవరికీ లేదు. అతనికి చిన్నప్పటి నుండి అభిమానాలూ, ప్రేమలూ తక్కువ.."

"ఐసీ.." సాలోచనగా అన్నాడు పాండు.

"తాత్కాలిక అడ్రస్‌గా అతను చెప్పిన చోట కూడా మేము ప్రయత్నించి చూశాము. కానీ అక్కడ మనుషులు ఎప్పుడూ మారిపోతూ ఉంటారు. శివరామన్ ఫొటో ఒకటి చూపించి అందరినీ అడిగి చూశాము. కానీ ఏమీ ఉపయోగం కనపడలేదు. అప్పుడు అతనితో పాటు ఉన్నవారు చాలామంది ఇప్పుడు మారిపోయారు. కొంతమంది ఉన్నా అతని గురించి వారు ఏమి చెప్పలేకపోయారు"

ఆలోచిస్తూ ఉండిపోయాడు పాండు.

"మీ దగ్గర శివరామన్ ఫొటో ఉంది కదా!"

"ఉంది సర్"

"నాకు ఒక కాపీ ఇవ్వండి"

"అలాగే సర్! తరువాత ఆ కంపెనీకి రాక ముందు పనిచేసిన అన్ని చోట్లకూ వెళ్ళివచ్చాం. అతని గురించి కానీ, అతని ప్రస్తుత నివాసం గురించి కానీ ఏమీ తెలియలేదు"

తన ఆలోచనలనుండి తేరుకుని 'నెక్స్ట్' అన్నట్లు చూశాడు పాండు.

"తరువాత అతను చదివిన కాలేజీలన్నీ వెళ్ళి వచ్చాం. అక్కడ ఉన్న లెక్చరర్లందరినీ కలిశాం. అందరూ ఒకటే మాట.. అతను పెద్దగా ఎవరితోనూ కలిసేవాడు కాదని. చివరకు అతనితో పాటు చదివిన క్లాస్ మేట్స్ అందరి జాబితా తెచ్చాము. ఇప్పుడు వారిని ఒకరొక్కరిగా కాంటాక్ట్ చేసే పనిలో ఉన్నాం. దానికి ఇంకా చాలా సమయం పడుతుంది."

"అతను బయటి ఊర్లలో ఉండి చదువుకున్నాడంటే.. అక్కడ ఎక్కడైనా హాస్టళ్లలోనో, బయట పేయింగ్ గెస్ట్‌గానో ఉండి ఉండాలి. ఆ పార్ట్ ఎంక్వయిరీ చేశారా? "

"లేదు సర్.." నోట్ బుక్‌లో రాసుకుంటూ అన్నాడు రాజేందర్ "ఆ కోణంలో కూడా పరిశోధిస్తాం? "

"మీ దగ్గర అతని క్లాస్‌మేట్స్ జాబితా ఉంది అన్నారు కదా? అందులో బాగా చదువుకునే స్టూడెంట్స్ కాకుండా అల్లరి చిల్లరగా తిరిగేవారు ఎవరో వేరుచేసే అవకాశం ఉందా? "

"ఉంది సర్! ఇప్పటికే మా దగ్గర చాలా మంది ఫోన్ నెంబర్లు ఉన్నాయి. వారికి ఫోన్‌చేసి.. వారిలో నాటీయెస్ట్ పర్సన్ ఎవరో చెప్పమని అడుగుదాం.."

"అడగగానే అందరూ అన్ని వివరాలూ చెప్తారా? "

రాజేందర్ నవ్వేసి "అలా డెరెక్ట్‌గా ఎందుకు అడుగుతాం సర్? మేము ఒక వెబ్ సైట్ ఓపెన్ చెయ్యబోతున్నాము.. అందులో మీవి, మీ స్నేహితులవి వివరాలు ఉంటాయి. మిమ్మల్ని ఫలానా మీ ఫ్రెండ్ రికమెండ్ చేశాడు.. అని చెప్పి అడుగుతాం. 99 శాతం మంది చెప్తారు"

"ఆ వివరాలు తెలియగానే ఒక లిస్ట్ నాకు ఇవ్వండి. అలాగే మీకు తెలిసిన వివరాలు ఏవయినా సరే.. నాకు కానీ, భారతి మేడమ్‌కి కానీ తప్ప వేరెవరికీ చెప్పకండి.."

"అలాగే సర్.." అతను చెప్తున్న విషయాలు రాసుకుంటూ అన్నాడు రాజేందర్.

"మీరు నిపుణులు! మీకు సలహాలు ఇవ్వలేను. కానీ ఒక విషయం గుర్తుపెట్టుకోండి. ఇక్కడ మీరు ఆలస్యం చేసే ప్రతి క్షణానికీ మూల్యం.. మీ యజమాని అక్కడ జైలులో కూర్చుని చెల్లిస్తున్నాడు! అంతకంటే నేనేమీ చెప్పలేను"

"అసలు మా వలన ఉపయోగం ఏమీలేదని.. మా ఏజన్సీని ఈ బాధ్యతల నుండి తొలగిస్తారేమో అనుకున్నాను సర్"

ఒక్క శాతం ఉపయోగం ఉన్నా సరే.. సహదేవ్‌గారు బయటకు వచ్చేవరకూ ఏ మార్గాన్నీ మూసివేయలేము. అందరూ ఒక టీమ్‌లాగా పనిచెయ్యండి. త్వరగా రిజల్ట్స్ ఇవ్వటానికి ప్రయత్నించండి. మీరు శివరామన్‌ని నా ముందు ఉంచగలిగితే.. మీకు నేను ఆఫర్ చేస్తున్న బోనస్ 50 లక్షలు"

వింటున్న రాజేందర్ ఉలిక్కి పడ్డాడు. తను విన్నది నిజమో, కాదో అర్థంకాలేదు.

"50 లక్షలా? "

"అయితే ఒక్కటే షరతు. రేపటి నుండి ఒక్కొక్క రోజు గడిచేకొద్దీ.. ఒక లక్షరూపాయలు అందులో నుండి తగ్గిపోతూ ఉంటాయి. మీరు ఎంత త్వరగా పని పూర్తిచేస్తే.. అంత ఎక్కువ డబ్బు మీకు ముడుతుంది, సరేనా? "

"యస్ సర్!" హడావుడిగా బయటకు వెళ్తూ అన్నాడు రాజేందర్.

★ ★ ★

జైలు నుండి బయటకు వచ్చాక సహదేవ్‌ను కలవలేదు పాండు.

అందుకే పర్మిషన్ తీసుకుని జైలుకి వెళ్ళాడు.

సహదేవ్‌ని కలిసి బయట జరుగుతున్నదంతా వివరించాడు. అంతేకాదు రెడ్ బాక్స్ మరలా క్షేమంగా అతని సేఫ్‌లోకి చేరిందని కూడా చెప్పాడు.

"అతని క్లాస్‌మేట్స్ నుండి అల్లరి చిల్లర వాళ్ళను విడగొట్టటం ఎందుకు? " సహదేవ్ కుతూహలంగా అడిగాడు.

"జనరల్‌గా ఆపోజిట్ టైప్ ఆఫ్ పర్సనాలిటీస్ ఒకరికొకరు త్వరగా ఎట్రాక్ట్ అవుతారు. మంచి స్నేహితులను తీసుకుంటే- ఒకరు బాగా మాట్లాడే వ్యక్తి అయితే మరొకరు మితభాషి అయి ఉంటారు. ఒకరు ఒంటరితనం ఇష్టపడే వారయితే మరొకరు సోషల్‌గా మూవ్ అయ్యే వ్యక్తి అయి ఉంటారు. శివరామన్ చదువుకునే రోజుల్లో తనొక మంచి స్టూడెంట్. పెద్దగా ఎవరితోనూ కలిసే వాడు కాదని మనకు తెలిసింది కదా? కాబట్టి అతనికి స్నేహితులంటూ ఎవరన్నా ఉండి ఉంటే.. వారుకాస్త నాటీ టైప్ పర్సన్ అయి ఉండాలని ఊహిస్తున్నాను. వారిని కాంటాక్ట్ చేద్దామని ఆ జాబితా తయారు చెయ్యమన్నాను"

మెచ్చుకోలుగా తలూపాడు సహదేవ్.

"ఆ జాబితాలో కూడా ఏవైనా ఆడ పేర్లు ఉన్నాయేమో గమనించి వాటిమీద ఎక్కువ దృష్టి కేంద్రీకరించండి. ఆపోజిట్ టైప్ ఆఫ్ పర్సనాలిటీ- ఆపోజిట్ సెక్స్ కూడా అయితే ఇంకా ఎక్కువ ఆకర్షింప బడే అవకాశం ఉంది"

"నిజమే.. ఈ ఆలోచన నాకు రాలేదు. అలాగే చేస్తాను. ఇంతకీ నేను మిమ్మల్ని కలిసిన ముఖ్య ఉద్దేశం ఏమిటంటే- ఒక రోజు శివరామన్ మీకు టీవీలో కనిపిం చాడు అన్నారు కదా? దాని గురించి మరొకసారి చెప్పండి"

"తాజ్ హోటల్‌లో జరుగుతున్న ఫంక్షన్ని కవర్‌చేస్తున్నారు టీవీ వాళ్ళు. న్యూస్ రిపోర్ట్ చేస్తున్న విలేఖరి వెనుక పెద్ద హాల్ ఉంది. దాని నిండా టేబుల్స్ వేసి ఉన్నాయి. వాటి చుట్టూ కొంతమంది వ్యక్తులు కూర్చుని ఉన్నారు. అందులో శివ రామన్ ఒకడు అని గమనించాను.."

"అంటే ఏదో క్యాజువల్ విజిటర్ కాదన్న మాట. గ్యారంటీగా హోటల్‌లో రూం తీసుకుని ఉండాలి. అక్కడ వెతికితే అతని అడ్రస్ దొరికే ఛాన్సు ఉంది. నేను ఈ రోజే స్వయంగా ముంబయ్ వెళ్తాను. అక్కడ శివరామన్ ఆచూకీ కోసం ప్రయత్నిస్తాను"

టైం అయిపోయినట్లు సందేశం వచ్చింది సెంట్రీల నుంచి.

"ఒక విషయం గుర్తు పెట్టుకోండి సర్! మేమంతా మీ వెనుక ఉన్నాం. ఈ పని మీదే ఉన్నాం! మీరు ఏ హత్యా చెయ్యలేదని పూర్తిగా నమ్ముతున్నాం! ధైర్యంగా ఉండండి. అతి త్వరలోనే అన్నీ తప్పక సర్దుకుంటాయి"

అర్థం చేసుకున్నట్లు పాండు చేతిని నొక్కి వడివడిగా నడుచుకుంటూ లోపలకు వెళ్ళిపోయాడు సహదేవ్!

★ ★ ★

పాండు ముంబయ్ బయలుదేరుతుంటే రాజేందర్ వచ్చి క్రితం రోజు పాండు అడిగిన జాబితా ఇచ్చాడు.

అప్పటికే ఫ్లైట్ సమయం దగ్గరవుతోంది. హడావుడిగా బయలుదేరి కారులో కూర్చున్నాడు పాండు.

కారు ఎయిర్‌పోర్ట్ చేరటానికి గంట సమయం పడుతుంది. ఆ సమయం వృథాగా పోనివ్వటం ఎందుకని జేబులో నుండి లిస్ట్ తీసి పరిశీలించటం మొదలు పెట్టాడు.

దాదాపు నలభై పేర్లు ఉన్నాయి అందులో. అన్నిటికీ ఎదురుగా వారి అడ్రస్, ఫోన్ నెంబర్లు ఇవ్వబడి ఉన్నాయి.

అందులో ఆడవారి పేర్లు ఎన్ని ఉన్నాయో లెక్కపెట్టాడు. పదహారు ఉన్నాయి.

ఈ పేర్లన్నీ ఆల్రెడీ డిటెక్టివ్ ఏజన్సీ పరిశీలించిన పేర్లే! అప్పుడు వారికి దొరకని క్లూ.. ఇప్పుడు తనకి మాత్రం ఏమి దొరుకుతుంది? ఏదైనా ప్రత్యేకమయిన ట్రాక్ ఆలోచించి సంభాషించాలి వీరందరితో! అంతేకానీ.. మామూలుగా ఫోన్‌చేసి -'శివరామన్ ఎక్కడ ఉన్నాడో.. తెలుసా?' అంటే ఎవరు చెప్తారు?

కాసేపు ఆలోచించాక సడన్‌గా ఫ్లాష్

## కొత్తగాలి...

**శాంతికి**
**విలువ లేకుండా పోతుందనేమో**
**మనిషి**
**యుద్ధాల్ని కాంక్షిస్తాడు!**

– ప్రతాప వెంకట సుబ్బారాయుడు,
సికింద్రాబాద్

అయింది. అవునూ! అసలు శివరామనే ఫోన్ చేస్తున్నట్లు అందరికీ చెప్తే వారి రియాక్షన్ ఎలా ఉంటుంది?

ఐడియా బాగానే ఉన్నట్లుంది. ట్రై చేస్తే పోలా! అనుకుని జాబితా పరిశీలించి అందులో కనిపించిన మొదటి నెంబరుకు ఫోన్ చేశాడు పాండు.

అటు నుండి ఫోన్ ఎత్తుకున్న గొంతు "హలో!" అంది.

"హాయ్ శిల్పా! నేను శివరామన్‌ని మాట్లాడుతున్నాను" లిస్ట్‌లో రాసి ఉన్న ఆమె పేరు చూస్తూ మాట్లాడాడు పాండు.

"శివరామనా..? " సందిగ్ధంగా అంది అటువైపు స్వరం.

"మనం చెన్నయ్‌లో కలిసి చదువుకున్నాం! నేను.. నీ క్లాస్‌మేట్‌ని.."

"ఓహ్! ఆ శివరామనా? " గుర్తువచ్చినట్లు ఎగ్జయిట్ అయింది శిల్పగొంతు.

"ఎక్కడి నుండి ఫోన్ చేస్తున్నావ్? ఇప్పుడు ఎక్కడ ఉంటున్నావ్? "

అంటే - ఆమెకు శివరామన్ ప్రస్తుత నివాసం గురించి ఏమీ తెలియదన్నమాట. ఇంక ఈ ఫోన్‌కాల్ కొనసాగించటం వలన ఉపయోగం లేదు. కానీ తనే ఫోన్ చేసి అర్ధాంతరంగా కాల్ ఎలా కట్ చెయ్యాలో అర్థంకాలేదు పాండుకి.

"నేను ముంబయ్‌లో ఉంటున్నాను.." ఏదో ఒకటి చెప్పాలి కాబట్టి చెప్పాడు పాండు.

"వెరీ నైస్! నెక్స్ట్ టైమ్ ముంబయ్ వచ్చినపుడు నీ దగ్గరకు వస్తా! మంచి ట్రీట్ ఇవ్వాలి"

ట్రీట్ ఎందుకడుగుతుందో అర్థంకాలేదు పాండూకి. అతను సమాధానం చెప్పేలోపు మరలా అవతల స్వరమే మాట్లాడింది.

"అన్నట్లు ఇప్పుడు ఎక్కడ పనిచేస్తున్నావ్? అన్నట్లు మొన్న ఎవరో ఫోన్‌చేసి నీ అడ్రస్ అడిగారు. తెలియదని చెప్పాను.." అంటూ అనర్గళంగా సాగిపోతోంది ఆ సంభాషణ.

ఇక ఈ కాల్ కొనసాగిస్తే తరువాత దానిని ఆపే శక్తి ఎవరికీ ఉండదని అర్థమయిన పాండు, ఆమె చెప్పేది వినిపించుకోకుండా- "సారీ శిల్పా.. ఇంకొక కాల్ వస్తోంది. నేను మరలా ఫోన్ చేస్తాను" అని ఫోన్ కట్‌చేసి "ఉఫ్.." అని గట్టిగా నిట్టూర్చాడు.

ఇంతలో ఎయిర్‌పోర్ట్ రావటంతో కారు దిగి టెర్మినల్‌లోకి నడిచాడు.

చెక్ ఇన్ అప్పటికే మొదలయింది. వెళ్ళి బోర్డింగ్ పాస్ తీసుకుని సెక్యూరిటీ చెక్ కూడా పూర్తి అయ్యాక, లాంజ్‌లోని సోఫాలో కూర్చుని మరలా లిస్ట్ తీశాడు.

అందులో మరొక అమ్మాయి పేరు చూసి ఫోన్ చేశాడు.

"హలో.." అప్పుడే నిద్రలేచినట్లు బద్ధకంగా వినిపించింది అవతలివైపు గొంతు.

"హలో.. నేను శివరామన్‌ని మాట్లాడుతున్నాను.."

అతని మాటలు పూర్తికాకముందే.. అవతల పక్క స్వరంలో తీవ్రత హెచ్చింది- "ఎక్కడ చచ్చావ్ ఇప్పటిదాకా? ఆర్డరిచ్చిన పిజ్జా ఏమయింది? ట్రాఫిక్‌లో ఇరుక్కున్నానని మాత్రం చెప్పకు.."

ఈ పిజ్జాగోల ఏమిటో అతనికి ముందు అర్థంకాలేదు. కానీ ఆమె తనను పిజ్జా సరఫరా చేసే బాయ్ అనుకుంటుందని నెమ్మదిగా అర్థమయింది.

"..అదికాదు ప్రీతీ! నేను పిజ్జాబాయ్‌ని కాదు.. నీ క్లాస్‌మేట్ శివరామన్‌ని.." అని వివరించాడు, అంతకంటే ఏమి చెప్పాలో అర్థంకాక.

"ఓహ్.. నువ్వా? " విసుగ్గా అంది ప్రీతి.

"శివరామన్ అంటే.. లీన్ అండ్ బ్లాక్ చాప్.. అవునా? " కన్ఫర్మ్ చేసుకోవటానికి అన్నట్లు అడిగింది.

నిజం శివరామన్ అయితే ఏమి చేసేవాడో కానీ.. పాండు మాత్రం, "అవును" అని ఊరుకున్నాడు.

"అప్పట్లో మూతిమీద మీసం, నోట్లో నాలుకా రెండూ ఉండేవి కాదుగా? ఇప్పుడేమిటి ధైర్యంగా నాకే ఫోన్ చేశావ్?"

"ఈ మధ్య శిల్ప ఫోన్‌చేసి నీ నెంబర్ చెప్పింది. ఒకసారి పలుకరిద్దామని.."

"పలుకరించేదేంటిరా బడుద్ధాయ్! ఫోన్ పెట్టు! పిజ్జావాడు ట్రై చేస్తూ ఉండి ఉంటాడు.." అంటూ కట్ చేసింది.

ఇంతలో ఫ్లైట్ బయలుదేరుతుందన్న ఎనౌన్స్‌మెంట్ వినిపించింది. ఫోన్ స్విచ్ ఆఫ్ చేసి లోపలకు నడిచాడు.

మరొక గంట తరువాత ముంబయ్‌లో దిగాడు అతను.

బయటకు వచ్చి టాక్సీలో కూర్చుని తాజ్ హోటల్‌కు పోనివ్వమని చెప్పి మరలా ఫోన్ ఆన్ చేశాడు.

ముచ్చటగా మూడోసారి మరొక నెంబర్ ప్రయత్నించాడు.

"అల్లంత దూరాన ఒక గాడిద.. సెల్ ఎదుట నిలిచింది నీ తీరుగా.. అరుదయిన చింపాంజీలా.. కొవ్వెక్కిన దున్నపోతులా.." శ్రుతి బద్ధంగా పాట వినిపించింది.

తరువాత ఫోన్ ఎత్తిన యువతి గొంతు అల్లరిగా వినిపించింది "హలో.. ఎలా ఉంది పాట? ఇప్పుడే పెట్టాను"

అదేమీ పట్టించుకోనట్లు అతను "హలో మంజూ.. నేను శివరామన్‌ని"

"సో వాట్? అదేదో నేను ఒబామాని అన్నంత ధీమాగా చెప్తున్నావ్? నువ్వెవడయితే నాకేంటి? మర్యాదగా నేను అడిగిన దానికి సమాధానం చెప్పు! పాట ఎలా ఉంది?"

"నీ మొహంలాగా ఉంది.." అని ఫోన్ పెట్టేశాడు పాండు.

ఇప్పుడర్థమయింది అతనికి డిటెక్టివ్‌ల పని ఎంత కష్టమో!

ఇంతలో టాక్సీ తాజ్ హోటల్ సమీపించింది.

పాండు దిగి హోటల్‌లోకి నడిచాడు.

ముందే రిజర్వ్ చేసుకున్న రూమ్ వెంటనే అతనికి అలాట్ అయింది. కీ చేతిలోకి తీసుకున్న రూమ్ బాయ్ 'ఇటు రండి సర్!' అంటున్నాడు దారి చూపిస్తూ!

అయితే పాండు అతన్ని అనుసరించకుండా ఆగిపోయాడు. సంశయిస్తూనే రిసెప్షనిస్ట్‌ని అడిగాడు- "ఒక చిన్న ఇన్ఫర్మేషన్ కావాలి.."

"చెప్పండి సర్.. ఏం కావాలి?"

"తాజ్ హోటల్ మరలా ఓపెన్ చేసింది ఏ రోజు?"

చెప్పాడతను ఆశ్చర్యం అణచుకుంటూ!

"ఆ రోజు మా ఫ్రెండ్ ఒకతను ఈ హోటల్‌లో దిగాడు. అతని పేరు చెప్తాను. అడ్రస్ చెప్పగలరా!"

"సారీసర్! కస్టమర్ కాన్ఫిడెన్షియాలిటీ!"

"ఈ విషయం తెలుసుకోవటానికి మరో మార్గం లేదా?"

"సారీ సర్.."

"నో ప్రాబ్లమ్.." అంటూ తన రూమ్ వైపు వెళ్ళిపోయాడు అతను.

రూమ్‌లో లగేజ్ పెడుతున్న రూమ్ బాయ్‌కి టిప్ ఇస్తూ అదే ప్రశ్న మరలా అడిగాడు.

"మా కస్టమర్ రిలేషన్స్ మేనేజర్ని కలవండి సర్.. ఆయన మీకు సహాయం చెయ్యవచ్చు." చెప్పాడతను.

"ఎక్కడ ఉంటారు ఆయన?"

ఆయన ఆఫీసు ఎక్కడ ఉందో చెప్పాడు అతను.

పాండుకి ఆ మేనేజరయినా తనకు కావలసిన వివరాలు ఇస్తాడన్న నమ్మకం లేదు. అయినా ఆ మార్గం మాత్రం ప్రయ

త్నించకుండా వదిలి పెట్టడం ఎందుకని అతన్ని కలవటానికే నిర్ణయించుకున్నాడు.

"ఇప్పుడుంటారా ఆయన ఆఫీసులో? "

టైము చూసి- "మరొక అరగంట ఆగి వెళ్ళండి సర్! ఇప్పుడు ఆయనకు లంచ్ టైమ్.." చెప్పాడు బాయ్.

ఈ లోపు ఖాళీగా ఉండటం ఇష్టంలేక మరొక రెండు ఫోన్ కాల్స్ చేశాడు. కానీ ఉపయోగకరమయిన వివరాలేమీ వాటివలన తెలియలేదు.

మేనేజర్ ఆఫీసు గ్రౌండ్‌ఫ్లోర్‌లో ఉంది. పాండు వచ్చిన పని వినగానే.. అతని మొహంలో నిరాశ కనిపించింది.

"సాధారణంగా కస్టమర్ అడిగిన ఏ కోరికకూ.. లేదు, కాదు అని చెప్పటం నాకు ఇష్టం ఉండదు. కానీ ఇలా ఒక కస్టమర్ వివరాలు మరొకరికి చెప్పటం తప్పు. అందులో ఇప్పుడు సెక్యూరిటీ మరీ కఠినంగా ఉంది.."

ఆయన మాటలను మధ్యలోనే అడ్డుకున్నాడు పాండు.

"మీరిచ్చిన వివరాలు దుర్వినియోగం చెయ్యదలుచుకుంటే ఈ విధంగా సరాసరి మీ దగ్గరకు రాను. పైగా పూర్తి వివరాలు చెప్పలేను. కానీ ఈ పని చెయ్యటం ద్వారా మీరు ప్రభుత్వానికి సహకరిస్తున్నారు"

అతను కాసేపు ఆలోచించి - "ఏమి పేరు అన్నారు? " అన్నాడు.

పాండు చెప్పిన వివరాల ప్రకారం అతను తన కంప్యూటర్లో సెర్చ్ చేశాడు.

"సారీ సర్.. ఆ పేరుగల వ్యక్తి ఏ రూమూ బుక్ చేసినట్లు మా రికార్డుల్లో లేదు.."

అప్పుడు పాండు అతనికి తాము వెతుకుతున్న వ్యక్తి టీవీలో ఈ హోటల్‌లో ఉన్నట్లు కనపడటం గురించి చెప్పాడు.

"అతను హోటల్‌లో జరుగుతున్న ఫంక్షన్‌కి అటెండ్ అయి ఉండవచ్చు లేదా ఆ రోజు ఏదన్నా కాన్ఫరెన్స్ లాంటిది హోటల్లో జరుగుతుంటే దానిలో పాల్గొనటానికి వచ్చి ఉండవచ్చు. అతను హోటల్ లాబీలో కనిపించినంత మాత్రాన హోటల్లో రూమ్ తీసుకుని ఉండవలసిన అవసరం లేదు"

"ఐసీ.." ఆలోచిస్తున్నట్లు అన్నాడు పాండు.

"పోనీ ఆ రోజు ఈ హోటల్లో ఏదన్నా రియల్ ఎస్టేట్‌కి సంబంధించి కాన్ఫరెన్స్ జరిగిందేమో చూడగలరా? " అన్నాడు.

మేనేజర్ మరలా కంప్యూటర్లో వెతికాడు.

"లేదు.. అలాంటిదేమీ లేదు. స్పోర్ట్స్‌కి సంబంధించిన కాన్ఫరెన్స్ ఒకటి, గులాబీ పూల ఎగుమతికి సంబంధించిన కాన్ఫరెన్స్ ఒకటి జరిగింది. అంతే తప్ప రియల్ ఎస్టేట్‌కి సంబంధించి ఎలాంటి సమావేశం ఈ హోటల్లో జరగలేదు"

"థాంక్యూ.." అంటూ నిరాశగా లేచి నిలబడ్డాడు పాండు.

"ఇంకేదన్నా సహాయం అవసరం అయితే చెప్పండి సర్! ఉయ్ ఆర్ ఎట్ యువర్ సర్వీస్.."

"అలాగే.." అని తిరిగి తన రూమ్‌కు చేరుకున్నాడు.

ఇంకేవిధంగా ముందుకు వెళ్ళాలో అతనికి అర్థం కాలేదు.

ఇంతలో హైదరాబాద్ నుండి కెప్టెన్ రాజేందర్ ఫోన్ వచ్చింది.

"సార్ కచ్చితంగా చెప్పలేము కానీ... శివరామన్ ముంబయ్‌లో ఉండే ఛాన్సు ఎక్కువ కనిపిస్తుంది. అతని ఒకరిద్దరు పాత స్నేహితులు అదే సూచించారు. అందుకే నేను మరొక అసిస్టెంట్‌ను తీసుకుని ముంబయ్ వస్తున్నాను."

"రండి! ఒకరికంటే ఎక్కువ మంది ఉంటే కొన్ని కొత్త ఆలోచనలు రావచ్చు."

అప్పటికే పొద్దుపోవటంతో నిద్ర ముంచుకు వస్తోంది పాండుకి.

అతను నిద్ర లేచేటప్పటికి పూర్తిగా తెల్ల వారిపోయింది. మరి కాసేపట్లో హోటల్‌కి చేరుకుంటున్నామని రాజేందర్ నుండి ఫోన్ వచ్చింది.

ఈ లోపు మరలా ఫోన్ నెంబర్ల జాబితా ముందు పెట్టుకు కూర్చున్నాడు పాండు. జాబితాలో తరువాత నెంబర్ డయల్ చేశాడు.

ఈ సారి ఫోన్ ఎత్తిన అమ్మాయి పేరు విద్య. ఆ అమ్మాయి మాట్లాడుతున్న మాటలు వింటుంటే.. అతనికి ప్రాణం లేచి వచ్చింది.

"హలో విద్యా.. నేను శివరామన్‌ని మాట్లాడుతున్నాను.." అందరికీ చెప్పినట్లే చెప్పాడు పాండు.

"హాయ్ శివా! ఏంటి కొత్త నెంబర్ నుండి చేస్తున్నావ్?"

స్టన్ అయ్యాడు పాండు. అంటే ఈ అమ్మాయికి శివరామన్ ఫోన్ నెంబర్ తెలుసన్న మాట. తేరుకుని - "నా ఫోన్ ఛార్జ్ లేదు. అందుకని దీని నుండి చేస్తు న్నాను."

"నీ గొంతు ఏమిటి.. కొత్తగా ఉంది?" అనుమానంగా అడిగింది.

"జలుబు చేసిందిలే.." గొణుగుతున్నట్లు చెప్పాడతను. వెతుకుతున్న లింకు ఇలా అనుకోకుండా తగలటంతో అతను తబ్బిబ్బు అవుతున్నాడు.

"ఏమిటి శివా? నా మీద ఎంత ప్రేమ ఉంటే మాత్రం రోజూ అన్ని పూలు పంపాలా?"

"నీకు ఎన్ని పూలు పంపినా తక్కువే!"

"ఏమో.. నాకు అనుమానం వస్తోంది. మీ పొలంలో పండుతున్నాయి అని పంపు తున్నావు తప్ప. నిజంగా డబ్బులు పెట్టి కొని అయితే రోజూ ఇన్ని పంపుతావా?"

"అదేమీ లేదు.." ఆమె చేత ఎక్కువ మాట్లాడించాలని ప్రయత్నిస్తూ ఏదో ఒక సమాధానం ఇచ్చాడు.

"అయినా గులాబీలు తప్ప ప్రపంచంలో పూలే లేవా? రోజూ అవే ఎందుకు పంపు తున్నావ్? డబ్బు ఖర్చు లేదనే కదూ?" అంటూ, అంతలోనే- "సారీ శివా! మా బాస్ పిలుస్తున్నారు. తరువాత నేను ఫోన్ చేస్తానులే!" అని పెట్టేసింది.




యాహూ.. అంటూ ఎగిరి గంతులు పెట్టేంత ఆనందం కలిగింది పాండుకి. బలవంతంగా దానిని అణచుకుని ముందుకు ఎలా ప్రొసీడవ్వాలో ఆలోచిం చటం మొదలుపెట్టాడు.

అతనికి హోటల్ మేనేజర్ చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. అవును.. ఆ రోజు హోటల్లో గులాబీ పూల ఎగు మతిదారుల సమావేశం జరిగిందని అతను చెప్పాడు. బహుశా దానికి అటెండ్ అవటానికి వచ్చిన శివరామన్ టీవీలో సహదేవ్‌కి కనిపించి ఉంటాడు.

ఇప్పుడు హోటల్లో పూల ఎగుమతిదా రుల సమావేశం ఏర్పాటు చేసిన సంస్థ దగ్గరకు వెళ్ళి అడిగితే శివరామన్ వివ రాలు తెలిసే అవకాశం ఉంది.

ఇంతలో రాజేందర్ అతని అసిస్టెంట్ మీనన్‌ని తీసుకుని అక్కడకు చేరుకు

న్నాడు.

విషయం తెలియగానే మీనన్ వెళ్ళి.. ఆ రోజు హోటల్లో సమావేశమయిన సంస్థల వివరాలు తీసుకువచ్చాడు. అదేమీ రహస్యం కాదు కాబట్టి.. అడిగిన వెంటనే ఆ వివరాలు ఇచ్చారు.

"మేము ఆ గులాబీపూల ఎగుమతి సంస్థ వద్దకు వెళ్ళి వివరాలు తీసుకు వస్తాం! మీరు ఇక్కడే ఉండండి.." అని పరుగు పరుగున బయలు దేరారు రాజేందర్, మీనన్‌లు.

అలా వెళ్లినవారు మరొక రెండుగంటల తరువాత మొహం వేలాడదీసుకుని వచ్చారు.

"ఏమయింది? " వారిని చూడగానే ఎదురుదెబ్బ తగిలిందని అర్థమవుతున్నా అడిగాడు పాండు.

"ఆ సమావేశంలో పాల్గొన్నవారంతా తమ తమ సంస్థల తరపున వచ్చినవారే తప్ప వ్యక్తిగతంగా ఎవరూ రాలేదంట. కాబట్టి మనిషి పేరుని బట్టి వివరాలు తెలిసే అవకాశం అక్కడ లేదు. అయినా ఆ రోజు అక్కడ హాజరయిన అన్ని సంస్థల వివరాలూ పట్టుకొచ్చాము"

ఆ జాబితా తీసుకుని చూశాడు పాండు.

దానిలో యాభైకిపైగా సంస్థల పేర్లు ఉన్నాయి. వాటిలో శివరామన్ ఉన్నాడేమో కనుక్కోవాలంటే.. వాటన్నిటికీ ఫోన్ చెయ్యాలి. లేదా స్వయంగా వెళ్ళి వెతకాలి. ఏదైనా ఇప్పుడప్పుడే పూర్తయ్యే పని మాత్రం కాదు.

తమ మీద ఆశతో ఎదురుచూస్తున్న సహదేవ్ మొహం అతని కళ్ళ ముందు మెదిలింది. నమ్మక ద్రోహం చేసిన శివరామన్ ఫైవ్‌స్టార్ హోటల్లో కులుకుతుంటే.. మోసపోయిన వ్యక్తి జైలులో మగ్గుతున్నాడు. అది తలుచుకోగానే అతని రక్తం ఉడికిపోయింది. ఎలాగయినా శివరామన్‌ని కనిపెట్టాలన్న పట్టుదల మరింత పెరిగింది. తనే నిరాశపడితే మిగతావారు మరింత నీరసించి పోతారని గుర్తుకు వచ్చింది.

"డోంట్ వర్రీ! అంతగా నిరాశ పడకండి. మన దగ్గర విద్య ఫోన్ నెంబర్ ఉందిగా! అటువైపు నుండి నరుక్కురావటానికి ప్రయత్నిద్దాం"

"ఆమెకి శివరామన్ ఫోన్ చేస్తున్నాడన్న విషయం మనకు తెలుసు. కాబట్టి ఆమె ఫోన్ రికార్డులు సంపాదించగలిగితే అందులో నుండి శివరామన్ చేసిన కాల్ ట్రేస్ చెయ్యవచ్చు" చెప్పాడు మీనన్.

"ఆమె నెంబర్ ఎంత? " అడిగాడు రాజేందర్.

పాండు తన దగ్గర ఉన్న లిస్ట్ చూసి ఆమె నెంబర్ చెప్పాడు.

తల అడ్డంగా ఊపాడు రాజేందర్.

"ఆ నెట్‌వర్క్ వాళ్ళు మహాస్ట్రిక్టు. ఎట్టి పరిస్థితుల్లో మనకు ఆ ఇన్ఫర్మేషన్ ఇవ్వరు" అన్నాడు.

"మీకు తెలిసినవారు ఎవరన్నా అక్కడ పని చేస్తున్నారేమో కనుక్కోండి. అలాగే ఏమన్నా డబ్బుల్తో పని జరిగినా పరవా లేదు"

"కష్టం సర్!" నీరసంగా అంటూనే ఆ ప్రయత్నం మీద మీనన్‌ని పంపాడు రాజేందర్.

"మరొకసారి విద్యకు ఫోన్‌చేసి చూస్తే.." తనలో తను అనుకుంటున్నట్లు అన్నాడు పాండు.

ఈ రోజే కదా ఫోన్ చేసింది.. మరలా అప్పుడే మరొకసారి చేస్తే అనుమానం వస్తుందేమో! అయినా తప్పదు. అసలు మరొక విధంగా ఆలోచిస్తే.. ఇప్పటికే ఆలస్యం అయిందేమో! ఈ లోపు విద్య, శివరామన్‌లు పరస్పరం మాట్లాడుకుని ఉంటే.. ఇంతకుముందు కాల్ గురించి

తప్పనిసరిగా ఆమె మాట్లాడుతుంది. అప్పుడు శివరామన్‌కి తనకోసం ఎవరో వెతుకుతున్నారన్న విషయం అర్థమయి పోతుంది.

అందుకే ఏమయితే అది అయిందని మరలా విద్య నెంబర్‌కి ఫోన్ చేశాడు.

"హల్లో శివా.. ఏంటి ఇంకా నీ ఫోన్ ఛార్జ్ కాలేదా? " నెంబర్ చూసి గుర్తుపట్టి అడిగింది విద్య.

"లేదు. నేను బయట దూరంగా ఉన్నాను. అందుకే నా ఫోన్ ఛార్జ్ చెయ్యటం కుదరలేదు"

"మరి ఈ ఫోన్ ఎవరిది? "

"ఫోన్ గొడవ వదిలి మామూలు మాటలు మాట్లాడలేవా? నేను నిన్ను ఒక సారి కలవాలనుకుంటున్నాను"

"సర్‌ప్రయిజింగ్.. నువ్వేమిటి? నీ అంతట నువ్వే ఇలా కలుద్దామని ప్రపోజ్ చెయ్యటమేమిటి? నేను నమ్మలేకపోతు న్నాను. సరే! చెప్పు. ఎక్కడ కలుద్దాం?

"ఊ.. నువ్వే చెప్పు. నీకు ఎక్కడ వీల యితే అక్కడే కలుద్దాం.."

"అయితే మా ఆఫీసు దగ్గర్లో 'బిగ్ క్యాట్' అని ఒకపబ్ ఉంది, తెలుసు కదా! దాని దగ్గరకు రా! సాయంత్రం ఏడు గంట లకు అక్కడ ఎదురు చూస్తుంటాను. సరేనా? "

"అలాగే! ఈ లోపు నా ఫోన్‌కి కాల్స్ చెయ్యవద్దు. చెప్పాగా.. ఛార్జ్ లేదనీ"

"ఓకే! ఓకే! లెటజ్ మీట్ బై సెవన్!" అంటూ ఫోన్ పెట్టేసింది విద్య.

పక్కనే కూర్చుని సంభాషణ అంతా వింటున్న రాజేందర్ పాండుని అభినందిం చాడు.

"చాలా బాగా హాండిల్ చేశారు సర్! పక్కా ప్రొఫెషనల్ లాగా డీల్ చేశారు"

"అది సరే! సాయంత్రం 'బిగ్ క్యాట్' దగ్గర ఏమి చెయ్యాలి? విద్య ఎలా ఉంటుందో మనకు తెలియదు. నన్ను చూడగానే నేను శివరామన్‌ని కాదని ఆమెకు తెలిసిపోతుంది. మరి ఎలా? "

ఇద్దరూ ఆలోచిస్తూండిపోయారు.

ఎవరి ఆలోచనలలో వారుండగానే సాయంత్రం అయింది.

బయటకు వెళ్ళిన మీనన్ వెనక్కి వచ్చాడు. అతను వెళ్ళిన పని కాలేదు. టెలీఫోన్ కంపెనీవాళ్ళు ఎవరూ సహకరించలేదు.

ముందు నుండి ఊహించిందే కాబట్టి దాని గురించి పెద్ద వర్రీ కాలేదు మిగిలిన ఇద్దరూ!

ఇప్పుడు తక్షణ సమస్య 'విద్యని ఎలా కలవాలి? ' అని.

ఇంతలో పాండు తన ఆలోచనలను రాజేందర్‌తో చెప్పసాగాడు- "అసలు మనం విద్యని కలవకపోతే వచ్చే నష్టం ఏముంది? మనకు కావలసింది విద్య ఫోనూ! అందులో ఉన్న శివరామన్ నెంబరూ! కాబట్టి ఆవిడ ఫోను సంపాదిస్తే చాలు"

"అదే.. ఎలా? " అడిగాడు రాజేందర్.

"బ్లంట్‌గా చెప్పాలంటే దొంగతనం చెయ్యాలి"

"దొంగతనమా? అది అందరివల్లా అయ్యే పని కాదు. దానికి కూడా నైపుణ్యం ఉండాలి! నావల్ల అసలు కాదు"

"నా వలన అవుతుంది" నమ్మకంగా చెప్పాడు పాండు.

అతని గతం గురించి తెలియని మిగిలిన ఇద్దరికీ అంత నమ్మకం లేకపోయినా అతనికి ఎదురు చెప్పలేదు.

సమయం సమీపించటంతో ముగ్గురూ బయలుదేరారు.

మీనన్ అంతకుముందే ఒక కారు తాము అక్కడ ఉన్నన్ని రోజులూ వాడుకోవటానికి అద్దెకు తీసుకుని వచ్చాడు.

దానిని అతను డ్రైవ్ చేస్తుంటే రాజేందర్, పాండు వెనుక కూర్చున్నారు.

అనుకున్న సమయానికి 'బిగ్ క్యాట్' ముందు ఆగింది కారు.

పాండు లోపలకు నడిచాడు.

మిగిలిన ఇద్దరూ కారులోనే ఉండిపోయారు.

లోపల మరీ కిక్కిరిసి లేకపోయినా.. అప్పటికే జనంతో నిండిపోయి ఉంది. 'ఇప్పుడే ఇలా ఉంటే.. ఇంక పొద్దుపోయే సమయానికి ఎంత రష్‌గా ఉంటుందో..' అనుకున్నాడతను.

డాన్స్‌ఫ్లోర్ దగ్గర జనం పలుచగా ఉన్నారు. ఎక్కువమంది అప్పుడప్పుడే వస్తున్నారు. వచ్చినవారు ముందుగా బార్ కౌంటర్ దగ్గరకు వెళ్ళి తమకు కావలసిన డ్రింక్ తెచ్చుకుని ఒకచోట కూర్చుని సిప్ చేస్తున్నారు.

ఎక్కువమంది గ్రూపులగానో, జంటలతోనో వచ్చారు. ఒంటరిగా ఉన్న వారిని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు.

ముగ్గురు యువతులు ఒంటరిగా ఉండటం గమనించాడు పాండు. వారిలో విద్య ఎవరు? ఎలా తెలుసుకోవటం?

బయట కారులో కూర్చుని ఉన్న రాజేందర్‌కి ఫోన్ చేశాడు పాండు. రాజేందర్ లిఫ్ట్ చెయ్యగానే తన సమస్య వివరించాడు.

రాజేందర్ ఒకక్షణం ఆలోచించి సొల్యూషన్ చెప్పాడు.

"ఆ అమ్మాయిలందరూ మీకు కనిపిస్తూ ఉన్నారా? "

"ఆహా.. దివ్యంగా!"

"అయితే.. విద్య నెంబర్‌కి నేను ఫోన్

# ఫేస్‌బుక్కా.. మజాకా?




ఒకప్పుడు ఉత్తరాలే వ్యక్తిగత సమాచారానికి ఆధారం. ఇంటర్నెట్ యుగంలో నేడు ఇ-మెయిల్స్‌తో సామాజిక వెబ్ సైట్స్ క్షణాల్లో సమాచారాన్ని తమ బంధుమిత్రులకి అందిస్తున్నాయి. అలాంటి వాటన్నిటిలోకి ప్రముఖమైంది ఫేస్‌బుక్. ఇది 2004లో ప్రారంభమైంది. ప్రస్తుతం ఇందులో 900 మంది సిబ్బంది పనిచేస్తున్నారు. ప్రస్తుతం డెబ్భై కోట్ల మంది సభ్యులుగల ఫేస్‌బుక్కులోకి 2012 ఆగస్టునాటికి వందకోట్ల మంది సభ్యులుగా చేరతారని అంచనా. వీరిలో ప్రస్తుతం సభ్యులుగా 13 కోట్లమంది అమెరికాలో, 3.7 కోట్లమంది ఇండోనేషియాలో, 2.89 కోట్లమంది యూకేలో ఉన్నారు. ఇండియాలో 2.5 కోట్లమంది సభ్యులు ఉన్నారు. అతి తక్కువగా చైనాలో 93 వేలమంది మాత్రమే ఇందులో చేరారు. ప్రతి నిమిషానికి ఫేస్‌బుక్‌లో ఐదు లక్షల సమాచారాలు నమోదవుతాయి. అలాగే 2.3 లక్షల సమాచారాలు ఇతరులకు చేరుతుంటాయి. 1.36 లక్షల ఫొటోలు అప్‌లోడ్ అవుతాయి. లక్ష ఫ్రెండ్‌షిప్ రిక్వెస్టులను అంగీకరిస్తుంటారు. ప్రస్తుతం ఫేస్‌బుక్ డెబ్భైఐదు భాషల్లో వినియోగమవుతోంది. రోజుకి పదివేల వెబ్ సైట్స్ చొప్పున ఇరవై లక్షల వెబ్ సైట్‌లు దీనికి అనుసంధానమయ్యాయి. ఈజిప్ట్ తదితర దేశాలలో ఇటీవల ప్రభుత్వాల మీద జరిగిన తిరుగుబాట్లు ఫేస్‌బుక్ ద్వారానే ప్రచారమై, ఉద్ధృతంగా కొనసాగాయి. వరదలు, భూకంపాలు, ప్రకృతి విపత్తులప్పుడు ప్రపంచానికి ఎక్కువ సమాచారం ఫేస్‌బుక్ ద్వారానే వెల్లడవుతుండటం గమనార్హం.



చేస్తాను. రెండు మూడు రింగులు రానిచ్చి ఆపేస్తాను. మీరు ఆ అమ్మాయిలందరినీ జాగ్రత్తగా గమనిస్తూ ఉండండి. ఎవరి ఫోన్ మరొక నిమిషంలోపు రింగవుతుందో.. ఆ అమ్మాయే విద్య"

ఒంటరిగా ఉన్న యువతులను ఓరకంట గమనిస్తూ కూర్చున్నాడు పాండు.

వారిలో ఒక యువతి ఫోన్ శబ్దం విన్నట్లు ఉలిక్కిపడి తన బ్యాగ్ తెరవసాగింది. అయితే ఆమె తన ఫోన్ బ్యాగులో నుండి తీసేటప్పటికే రింగ్ ఆగిపోయింది. ఆ నెంబరు ఎవరిదా? అన్నట్లు ఆమె ఫోన్ స్క్రీన్‌ని తదేక దీక్షతో చూస్తోంది.

ఇంకా ఆలస్యం చేస్తే.. ఆమె ఆ నెంబర్‌కి ఫోన్ చేసే అవకాశముందని అనుమానపడిన పాండు లేచి ఆమెను సమీపించాడు.

"హాయ్.. మీరు విద్య కదా!"

తలెత్తి చూసిన విద్య మొహమాటంగా నవ్వుతూ "యా.." అంది.

"నేనూ మీ కంపెనీలోనే పని చేస్తున్నాను. ఈ నెలలోనే జాయిన్ అయ్యాను. మిమ్మల్ని మొదటిరోజు పరిచయం చేశారు. మీపేరు బాగా గుర్తుండిపోయింది"

"అలాగా? " పదుల సంఖ్యలో ప్రతినెలా కొత్త ఉద్యోగులు కంపెనీలో చేరుతుంటారు. అలాగే పాతవారు వెళ్ళిపోతుంటారు. అందుకే అతనిని ఇంతకుముందు చూసిన గుర్తులేకపోయినా.. అతని మాటలలో అనుమానించవలసింది ఏమీ కనిపించలేదు విద్యకి.

"ఫ్రెండ్ కోసం ఎదురు చూస్తున్నట్టున్నారు? "

"అవును.."

"మీ ఫ్రెండ్ వచ్చే వరకూ నేను కంపెనీ

ఇవ్వవచ్చా.."

"వైనాట్.. అలాగే!"

"అయితే అలా కౌంటర్ దగ్గర కూర్చుందాం రండి. ఏదన్నా డ్రింక్ తీసు కుంటూ మాట్లాడుకుందాం.."

ఆమె తన చేతిలోని ఫోన్ బ్యాగులో పడేసి అతన్ని అనుసరించింది.

ఇద్దరూ కౌంటర్ ముందు ఉన్న స్టూల్స్ మీద కూర్చున్నారు.

ఇద్దరి మధ్యా ఒక స్టూల్ ఉండేటట్లు జాగ్రత్త పడిన విద్య దానిమీద తన హ్యాండ్‌బ్యాగ్ ఉంచింది. అలా అది ఇద్దరి మధ్యా అవసరమైనంత దూరం మెయిన్‌టె యిన్ చెయ్యటానికి కూడా ఉపయోగపడు తోంది.

"విచ్ డ్రింక్ డు యు ప్రిఫర్? "

"ఆరంజ్ ఫ్లేమ్స్.."

రెండు ఆర్డర్ చేశాడు పాండు.

"మీరే ప్రాజెక్ట్‌లో పని చేస్తున్నారు? " అడిగింది విద్య.

ఇలాంటి ప్రశ్న ఏదో ఒకటి వస్తుందని అతను ముందు నుండి ఊహిస్తూనే ఉన్నాడు. అందుకే విసుగ్గా మొహం పెట్టి

"ఇక్కడ కూడా ఆఫీసు విషయాలేంటి విద్యా? మనం ఇక్కడకు వచ్చింది ఆఫీసు వర్క్ నుండి డైవర్ట్ అవటానికి గానీ.. ఇక్కడ కూడా అదే విషయాలు మాట్లాడు కోవటానికి కాదు కదా? " అన్నాడు.

విద్య కూడా అంగీకరిస్తున్నట్లు నవ్వింది.

ఆపై వారిద్దరి మధ్య సంభాషణ జన రల్ టాపిక్స్ మీదే కొనసాగింది.

పావు గంటలో డ్రింక్స్ తాగటం పూర్తి అయింది.

"నాకు టైము అవుతోంది. లెటజ్ మీట్ ఒన్సెగైన్. థాంక్స్ ఫర్ యువర్ కంపెనీ" అంటూ ఆమె దగ్గర సెలవు తీసుకున్నాడు పాండు.

పావు గంటలో ఎక్కడా అనవసరమైన చొరవ తీసుకోని పాండు ఆమెకి బాగా నచ్చాడు. 'నైస్ గై' అనుకుంది మనసులో! చివర్లో బిల్ పే చెయ్యవలసి వచ్చినపుడు మాత్రం అవసరమైన దానికంటే ఎక్కువగా తన వైపుకు ఒరిగినట్లు గుర్తుకు వచ్చినా దాని గురించి ఆమె పట్టించుకోలేదు.

ఇంతలో ఆమెకి శివరామన్ ఇంకా రాలే దని గుర్తుకు వచ్చింది. విసుగ్గా మొహం పెట్టి బ్యాగులో నుండి ఫోన్ తియ్యబో యింది.. శివరామన్ ఎందుకు రాలేదో కనుక్కోవటానికి. అయితే బ్యాగులో ఫోన్ కనపడలేదు. ఇంతకు ముందు ఫోన్ బ్యాగులో పెట్టినప్పుడు అది కిందకు జారి పోయిందేమో అనుకున్న ఆమె ఆ చుట్టుప క్కల వెతికింది. కానీ ఫోన్ ఎక్కడా కన పడలేదు. ఫోన్ నెంబర్లన్నీ అందులోనే ఫీడ్ చేసి ఉంటాయి. అది లేకపోతే ఆమెకు ఒక్క నెంబరు కూడా గుర్తుండదు. ఫోన్ పోయిన బాధకంటే.. నెంబర్లన్నీ మళ్లీ సంపాదించాలని అనుకుంటే ఆమెకి ఇంకా కోపం వచ్చింది.

ఆ కోపమంతా ఇంకా రాని శివరామన్ మీదకు మరల్చి 'హు..' అంటూ కాళ్ళు నేలకేసి గట్టిగా కొట్టి విసవిసా బయటకు నడిచింది.

అంతే తప్ప తన పక్కన కూర్చుని బిల్ పే చెయ్యటానికి గానూ తన వైపుకు వంగిన వ్యక్తి ఈ పని చేసి ఉండవచ్చని ఆమెకు అనుమానం కూడా రాలేదు.

★ ★ ★

తాపీగా నడుస్తూ బయటకు వచ్చిన పాండు కారులో కూర్చున్నాడు.

'ఏమైంది? ' అన్నట్లు పాండువైపు చూశాడు రాజేందర్.

జేబులో నుండి సెల్‌ఫోన్ తీసి చూపిం చాడు పాండు.

"ఎక్సలెంట్.." ఆనందపడుతూ

అన్నాడు అతను.

"నిజం చెప్పాలంటే.. మీరు ఈ పని చెయ్యగలరని నేనైతే అనుకోలేదు.." ఫోన్ చేతిలోకి తీసుకుని అన్నాడు.

మీనన్ కారుని ముందుకు కదిలించాడు.

సీటుకి వెనక్కి ఆనుకుని కళ్లు మూసుకున్నాడు పాండు.

'మరలా జీవితంలో దొంగతనం చెయ్యవలసి వస్తుందని నేనే అనుకోలేదు' మనసులో అనుకున్నాడు అతను. మొదటిసారి తండ్రిని బాజీరావు కబంధ హస్తాల నుండి బయటకు రప్పించటానికి దొంగతనం చెయ్యవలసి వస్తే.. ఇప్పుడు తండ్రి హంతకుడిని అజ్ఞాతం నుండి బయటకు రప్పించటానికి చెయ్యవలసి వచ్చింది.

ఆలోచనలను అణచుకుంటూ పక్కకు చూసిన పాండుకి రాజేందర్ ఆల్రెడీ విద్య సెల్‌ఫోన్ బ్రౌజ్ చేస్తూ కనిపించాడు.

★ ★ ★

ముంబయ్ నుండి పూనే వెళ్లే ఎక్స్‌ప్రెస్ హైవేమీద ప్రయాణిస్తోంది శివరామన్ కూర్చున్న బెంజ్ కారు.

లోనావాలా దాటి పాతిక కిలోమీటర్లు వచ్చాక హైవే నుండి ఎడమ వైపు మలుపు తీసుకుంది ఆ కారు.

అప్పటి వరకూ ఎయిట్ లేన్ హైవే మీద 150 కిలోమీటర్ల వేగంతో ప్రయాణించిన కారు తన వేగం తగ్గించుకుని సన్నని రోడ్డు మార్గంలో వెళ్తోంది.

రోడ్డు మీద ఉన్న గుంతలను చాకచక్యంగా తప్పిస్తూ నైపుణ్యంతో తన యజమానికి ఇబ్బంది కలగకుండా డ్రైవ్ చేస్తున్నాడు డ్రైవర్.

వెనుక సీటులో కళ్లు మూసుకుని ఆలోచనల మధ్య ఊగిసలాడుతున్న శివరామన్‌కి ఇవేమీ పట్టలేదు.

ఏదో తెలియని అసంతృప్తి అతనిని వేధి

స్తుంది. పుట్టినప్పటి నుండి డబ్బు కోసం తపించిన అతనికి.. అది దొరికిన తరువాత ఆలోచనలలో మార్పు వచ్చింది.

మొదట్లో డబ్బు ఇచ్చే సుఖాలు బాగున్నట్లనిపించినా.. నెమ్మదిగా, 'వీటికోసమా నేను ఇంత మందిని దూరం చేసుకున్నది' అన్న బాధ పీడించసాగింది. డబ్బు, హోదా, అధికారం.. అన్నీ ఉన్నా, వాటిని చూసి గర్వించటానికి తన వారంటూ లేని ఈ జీవితం బోరు కొడుతుంది. ఇప్పుడు.. చేసిన తప్పుల్ని సవరించుకోలేనంత దూరం వచ్చేశాక మరలా వెనక్కి వెళ్లబుద్ధవుతుంది. మాట మాటకూ తల్లిదండ్రులు గుర్తుకువస్తున్నారు. చూడాలన్నా వారిని తను చూడలేని దుస్థితి. తను వారిని కలుసుకున్న మరుక్షణం.. తను బతికి ఉన్న సంగతి అందరికీ తెలిసిపోతుంది. తల్లిదండ్రుల్ని కూడా రహస్యంగా ఇక్కడకు తెచ్చే ఏర్పాటు చేద్దామంటే.. ప్రాణాలు పోయినా వారు ఇలాంటి రహస్య జీవితం గడపటానికి ఒప్పుకోరు! అన్ని విధాలుగా తను ఇరుక్కుపోయాడు.

ఈ మధ్య అప్పుడప్పుడూ చేసిన తప్పులు ఒప్పుకుని చట్టానికి లొంగిపోదామా? అన్న ఆలోచన వచ్చినా.. సంవత్సరాల తరబడి గడపవలసిన జైలు జీవితం వెన్నులో నుండి వణుకు పుట్టిస్తుంది.

ముఖ్యంగా విద్య పరిచయమైనప్పటి నుండి ఈ ఆలోచనలు ఎక్కువయ్యాయి.

అసలు ఎవరైనా ఒక ఆడపిల్ల తనపట్ల ఎట్రాక్ట్ అవుతుందన్న భావనే అతనికి మొదటి నుంచీ లేదు. తన ఆకారం అవకరంగా ఉంటుందని అతని ప్రగాఢ నమ్మకం.

విద్య పరిచయం అతని నమ్మకాలనూ, అభిప్రాయాలనూ తప్పని నిరూపిస్తూ ఛిన్నాభిన్నం చేసింది.

మొదటిసారి తను కనిపించినప్పుడు ఆమె మొహంలో కనిపించిన ఆనందం.. నటన కానీ, తెచ్చి పెట్టుకున్నది కానీ ఎట్టి పరిస్థితులలోనూ కాదు. పైగా కాలేజీ రోజులనాటి తనకు సంబంధించిన చిన్న చిన్న విషయాలను కూడా ఆమె గుర్తుపెట్టుకున్న తీరు, ఆమెది ఇప్పుడు ఏర్పడిన ఆకర్షణ కాదని నిరూపిస్తోంది.

పోనీ.. ఆమె తన డబ్బు చూసి ఆకర్షితురాలయ్యిందా అంటే.. అదీ కాదు! ఆమె తనను శివరామన్ అనే అనుకుంటుంది. బీదరికంతో బాధపడే శివరామన్ చచ్చిపోయాడని ఆమెకి తెలియదు.

ఇప్పుడు తను బద్రీనాథ్! దేవ్ అండ్ కంపెనీ ఛైర్మన్ బద్రీనాథ్! యాభై ఎకరాలకు పైగా విస్తీర్ణంలో గులాబీలను పెంచి విదేశాలకు ఎగుమతి చేస్తున్న సంస్థకు అధిపతి! ప్రపంచంలోనే నెంబర్ వన్ గులాబీ పూల ఉత్పత్తిదారులైన 'కరుటూరి గ్లోబల్' సంస్థను అధిగమించాలన్న ధ్యేయంతో పనిచేస్తున్న బద్రీనాథ్!

ఆమెకి తను ఏదో గులాబీ తోటలో పని చేస్తున్నాడని తెలుసు. కానీ వీటన్నిటికీ తనే యజమాని అని తెలియదు. అది వివరించాలంటే ముందు శివరామన్ బద్రీనాథ్‌గా మారిన వైనం ఆమెకు వివరించాలి. అప్పుడు ఆమె తనను అసహ్యించుకుంటుందేమో అన్న అనుమానమే ఇన్నాళ్ళూ ఆ విషయం చెప్పలేకపోవటానికి కారణం.

అతను ఆలోచనలలో ఉండగానే కారు ఆ రోడ్డు మార్గం కూడా వదిలి, మట్టి దారిలోకి ప్రవేశించింది.

చుట్టూ సమున్నతంగా కనిపిస్తున్న కొండలు! అక్కడక్కడా వాటి మీద నుండి సన్నగా జాలువారుతున్న నీటి పాయలూ.. ప్రకృతి అందం అంతా పోగు పోసినట్లు ఉన్నాయి పరిసరాలు.

దారికి అడ్డంగా వచ్చిన 'ఇంద్రాయణి' నది మీద కట్టిన ఒక కచ్చా వంతెన దాటి ముందుకు సాగుతోంది కారు.

మరింత ముందుకు పోయాక పరిస రాలు ఒక్కసారిగా మారిపోయాయి. నదికీ, కొండవాలుకీ మధ్య ఉన్న యాభై ఎకరాల స్థలంలో నిర్మించి ఉన్నాయి అనేక పాలీహౌస్‌లు. వాటి మధ్య ఆగిన కారులో నుండి కిందకు దిగాడు అతను.

పూర్తిగా పాలిథిన్ కవర్లతో కవర్ చెయ్యబడిన పొలంలో పెరుగుతున్నాయి గులాబీ పూలు.

అతను కారు దిగటం గమనించి పరుగె త్తుకుంటూ వచ్చాడు మేనేజర్.

చుట్టూ పరిశీలిస్తూ అతనితో పాటు ఒక 'పాలీహౌస్'లోకి అడుగుపెట్టాడు శివరా మన్. నీరు వృథా కాకుండా మొక్కలన్ని టికీ డ్రిప్ పద్ధతిలో నీరు అందుతోంది. మొక్కలకు కావలసిన పోషకాలూ, పురుగు మందులూ ముందే నీటిలో మిక్స్ చెయ్య టంతో.. ఏదీ వృథా కాకుండా సరాసరి మొక్కలకు చేరుతున్నాయి. టెంపరేచర్, హ్యూమిడిటీ అంతా సెంట్రలైజ్డ్ కంప్యూ టర్ వ్యవస్థ ద్వారా కంట్రోల్ చెయ్యబడు తుంది. అతను గమనిస్తుండగానే గాలిలో తేమ తగ్గినందున పైన వేలాడుతున్న గొట్టాల నుండి నీరు పొగలాగా గాలిలోకి విరజిమ్మబడింది. పాలీహౌస్ అంతా పొగ మంచు కమ్ముకున్న వాతావరణం ఏర్ప డింది.

అనేక స్టేజెస్‌లో ఉన్న మొక్కలు వేలు, లక్షలు పెంచబడుతున్నాయి అక్కడ.

అక్కడి నుండి అతను పూలను నిల్వ ఉంచే కోల్డ్‌స్టోరేజ్ వద్దకు నడిచాడు. అప్పుడే కోసిన పూలు ప్యాకేజ్ పూర్తి చేసు కుని అక్కడ విశ్రాంతి తీసుకుంటున్నాయి. అవి కళ్లు తెరిచేటప్పటికి అమెరికా, యూర ప్‌లలోని ఏ ఫ్లోరిస్ట్ దుకాణాల్లో ఉంటాయో? !

"ఫిబ్రవరి వస్తుంది. డిమాండ్‌కి సరి పడా సప్లై చెయ్యగలగాలి. ఒక్క ఆర్డర్ కూడా ఫెయిలవ్వకూడదు.." సూచనలు ఇస్తున్నాడు శివరామన్?

ఫిబ్రవరి వస్తే.. వాలంటైన్స్ డే వస్తుంది. ప్రపంచ వ్యాప్తంగా గులాబీలకు ఆ రోజు విపరీతమైన డిమాండ్ ఉంటుంది. అది పూర్తి చెయ్యటానికి నాలుగు నెలల ముందు నుండే ఇక్కడ సన్నాహాలు మొదలవుతాయి.

అన్ని విషయాలూ సంతృప్తికరంగా అని పించి బయటకు వచ్చాడు శివరామన్.

అక్కడ జరిగే పనులు అన్నీ మనుషులే

## కొత్తగాలి...

**అంతం కాదిది**
**ఆరంభం**
**శీతాకాలంలో**
**పవర్ కట్**

*– ఇంద్రగంటి నరసింహమూర్తి,*
కాకినాడ

చెయ్యవలసి ఉంటుంది. అందుకే అక్కడ పనిచేసేవారి సౌకర్యం కోసం పక్కనే క్వార్టర్స్ కట్టారు.

అక్కడేదో గొడవ జరుగుతోంది.

"ఏమిటది? " అడిగాడు నిరాసక్తంగా! అక్కడ అలాంటి చిన్న చిన్న గొడవలు ఎప్పుడూ ఉండేవే!

"ఎవడో మరొకడి ఇంట్లో దొంగతనం చేశాడంట.. దొంగ వెధవలు, వీరి బుద్ధే అంత.." అంటున్నాడు మేనేజర్.

నవ్వొచ్చింది శివరామన్‌కి. తనకంటే పెద్ద దొంగ ఎవరుంటారు? ఇతగాడు

తన దగ్గర చేతులు కట్టుకుని నిలబడి పది రూపాయల దొంగను తిడుతున్నాడు.

అతనికి హఠాత్తుగా ఆ రోజు హైదరాబాద్‌లో సహదేవ్ ఇంట్లో ఎదురైన దొంగ గుర్తొచ్చాడు.

బాజీరావు రికమండేషన్ ప్రకారం అతను తిరుగులేని దొంగ. అతను సహదేవ్ ఇంట్లోకి ఆ రాత్రి వస్తున్నాడని ముందే తెలుసు. అందుకే అంతకు ముందు సహదేవ్ తనను రమ్మని ఎన్నిసార్లు పిలిచినా.. పొద్దుపోయే వరకూ వెళ్ళలేదు.

ఆ రాత్రి సహదేవ్‌కీ, తనకీ మధ్య తీవ్ర వాగ్యుద్ధం జరిగింది. సహదేవ్ తనను అనేక రకాలుగా నిందించాడు. పోలీసులకు పట్టిస్తానన్నాడు. కానీ పోలీసుల దగ్గరకు వెళ్ళాలంటే అతని భయాలు అతనివి. అందుకే ఏమి చెయ్యాలో అర్థంకాని ఉద్రేకంతో పైకి పరుగెత్తాడు. ముందే అతని సేఫ్‌లో పిస్టల్ చూసి ఉండటంతో.. అతను అది తేవటానికే వెళ్తున్నాడని ఊహించిన తను చాటుగా దాక్కున్నాడు. పిస్టల్ తీసుకుని కిందకు వచ్చిన సహదేవ్ నెత్తిమీద ఫ్లవర్‌వాజ్‌తో మోదటంతో అతను స్పృహ తప్పాడు.

అప్పటికే దొంగ ఇంట్లో ఉన్నాడని తెలుసు. అతను డాబామీదకు వెళ్ళటం చూసి.. తనూ పైకి పరుగెత్తి అతన్ని పిస్టల్‌తో బెదిరించి కిందకు తీసుకువచ్చాడు.

కింద సరాసరి అతన్ని కిచెన్‌లోకి నడిపించాడు. అతనికి అనుమానం వచ్చేలోపే వెనుకనుండి తలలోకి కాల్చాడు. అతను అక్కడే కూలిపోయాడు. తనకు కావలసింది అతను దొంగతనం చేసి తీసుకువచ్చే బాక్సుతో పాటు అతని శవం కూడా! తను చనిపోయినట్లు నమ్మించటానికి అది చాలా అవసరం. వెంటనే గ్యాస్ లీక్ చేసి కిచెన్ నుండి బయటకు వచ్చాడు.

అయితే ఈ ప్రాసెస్ మొత్తంలో జరిగిన అతిపెద్ద పొరపాటు.. దేనికోసమైతే ఆ దొంగను పురమాయించాడో, అది తనకు దొరకనే లేదు. అది దొరకక ముందే దొంగను చంపి తప్పు చేశాడు. తరువాత ఎంత వెతికినా, అతని వద్ద కానీ.. సేఫ్‌లో కానీ ఆ బాక్సు కనపడనేలేదు.

గతం గుర్తుకు వచ్చి నిట్టూర్చి, మాట్లాడకుండా వెళ్ళి కార్లో కూర్చున్నాడు. కారు ఇంకా ముందుకు వెళ్ళింది. కొండ మీదకు కొంచెం దూరం ప్రయాణించి ఎత్తైన ప్రదేశంలో కట్టిన గెస్ట్‌హౌస్ దగ్గర ఆగింది.

అక్కడి నుండి కింద పాలీహౌస్‌లూ, లేబర్ క్వార్టర్లూ చిన్న చిన్న బొమ్మల్లాగా కనిపిస్తున్నాయి.

గెస్ట్‌హౌస్‌లోకి నడవబోతుంటే.. ఫోన్‌లో మెసేజ్ అలర్ట్ వచ్చింది. ఎవరి దగ్గరనుండా అని చూశాడు. విద్య నుండి వచ్చింది. అది చూడగానే ఆనందంతో అతని గుండె ఝల్లుమంది.

వెంటనే మెసేజ్ ఓపెన్ చేశాడు.

"హాయ్ శివా! నేను రేపు వస్తున్నాను. కరెక్ట్ అడ్రస్ చెప్పు.." అని ఉంది అందులో.

విద్య ఫోన్ చెయ్యకుండా మెసేజ్ ఎందుకు ఇచ్చిందో అతనికి అర్థం కాలేదు. వెంటనే ఆమెకి ఫోన్ చేశాడు. స్విచ్ ఆఫ్ అని వచ్చింది. 'ఈ కొండల మధ్య సిగ్నల్స్ సరిగ్గా పనిచేయవు. విద్యకి కూడా తన ఫోన్ దొరికి ఉండదు. అందుకే మెసేజ్ ఇచ్చి ఉంటుంది..' అనుకున్నాడు.

విద్యని అక్కడకు తీసుకువచ్చి నిజాలన్నీ చెప్పాలని ఎప్పటినుండో అనుకుంటున్నాడు. అనుకోకుండా ఇప్పుడు అవకాశం దానంతట అదే వచ్చింది.

అందుకే, అతను అక్కడకు ఎలా చేరుకోవాలో వివరిస్తూ మెసేజ్ ఇచ్చాడు.

విద్య అక్కడకు వస్తుందని అనుకుంటే.. అతని నిరుత్సాహం ఎగిరిపోయి మన

సంతా ఉత్సాహంతో నిండిపోయింది.

అయితే విద్య పరిచయమే మరి కొద్ది సమయంలో తన పతనానికి నాంది కాబోతోందని అతనికి తెలియదు.




**ఉ**య్ గాటిట్..." గావుకేక పెట్టాడు రాజేందర్.

మిగిలిన ఇద్దరూ ఆశ్చర్యంగా అతనికేసి చూశారు.

"అవును. ఇదిగో శివరామన్ అడ్రస్! అతనే మెసేజ్ పంపాడు. మనం విద్య ఫోన్ నుండి పంపిన మెసేజ్ పని చేసింది"

"అయితే ఇంకెందుకు ఆలస్యం... పదండి వెళ్దాం!" అన్నాడు పాండు.

"వద్దు! ఆ పని మనది కాదు."

"మరి? " ఆశ్చర్యంగా అడిగాడు పాండు.

"మనం చెయ్యవలసింది శివరామన్ ఆచూకీ కనుక్కోవటం వరకే! అతనిని అరెస్ట్ చెయ్యటం పోలీసుల బాధ్యత. అతన్ని మనమే పట్టుకోవాలనుకుంటే.. అక్కడ ఎలాంటి పరిస్థితులు ఎదురవుతాయో తెలియదు. అతను అంత తేలిగ్గా లొంగిపోతాడనుకోను. నేరస్తుడిని పట్టుకునే ప్రయత్నంలో మనం దోషులుగా మారకూడదు" అనుభవం జోడించి చెప్పాడు రాజేందర్.

ఆలోచిస్తే నిజమే అనిపించింది పాండుకి కూడా!

"మరి పోలీసులకు ఇన్ఫార్మ్ చేద్దాం! అందులో ఆలోచించేది ఏముంది? "

"ఇక్కడి పోలీసులకు కాదు! మన పోలీసులకు చెప్దాం.. ఇక్కడి పోలీసులు మనకు అంత సహకరించకపోవచ్చు. పైగా నేరం జరిగింది మన రాష్ట్రంలో కాబట్టి.. మన పోలీసులకే చెప్పాలి."

"అయితే చెప్పండి.."

"మనం కాదు. ఆ పని భారతి మేడం గారికి అప్పజెబుదాం. ఆవిడైతే.. సరాసరి డీజీపీని కలిసి పెద్దఎత్తున సహకారం పొందగలరు"

వెంటనే విషయాలన్నీ భారతిగారికి చెప్పారు. ఆమె హుటాహుటిన డీజీపీని కలిసింది. అప్పటి వరకూ తెలిసిన వివరాలన్నీ ఆయనకు చెప్పటంతో ఆయన కూడా ఆశ్చర్యానికి లోనయ్యాడు.

తరువాత ఇది ఎంత పెద్ద సెన్సేషనల్ న్యూస్ కాబోతుందో అర్థమైన ఆయన మరింత వ్యక్తిగత శ్రద్ధ చూపాడు. దానితో మరుసటి రోజు ముగ్గురు పోలీసు ఆఫీసర్లు ముంబయ్ ప్రయాణమయ్యారు. మధ్యాహ్నానికి ముంబయ్ చేరారు.

వారు ముంబయ్‌లో పాండు బృందాన్ని కలిసి వారి దగ్గర ఉన్న శివరామన్ అడ్రస్ తీసుకుని వెంటనే అతనికోసం బయలుదేరారు.

ముందు పోలీసు ఆఫీసర్లు ఉన్న కారు, దాని వెనుక పాండు బృందం ఉన్న కారు శివరామన్ ఇచ్చిన అడ్రస్ వైపు పరుగు తీశాయి. పోలీసు ఆఫీసర్లందరూ మఫ్టీలోనే ఉన్నారు.

ఆ వాహనాలు మరి రెండు గంటల్లో లోనావాలా దాటి హైవే నుండి పక్కకు మరలాయి.

అక్కడి నుండి వారి ప్రయాణం కాస్త మందగించింది. అక్కడక్కడా ఆగుతూ..

దారి కనుక్కుంటూ ముందుకు వెళ్తున్నారు.

అప్పటికే వెలుతురు మందగిస్తోంది. చుట్టూ ఉన్న కొండల వల్ల చీకటి క్షణ క్షణానికీ చిక్కనవుతుంది.

వీరు శివరామన్ ఫార్మ్ చేరుకునేటప్పటికి బాగా చీకటి పడింది. రెండు కార్లూ ఫార్మ్ ముందు ఆగాయి.

అవి ఆగిన శబ్దానికి వాచ్‌మేన్ బయటకు వస్తున్నాడు.

తల పైకెత్తి చూసిన పాండుకి దేవ్ అండ్ కంపెనీ అన్న బోర్డు అందంగా కనిపించింది.

'చేసిన తప్పుకి పశ్చాత్తాపంతో ఏమో.. అసలు యజమాని కంపెనీపేరు సగం అన్నా ఉంచాడు' అనుకున్నాడు పాండు.

"శివరామన్ ఎక్కడ ఉన్నాడు? " ఒక పోలీసు ఆఫీసర్ బయటకు వచ్చిన వాచ్‌మేన్‌ని గద్దిస్తున్నాడు.

వాచ్‌మేన్ అయోమయంగా చూస్తూ-

"ఇక్కడ శివరామన్ ఎవరూలేరు.." అంటున్నాడు.

పాండుకి అప్పుడు వెలిగింది- 'ఇన్ని మార్చినవాడు పేరు మార్చడా? ' అని.

వెంటనే జేబులో నుండి శివరామన్ ఫొటో తీసి వాచ్‌మేన్‌కి చూపించాడు. అతని మొహం ఆ వ్యక్తిని గుర్తుపట్టినట్లు వెలిగింది.

"కానీ.. ఈయన బద్రీనాథ్‌గారు కదా!" అన్నాడు.

"అదే... ఆయన ఎక్కడ? "

దూరంగా ఎత్తుమీద ఉన్న గెస్ట్‌హౌస్ చూపించాడు. పోలీసు ఆఫీసర్లు ముందుకు నడిచారు.

తమను అనుసరించబోయిన పాండు బృందాన్ని వారు మొదట్లోనే అడ్డుకున్నారు.

"సారీ.. మీరు రావటానికి వీలులేదు. ఇక్కడి నుండి మిగిలిన పని మేము చూసుకుంటాం!" ఖండితంగా చెప్పారు.

ఏ మాత్రం సమయం వృథా చెయ్యకుండా పోలీసు ఆఫీసర్లు ముందుకు నడచి చీకట్లో కలసిపోయారు.

★ ★ ★

విద్య కోసం ఎదురు చూసి విసిగిపోయాడు శివరామన్.

ఆమె ఎందుకు వస్తానందో, ఇప్పుడు ఎందుకు రాలేదో, ఫోన్ ఎందుకు స్విచ్ ఆఫ్ చేసి ఉందో అతనికి అర్థం కాలేదు.

పగలంతా ఆమె వస్తుందన్న ఆశతో, ఉత్సాహంతో గడిపినా ఇప్పుడు పూర్తిగా చీకటిపడిన తరువాత.. అన్ని ఆశలూ ఆవిరైపోయాయి.

> **కొత్తగాలి...**
>
> **మనదే కులం**
> **యువకులం**
> **సాధకులం**
> **విశ్వప్రేమికులం**
>
> – ఇంద్రగంటి నరసింహమూర్తి,
> కాకినాడ

అసలే కొండ ప్రాంతం.. పైగా మనుషుల సంచారం తక్కువ ఉండటంతో గాఢమైన నిశ్శబ్దం ఆ ప్రాంతమంతా వ్యాపించి ఉంది. ఆ నిశ్శబ్దంలో కీచురాళ్ళ శబ్దాలూ.. చుట్టూ ఉన్న చెట్ల మీద నుండి పక్షులు చేస్తున్న శబ్దాలూ.. మామూలు కంటే పెద్దగా వినిపిస్తున్నాయి.

కిటికీలో నుండి బయటకు చూస్తూ ఆలోచిస్తున్న అతనికి రెండు కార్లు వచ్చి తన ఫార్మ్ ముందు ఆగటం కనిపించింది.

అందులో నుండి దిగింది ఎవరో ఇంత దూరానికి తెలియటంలేదు. విద్య ఏమన్నా

వచ్చిందేమో అన్న ఆత్రుతతో అతను చూశాడు కానీ.. అక్కడ చాలామంది మనుషులు ఉన్నట్లు అర్థమవుతుంది. అది కూడా అందరూ మగవారే! ఇంతలో వాచ్ మేన్ చేయి పైకెత్తి తన గెస్ట్‌హౌస్ వైపు చూపించటం కనిపించింది. అంటే వాళ్ళు వచ్చింది తన కోసం అన్నమాట.

వాళ్ళు ఎంత మంది ఉన్నారో లెక్కపెట్టాడు శివరామన్. మొత్తం ఆరుగురు ఉన్నారు. అందులో ముగ్గురు అక్కడే ఆగిపోగా.. మరో ముగ్గురు తనున్న బిల్డింగ్ వైపు వస్తున్నారు. పైకి వస్తున్న వారు తమ తమ దుస్తుల్లో నుండి రివాల్వర్లు తీసి రెడీగా పట్టుకుని జాగ్రత్తగా దిక్కులు గమనించుకుంటూ ముందుకు అడుగులు వేస్తున్నారు. మసకచీకట్లో వారి చేతుల్లోని నల్లటి రివాల్వర్లు మరింత నల్లగా మెరుస్తున్నాయి.

అక్కడ వస్తున్నది పోలీసులనీ.. తన గురించి తెలిసిపోయిందనీ శివరామన్‌కి అర్థమైంది.

అయినా అతను లొంగిపోదలచుకోలేదు. జైలులో ఒక్క రోజు గడపటాన్ని కూడా అతను ఊహించలేడు. అందుకే వారి కంటపడకుండా పారిపోవటానికే నిర్ణయించుకున్నాడు.

వస్తున్నవారు ఇలాంటి విషయాల్లో అనుభవజ్ఞుల్లా ఉన్నారు. ఆ ముగ్గురూ విడిపోయి ఇంటిని చుట్టుముట్టటానికి సైగలు చేసుకుని ముందుకు కదులుతున్నారు.

ఇంక ఆలస్యం చేసి లాభం లేదు!

పరుగెత్తుతూ వెనుక డోర్ వద్దకు చేరి శబ్దం కాకుండా దాన్ని కొద్దిగా తెరచి బయటపడ్డాడు శివరామన్.

కొద్ది దూరంలో ఉన్న పెద్దచెట్ల చాటున నిలబడ్డాడు.

అతను అక్కడ నిలబడ్డ కొన్ని క్షణాలకే ఒక వ్యక్తి చుట్టూ గమనిస్తూ.. రివాల్వర్ స్టడీగా పట్టుకుని, అడుగులో అడుగు వేసుకుంటూ అటువైపు వచ్చాడు.

వారికి లేని అడ్వాంటేజ్ అతనికి ఒకటి ఉంది. చాలా రోజులుగా అక్కడ గడుపుతుండటంతో.. ఆ చుట్టుపక్కల ఏమి ఉంటుందో, ఎలా ఉంటుందో అతనికి బాగా తెలుసు.

వెనుక డోర్ దగ్గరకు వచ్చిన వ్యక్తి.. దానిని నెమ్మదిగా తోసి చూశాడు. అది తెరచుకుంది.

రెండు క్షణాలు సంశయించి చివరకు అతను అందులో నుండి లోపలకు నడిచాడు.

ఒకటి.. రెండు.. మూడు, అంటూ ఇరవై అంకెలు లెక్కపెట్టిన తరువాత తను ఉన్న చోటు నుండి బయటకు వచ్చాడు శివరామన్. పరుగు పరుగున వెనుక ద్వారం వద్దకు చేరి దానికి బయట నుండి గడి పెట్టాడు.

చీకట్లను చాటు చేసుకుంటూ నిశ్శబ్దంగా ఇంటి ముందువైపుకు పరుగెత్తాడు.

లోపలకు ప్రవేశించిన వ్యక్తి లోపల నుండి ముందు ద్వారం తెరచినట్లున్నాడు. మిగిలిన ఇద్దరూ అప్పుడే ఇంట్లోకి ప్రవేశిస్తున్నారు.

వెనుక ద్వారానికి గడిపెట్టినట్లుగానే దీన్ని కూడా బయట నుండి బోల్టువేసి లోపలివారిని బంధించాడు.

ఇప్పుడు వారు ఆ ఇంటి నుండి బయటపడటానికి కాస్త సమయం పడుతుంది. ఆ సమయంలో తను తప్పించుకోవాలి.

ఇంకా ముగ్గురు వ్యక్తులు కింద ఉన్నారని అతనికి తెలుసు. అందుకే ఆ మార్గాన కాకుండా ఇంకొక మార్గాన కిందకు దిగటం మొదలుపెట్టాడు.

ఎత్తు మీద ఉండటం అతనికి ఉపయోగపడుతోంది. కింద ఒక వ్యక్తి ఆగివున్న

# ఆత్మీయనేస్తాలకు అందమైన కానుకలు

స్నేహితుల ఆనందమే మన ఆనందం
ఆప్తుల తలపులే మనకు ఆహ్లాదం
ఆత్మీయులకు అరుదైన బహుమానం
ఇవ్వాలనుకుంటున్నారా..?
ప్రతి నిత్యం వారి మదిలో
నిలవాలనుకుంటున్నారా..?



ఇందుకు మీరు చేయాల్సిందల్లా..
మిత్రుల పేరు మీద
రూ. 216/- చందా కట్టండి చాలు
ఇక నెలనెలా వారికి కొనసాగుతుంది

# విపుల చతుర

ఆత్మీయ పలకరింపు
నెలంతా సాహితీపరిమళాల
గుబాళింపు
ఏడాది పొడవునా వారి మదిలో
మీ తలపులే పరిమళిస్తాయి
అక్షరాక్షరాన మీ ఉత్తమాభిరుచి
రూపుకడుతుంది



అది పుట్టిన రోజయినా..
పెళ్లి రోజయినా.. పండుగయినా
నూతన సంవత్సర శుభ
సందర్భమైనా
సరే ఎంచుకోండి
ఒక్కసారి మమ్మల్ని
సంప్రదించండి చాలు..

డీడీ లేదా ఎంఓ పంపవలసిన చిరునామా:
వసుంధర పబ్లికేషన్స్, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.
ఆన్‌లైన్ బుకింగ్‌కు (యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, సైఫాబాద్, హైదరాబాద్ ఆన్‌లైన్ అకౌంట్ నెం. 370605010044015)

వివరాలకు : vipula.chatura@eenadu.net

కారు దగ్గర నిలబడి ఉంటే.. మరి ఇద్దరు ఫార్మ్‌కి సంబంధించిన షెడ్ దగ్గర నిల బడి ఉన్నారు.

విడిగా ఉన్న వ్యక్తిని టాకిల్ చెయ్యటం తేలిక అని భావించి అటువైపు కదిలాడు శివరామన్.

అడుగులో అడుగు వేసుకుంటూ అతను ఉన్న ప్రదేశాన్ని సమీపించాడు. ఆ వ్యక్తి ఇంకొక వైపు తిరిగి కొండపైన ఉన్న గెస్ట్ హౌస్‌ని తదేక దృష్టితో చూస్తున్నాడు.

చుట్టూ చూసిన శివరామన్‌కి కింద ఒక పెద్దరాయి కనిపించింది. అది తీసుకుని వేగంగా కదులుతూ, నిలబడి ఉన్న వ్యక్తి వెనుకకు చేరాడు.

## కొత్తగాలి...

**హంసలా**
**బతకాలంటే**
**హింసను**
**విడనాడాలి**

– *యు. విజయశేఖరరెడ్డి,*
హైదరాబాద్

అప్పుడే అతనికి ఏదో అనుమానం వచ్చి నట్లు ఉంది. వెనుకకు తిరుగుతున్నాడు.

ఇక ఆలస్యం చేస్తే లాభం లేదని చేతిలో ఉన్న రాతితో అతని నెత్తిన బలంగా మోదాడు.

"అమ్మా.." అని అరుస్తూ అతను ఆను కున్న కారుమీదకి వాలిపోయాడు స్పృహ తప్పి.

★ ★ ★

రాజేందర్, పాండు ఫార్మ్ షెడ్ దగ్గర నిలబడి ఉన్నారు.

వారికి జరుగుతున్న పనిలో పాలుపం చుకోకుండా, అలా నిలబడి ఎదురు చూడటం చాలా నిరుత్సాహం కలిగి స్తుంది.

వాచ్‌మేన్‌ని బెదిరించి అతన్ని రూంకి పంపించివేశారు. అతను కూడా వచ్చింది పోలీసులని రూఢీ అవటంతో వారు చెప్పి నట్లు తన గదిలోకి వెళ్ళిపోయాడు.

మీనన్ వీరికి దూరంగా కారు దగ్గర నిలబడి ఉన్నాడు.

హఠాత్తుగా మీనన్ అరచిన ఆరుపు వినిపించింది.

పక్కకు తిరిగి చూసిన వారికి కారు మీదకి వాలిపోయిన మీనన్ కనిపించాడు.

ఇద్దరూ నిర్ఘాంతపోయారు.

మీనన్ మీద దాడి చేసింది ఎవరై ఉంటారు?

శివరామన్‌కి తప్ప ఆ అవసరం ఎవరికి ఉంటుంది? మరి అతను పైనున్న గెస్ట్ హౌస్ నుండి ఇక్కడకు ఎలా వచ్చాడు? పైకి వెళ్ళిన ముగ్గురు ఏమయ్యారు?

వారి ప్రశ్నలకు సమాధానమా అన్నట్లు పైనున్న గెస్ట్‌హౌస్ తలుపులు ఎవరో బాదుతున్న శబ్దం వినిపించింది.

"పైకి వెళ్ళిన వారిని గెస్ట్‌హౌస్‌లో బంధించి వాడు ఇటు వచ్చాడు.." చెప్పాడు రాజేందర్.

పాండు ఏమీ మాట్లాడలేదు. అతను ఏమి చెయ్యాలా అని తీవ్రంగా ఆలోచిస్తు న్నాడు. ఒకసారి శివరామన్ ఇక్కడినుండి తప్పించుకోవటం జరిగిందంటే.. ఇక అతన్ని పట్టుకోవటం అసాధ్యం.

"నేను పైకి వెళ్ళి తలుపు తీసి వస్తాను.." అన్నాడు రాజేందర్.

"మరి మీనన్ సంగతి.."

"మీనన్ మీద దాడి చేసిన వాడు మన లను మాత్రం వదులుతాడా? అక్కడే కాచుకుని ఉండి ఉంటాడు. అందుకే ముందుగా పైకి వెళ్లి మనవారిని బయ టకు తెస్తే.. అందరం కలిసి ఏదన్నా

# విజయానికి కీలక మంత్రం?




హాలీవుడ్ కమెడియన్ అయిన అమెరికా నటుడు జార్జ్‌బర్న్స్ జీవితంలో మొదటిసగంకన్నా తర్వాతి సగంలోనే ఎక్కువ విజయాలు సాధించాడు. వృత్తిమీద శ్రద్ధను చివరిశ్వాస వరకూ కొనసాగించడంతో ఇది సాధ్యమైంది.



'ద సన్ షైన్ బాయ్స్' అనే చిత్రంలో జాక్ బెన్ అనే నటుడిని అనుకున్నారు నిర్మాతలు. కానీ షూటింగ్ మొదలవడానికి కొన్ని వారాల ముందు అతను మరణించడంతో ఆ పాత్రకి జార్జ్ బర్న్స్‌ని అతని ఏజెంట్ నిర్మాతలకి సూచించాడు. అప్పటికే ఎనభైలలో ఉన్న జార్జ్ గత ముప్పైఐదేళ్ళలో ఏ సినిమాలోను నటించలేదు. వృద్ధుడైన ఆయనకు డైలాగ్స్ గుర్తుండకపోవచ్చుని, దాంతో షూటింగ్ సమయం పెరిగి, బడ్జెట్ ఎక్కువ కావచ్చని నిర్మాతలు సందేహించారు. అయితే బర్న్స్ ఏజెంట్ ఇర్వింగ్ నిర్మాతలకు అభయహస్తం ఇచ్చాడు.

షూటింగ్‌కు వారం ముందు నటులందరినీ స్క్రీన్ ప్లే చదవడానికి ఆహ్వానించారు. నటులంతా తమ డైలాగ్ వర్షన్స్‌తో వచ్చారు. కాని బర్న్స్ మాత్రం ఆ పేపర్లను తీసుకురాలేదు. 'మరచి పోయాను' అని చెప్పాడు.

ఆశ్చర్యంగా బర్న్స్ తన సంభాషణలను తక్కినవారిలా కాగితాలు చూడకుండా జ్ఞాపకశక్తినాధారంగా చెప్పాడు. అంతేకాక ఎవరైనా డైలాగ్స్ తప్పు చెబితే అతను సరి చేసాడు. చివరకు ఆ సినిమాలో తన నటనకి బెస్ట్ సపోర్టింగ్ యాక్టర్‌గా అకాడమీ అవార్డునూ పొందారు. ఆ తర్వాత మరోపది సినిమాల్లో నటించారాయన.

చెయ్యవచ్చు."

పాండుకి ఏమి చెప్పాలో అర్థం కాలేదు. సిచుయేషన్ తమ చేతుల్లోనుండి జారిపోతోందని అతనికి అర్థం అయింది.

రాజేందర్ అతని సమాధానం కోసం ఎదురు చూడకుండా గెస్ట్‌హౌస్ వైపు పరుగుపెట్టాడు.

పాండు వెళ్తున్న రాజేందర్‌నే చూస్తూ నిలబడ్డాడు.

రాజేందర్ కొంత దూరం వేగంగా పరుగెత్తి... తరువాత ఎత్తు ఎక్కవలసి రావటంతో నెమ్మదిగా వెళ్తున్నాడు.

హఠాత్తుగా రాజేందర్ వెళ్తున్న మార్గంలో అతని వెనుక ఒక మనిషి ప్రత్యక్షమయ్యాడు. ఇంత హఠాత్తుగా తాము గమనించకుండా అతను అక్కడకు ఎలా చేరుకున్నాడో పాండుకి అర్థం కాలేదు. బహుశా అక్కడ ఉన్న చెట్లు, రాళ్ళు చాటు చేసుకుని అతను అటూ ఇటూ తిరుగుతున్నాడని పాండుకి అర్థం అయింది. రాజేందర్‌ని అప్రమత్తం చేద్దామనుకున్నాడు.

ఇంతలో వెనుక చేరిన మనిషి ఏమి చేశాడో కానీ.. రాజేందర్ బిగ్గరగా అరుస్తూ పల్లంలోకి జారిపోయాడు. పల్టీలు కొట్టుకుంటూ కిందకు జారిన అతని శరీరం ఒకచోట ఆగింది. అతను స్పృహలో లేనట్లుంది. లేచే ప్రయత్నం చెయ్యటంలేదు.

రాజేందర్‌ను కిందకు తోసిన ఆకారం ఈసారి చీకటిలో నక్కే ప్రయత్నం చెయ్యలేదు. సూటిగా పాండు వైపు రాసాగింది.

వేటగాడే వేటాడబడుతున్నట్లు అర్థమైంది పాండుకి.

అనియంత్రితంగా అతని అడుగులు వెనుకకు పడుతున్నాయి.

వెనుక షెడ్ తాలూకు తలుపు అడ్డం వచ్చింది.

తడిమి చూసిన అతనికి దాని గడి తగిలింది. దానికి తాళం వేసిలేదు. గడితీసి తలుపు తెరిచాడు. కిర్రుమని శబ్దం చేస్తూ తలుపు తెరుచుకుంది.

కొద్దిగా తెరుచుకున్న తలుపులో నుండి పాండు లోపలకు దూరాడు.

లోపల చిమ్మచీకటిగా ఉంది.

చీకటిలో ఆగంతుకుడితో తలపడటం కంటే వెలుతురు ఉంటేనే నయం. లోపల ఏది ఎక్కడ ఉంటుందో తెలిసిన ఆగంతుకుడికి చీకటిలోనే అడ్వాంటేజ్. కానీ.. తనకు అలా కాదు.

అందుకే అతను లైటు స్విచ్ కోసం గోడ మీద తడుముతూ పక్కకు కదలసాగాడు.

పది క్షణాలు గడిచేటప్పటికి అతని కళ్ళు చీకటికి అలవాటు పడ్డాయి. షెడ్డంతా డ్రిప్ ఇరిగేషన్‌కీ, మాయిశ్చర్ మెయింట్‌నెన్స్‌కీ సంబంధించిన పంపింగ్ మెషీన్లతో నిండిపోయి ఉంది. ఇంకోమూల వరుసగా గోతాలు గోడకి ఆనించి ఉన్నాయి. వాటి వాసన బట్టి అవి ఎరువులని తెలుస్తోంది.

గోడమీద స్విచ్‌బోర్డ్ లీలగా కనిపించింది.

పరుగెత్తుతూ దాని దగ్గరకు వెళ్ళి అక్కడ ఉన్న స్విచ్‌లన్నీ వరుసగా నొక్కాడు. షెడ్డంతా ప్రకాశవంతంగా లైట్లు వెలిగాయి.

అయితే అది ఒక్క క్షణం మాత్రమే!

అంతలో ఎలా జరిగిందో, కానీ.. షార్ట్ సర్క్యూట్ అయినట్లు రవ్వలు చిమ్ముతూ మొత్తం లైట్లన్నీ ఆరిపోయాయి.

లైట్లు ఆరిపోబోయే ఆఖరి క్షణంలో.. అతనికి షెడ్లో మరొక మూల 'కోల్డ్‌స్టోరేజ్' అన్న అక్షరాలు కనిపించాయి.

నెమ్మదిగా అడుగులో అడుగు వేస్తూ అటు నడిచాడు పాండు.

కోల్డ్‌స్టోరేజ్ వరకూ నడిచిన అతను చేతులతో తడుముతూ.. దాని తలుపుకు ఉన్న హ్యాండిల్ పట్టుకుని గట్టిగా తిప్పాడు. తలుపు తెరుచుకుంది. తెరుచుకోగానే లోపల ఎమర్జన్సీ లైటు వెలిగింది. దాని వెలుతురు ప్రసరించ సాగింది.

ఇంతలో షెడ్ తలుపు తెరచుకుని వెంటాడుతున్న వ్యక్తి లోపలకు రావటం కనిపించింది.

అంత మసక వెలుతురులోనూ అతను శివరామన్ అని గుర్తించటానికి ఎక్కువ సమయం పట్టలేదు పాండుకి.

★ ★ ★

రాజేందర్ అడ్డు తొలగించిన శివరామన్‌కి మిగిలిన ఆఖరు వ్యక్తి ఎదురుగా కనిపిస్తున్నాడు.

గెస్ట్‌హౌస్ లోపలి వ్యక్తులు సహాయం కోసం తలుపులు తట్టటం ఆపి వాటిని పగులగొట్టే ప్రయత్నాలు చేస్తున్నట్లు శబ్దాల తీవ్రత పెరిగింది.

లేబర్ క్వార్టర్స్‌లో కదలికలు కనిపిస్తున్నాయి. మరి వాచ్‌మేన్ వారికి ఏమి చెప్పాడో కానీ ఎవరూ లైట్లు వెయ్యలేదు. బయటకు రాలేదు.

శివరామన్ చూస్తుండగానే మూడో మనిషి షెడ్లోకి వెళ్ళటం కనిపించింది. అతనికి ఆ వ్యక్తికోసం సమయం వృథా చేసుకోవటం అనవసరమనిపించింది.

పరుగెత్తుకుంటూ కార్లు ఆగిన ప్రదేశానికి వెళ్ళాడు. తన కారు తాళాలు పైన గెస్ట్‌హౌస్‌లో ఉన్నాయి. కొత్తగా వచ్చిన రెండు కార్లూ అక్కడే ఉన్నాయి. వాటిలో కూడా తాళాలు లేవు.

కిందపడివున్న మీనన్ దగ్గరకు వెళ్ళి

అతని జేబులు వెతికాడు. అక్కడ ఏమీ దొరకలేదు. తరువాత పల్లంలోకి జారిపోయిన రాజేందర్ జేబులు చూశాడు. అక్కడ కూడా లేవు.

ఇక మిగిలింది మూడవ వ్యక్తి. ప్రస్తుతం అతను షెడ్‌లో ఉన్నాడు. అతని దగ్గర కారు తాళాలు తప్పక ఉండి ఉంటాయి. అందుకే తను కూడా అటు నడిచాడు.

షెడ్ లోపలకు అడుగుపెట్టబోతున్న ఆఖరి క్షణంలో కళ్ళు మిరుమిట్లుగొల్పుతున్న వెలుతురు వచ్చి షార్ట్ సర్క్యూట్ అయ్యి మొత్తం లైట్లన్నీ ఆరిపోయాయి.

> **కొత్తగాలి...**
>
> **జెయిల్ నుంచి**
> **బెయిల్ మీద**
> **విడుదలయితేనే**
> **స్వాగత సత్కార సన్మానాలు**
>
> – *బోడపాటి కృష్ణవేణి,*
> చెన్నై

ఆ చీకటిలోనే లోపలకు అడుగుపెట్టాడు శివరామన్.

దూరంగా కోల్డ్‌స్టోరేజ్ తలుపు తెరచి వుంది. దానిలో నుండి ఎమర్జన్సీ లైటు వెలుతురు బయటకు ప్రసరిస్తుంది. అప్పుడే ఎవరో తెరచినట్లు తలుపు ఇంకా ఊగుతోంది.

వేగంగా కోల్డ్‌స్టోరేజ్‌వైపు కదిలాడు శివరామన్. తను వెతుకుతున్న వ్యక్తి కనుక లోపల ఉన్నట్లయితే.. కారు తాళాలు సంపాదించటం ఇంకా తేలిక.

తలుపు దగ్గరకు చేరుకున్న అతను లోపలకు వెళ్ళకుండా ద్వారం దగ్గరే నిలబడి లోపలకు తొంగి చూశాడు.

లోపల ఎవరూ ఉన్నట్లు కనిపించలేదు.

ఇంతలో అతని వెనుక శబ్దం అయింది.

ఉలిక్కిపడి వెనుతిరగబోయాడు.

అయితే! అప్పటికే ఆలస్యం అయింది. ఎవరో బలమంతా ఉపయోగించి వీపు మీద తన్నారు. ఆ దెబ్బకి తూలుకుంటూ లోపలకు వెళ్ళి పడ్డాడు. అతను తేరుకునే లోపు తలుపు మూసుకుపోయింది.

శివరామన్ అచేతనంగా ఉండిపోయాడు.

చివరకు తన అంతం ఇక్కడ జరగబోతుందన్నమాట.

బయటివారు కాపాడితే తప్ప తనంతట తను అక్కడినుండి బయటపడే మార్గం లేదని అతనికి తెలుసు.

ఆలోచనలలోనే అతనికి వణుకు మొదలైంది. నిలబడి చుట్టూ చూశాడు.

లక్షలాది గులాబీలు తనవైపు జాలిగా చూస్తున్నట్లున్నాయి.

ఎంతసేపు బతుకుతాడు తను? గంటా.. రెండు గంటలా?

ఎలా వస్తుంది మరణం?

మరణించేటప్పుడు తనకు స్పృహ ఉంటుందా?

ముందే ఈ చలికి కోమాలోకి వెళ్ళిపోతాడా?

దవడలు అతని కంట్రోలు తప్పి టకటకా కొట్టుకుంటున్నాయి.

శక్తిలేనట్టు కాళ్ళు జారిపోతున్నాయి.

నెమ్మదిగా నేల మీదకు వాలిపోయాడు అతను.

★ ★ ★

"ఇదే ఆ కోల్డ్‌స్టోరేజ్.." తలుపు తెరిచి చూపిస్తూ అన్నాడు పాండు.

"నోట్లో వేలుపెడితే కొరకలేనట్లు ఉండే నువ్వు.. ఒక మనిషిని అంత దారుణంగా.." లోపలకు అడుగుపెడ్తూ అన్నాడు సహదేవ్!

"అతను ఎవరో ఒక సాధారణ వ్యక్తి కాదు. అన్యాయంగా మా నాన్నను చంపినవాడు. డబ్బు కోసం ఆ నేరం మీ మీద వేసినవాడు. మనిద్దరినీ అనవసరంగా జైలులో గడిపేటట్లు చేసినవాడు.."

"మైగాడ్.. ఇక్కడ రెండు నిమిషాలు నిలబడాలంటేనే ఇంత అసౌకర్యంగా ఉంది. రెండు గంటలు ఈ గదిలో గడపటం ఎంత నరకయాతనో.." బయటకు నడుస్తూ అన్నాడు సహదేవ్.

ఇద్దరూ బయటకు వచ్చారు.

"అతనిని నువ్వు కోల్డ్‌స్టోరేజ్‌లో బంధిస్తే.. గెస్ట్‌హౌస్‌లో ఉన్న పోలీసులు వచ్చి బయటకు తియ్యలేదా?" అడిగాడు సహదేవ్.

నవ్వాడు పాండు.

"నేనే పైకి వెళ్ళి గెస్ట్‌హౌస్ తలుపులు తెరిచాను. అందులో ఉన్న ముగ్గురు పోలీసు ఆఫీసర్లూ బయటకు వచ్చి 'శివరామన్ ఎక్కడ?' అని అడిగారు. పారిపోయాడని చెప్పాను. నేను చూపిన దిక్కువైపు పరుగెత్తారు. మరో రెండు గంటల తరువాత మొహం వేలాడదీసుకుని వచ్చారు"

"తరువాత ఏమైంది?.." అడిగాడు సహదేవ్. జరిగిన ప్రతి విషయం అతనికి ఇంతకు ముందే తెలుసు. ఇప్పుడు ప్రత్యక్షంగా ఘటనా స్థలంలో నిలబడి ఆ రోజు జరిగిన విషయాలు మనోఫలకం మీద ఊహించుకుంటూ ఉన్నాడు.

"రెండు గంటల పాటు శివరామన్ లోపల ఏమి బాధపడ్డాడో, కానీ బయట నేను అంతకంటే ఎక్కువ బాధ అనుభవించాను. ఒక మనిషి చనిపోతుంటే.. ఏమీ చెయ్యకుండా చూస్తూ కూర్చోవటం నావల్ల కాదని అర్థమైంది. కోల్డ్ స్టోరేజ్ తలుపులు తీసి వాడిని బయటకు లాక్కువచ్చాను. అయితే అతను అప్పటికే కోమాలోకి జారిపోయాడు. ఇంతలో శివరామన్‌ని వెతకటానికి వెళ్ళిన పోలీసులు వెనుతిరిగి వచ్చారు. వారి సాయంతో ముగ్గుర్నీ దగ్గరలో ఉన్న హాస్పిటల్‌కు తరలించాం.." చెప్పాడు పాండు.

"ముగ్గురా?.." అని, "ఓ.. మన డిటెక్టివ్ వీరులా?" నవ్వుతూ అన్నాడు సహదేవ్.

"వారి తప్పేం లేదు. ఆ రోజు ఆ వాతావరణంలో.. ఆ పరిస్థితుల్లో శివరామన్ ముందు అందరూ తలవంచవలసి వచ్చింది. ఏదో అదృష్టం కలిసివచ్చి నా చేతికి చిక్కాడు, కానీ అసలు దొరికి ఉండవలసింది కాదు"

"నాకు శివరామన్‌ని కలవాలని ఉంది"

"వద్దు.. ప్రస్తుతం అతను ఎవరినీ కలవటానికి ఇష్టపడటం లేదు. పశ్చాత్తాపంతో ఉన్నాడు. కొన్నాళ్ళు పోనీయండి.. అప్పుడు చూద్దాం!"

"నీకెలా తెలుసు?"

"నేను అతన్ని చూడటానికి వెళ్లాను.."

"నాకు తెలుసు! నువ్వు శత్రువు బాధను కూడా చూడలేవు.."

"అదేమీ కాదు.." మొహమాటంగా అన్నాడు పాండు.

"ఒకరకంగా చెప్పాలంటే జాలి కంటే కుతూహలంతో వెళ్ళాను అతన్ని చూడటానికి. చూసిన తరువాత జాలి కలిగిన మాట వాస్తవం!"

కాసేపు ఆగి మరలా అన్నాడు, "విశేషం ఏంటంటే.. అతను ఒకప్పుడు మనం ఉన్న సెల్‌లోనే ఉన్నాడు"

"అతను ఏ సెల్‌లో ఉన్నాడన్నది ముఖ్యంకాదు. అతనితో పాటు ఎవరు ఉన్నారన్నది ముఖ్యం! అదే కదా మన జీవితాల్ని మార్చి వేసింది.."

ఇద్దరూ నవ్వుకుంటూ ముందుకు సాగిపోయారు.

Ⓒ

# హాహా.. అమెరికా 10

# వ్యక్తిస్వేచ్ఛ మేడిపండేనా?

**న్యూయార్క్‌లోని ట్విన్‌టవర్స్ మీద సెప్టెంబర్ 11, 2001 న ఉగ్రవాదుల దాడి జరిగాక అమెరికా స్వీయరక్షణకి చేపట్టిన అనేక చర్యల్లో ఒకటి అధ్యక్షుడు జూనియర్ బుష్ పేట్రియాట్ చట్టాన్ని తీసుకురావడం. దేశంలోని ఉగ్రవాదాన్ని తుదముట్టించేందుకు ఉద్దేశించిన ఈ బిల్లు విదేశీయులకేగాక, ఆ దేశంలో నివసించే వారికి కూడా ముప్పు తెచ్చేదిగా మారింది. ఒకవైపు వ్యక్తిస్వేచ్ఛకు అగ్రపీఠం వేస్తామని జబ్బలు చరచుకునే దేశంలోనే ఉగ్రవాదం బూచిని చూపి భద్రత పేరుతో వ్యక్తిగత జీవితాల్లోకి ప్రభుత్వం చొరబడుతున్న వైనమిదీ..**

పేట్రియాట్ బిల్లును అక్టోబర్ 23, 2001లో యు.ఎస్. హౌస్ ఆఫ్ రిప్రజెంటేటివ్స్ 357 మంది సమర్థిస్తే, 66 మంది వ్యతిరేకించారు. అలాగే మూడురోజుల తర్వాత యు.ఎస్. సెనేటర్స్‌లో ఒక్కరు వ్యతిరేకిస్తే 98 మంది సమర్థించారు. దాంతో ఇది చట్టమైంది. దీన్ని వ్యతిరేకించిన ఏకైక సెనేటర్ రస్సెల్ ఫెయిన్ గోల్డ్. ఆయన ఓ ఉత్తరంలో తను పేట్రియాట్ ఏక్ట్‌ని ఎందుకు వ్యతిరేకిస్తున్నాడో ఇలా వివరించాడు.

దీనివల్ల ప్రభుత్వానికి అంతులేని అధికారం వస్తుంది. ప్రజలను నిర్బంధంలోకి తీసుకోవడానికి, వారిపై గూఢచర్యానికి అధికారాన్నిచ్చే ఈ బిల్ ప్రజలకు కీడు చేస్తుంది. అమెరికాలోని ముస్లింలను ఇది టార్గెట్ చేస్తోంది. చాలా విషయాల్లో హద్దుమీరి ప్రవర్తించడానికి అవకాశం ఇస్తుంది. భద్రతని, వ్యక్తిగత స్వేచ్ఛని త్రాసులో రెండు వైపులా వేస్తే భద్రతవైపే త్రాసు ముల్లు మొగ్గింది. దాంతో పేట్రియాట్ ఏక్ట్ ద్వారా వ్యక్తిగత స్వేచ్ఛ హరించబడింది. భద్రత అవసరమే అయినా కోట్లాది అమెరికన్ పౌరుల సామాజిక హక్కులకు విఘాతం కలిగించేలా ఈ చట్టాన్ని రూపొందించారు.

అమెరికాలో నివసించే అమెరికన్ పౌరులు కానివారికి ఉగ్రవాదులతో సంబంధం ఉందన్న అనుమానం ఉంటే చాలు, వారి ఫోన్‌లను టాప్ చేసి సంభాషణలను రికార్డ్ చేయవచ్చు. వారి ఉద్యోగ లేదా వ్యాపార ప్రదేశాలను వెదికి దస్త్రాలని స్వాధీనం చేసుకోవచ్చు. అంతకు మించి వారిని రహస్యంగా అనుసరించవచ్చు. ఈ పనులను వరుసగా నాలుగేళ్ల పాటు చేయవచ్చని ఆ చట్టం ప్రభుత్వానికి అధికారాన్ని ఇస్తోంది.

ఏ కారణంగానైనా అమెరికాలో నివసించే విదేశీయులు ముస్లిం దేశాలకి వెళ్లివస్తే, వారిని అనుమానితులుగా భావిస్తారు. ఫోన్ టాపింగ్ ద్వారా వారి వ్యక్తిగత సంభాషణలను మొత్తం అమెరికన్ భద్రతా అధికారులు వింటారు. వారిని రహస్యంగా అనుసరించి, వారి చర్యలను గమనిస్తారు. వారినేగాక, వారికి సంబంధించిన కుటుంబ సభ్యులను, బంధుమిత్రులను ఈ చట్టం కింద పరిశీలించే అవకాశం ఉంది. ఇందుకు గతంలోలాగా కోర్టుకి తగిన కారణాలను చూపించి అనుమతి పొందాల్సిన అవసరం లేదు.

ఇంటర్నెట్‌లో ఎవరైనా కొన్ని కీ పదాలను, ఉదాహరణకు బాంబ్స్‌లో ఉపయోగించే రసాయనిక పదార్థాల గురించి సెర్చ్ చేస్తే, భద్రతా సంస్థ

దాన్ని పసిగట్టి ఆ సెర్చ్ చేసింది ఎవరా అని ఆరా తీస్తుంది. ఏ సుబ్బారావో లేదా రాజూపిళ్ళైనో షికాగో లేదా సియాటెల్ నుంచి ఆ పదాలని సెర్చ్ చేసారని తెలిస్తే చాలు.. అతన్ని ఉగ్రవాదిగా లేదా ఉగ్రవాదులతో సంబంధంగల వ్యక్తిగా భావించి పైచర్యల్ని ఈచట్టం కింద చేపట్టవచ్చు. తరచూ విదేశ ప్రయాణాలు చేసేవారు, ముస్లిం మిత్రులు గలవారు, విదేశీయులతో ఛాటింగ్ చేసేవారు.. ఇలా ఎందరినో భద్రతాధికారులు ఇప్పటికే ఈ చట్టం కింద టార్గెట్ చేసారు.




పేట్రియాట్ ఏక్ట్‌గా పిలవబడే దీని అసలు పేరు యునైటింగ్ అండ్ స్ట్రెంథెనింగ్ అమెరికా బై ప్రొవైడింగ్ అప్రోప్రియేట్ టూల్స్ రిక్వైర్డ్ టు ఇంటర్‌సెప్ట్ అండ్ అబ్‌స్ట్రక్ట్ టెర్రరిజం ఏక్ట్. ఇంతదాకా ఈ చట్టం ద్వారా వేలాదిమంది వ్యక్తిగత స్వేచ్ఛని భద్రతా దళాలు హరించారు. 2010లో ఓ సంఘటన జరిగింది. ఈ చట్టం కింద ఇంత హంగామా చేసే అమెరికన్ ఇంటలిజెన్స్ సర్వీస్ అయిన సీఐఏ న్యూయార్క్‌లోని ఫిఫ్త్ అవెన్యూలో కారుబాంబును కనిపెట్టలేకపోయింది. దాంట్లోంచి పొగలు రావటం చూసిన పాదచారులు పోలీసులకు ఫిర్యాదు చేయడంతో అది బయటపడింది.

సెప్టెంబర్ 2001లో తమ మీద బిన్‌లాడెన్ ఉగ్రవాద దాడి జరిపాక, దాన్ని ఆసరాగా తీసుకుని చేసిన ఈ చట్టం అమెరికన్, నాన్ అమెరికన్ పౌరులకు పెద్ద విఘాతంగా మారింది. అమెరికాలోనివారు రూపొందించిన ప్రొఫైల్‌లోకి వచ్చేవారిలోని కొంతశాతం మందిని ఈ చట్టం కింద రొటీన్‌గా పరిశీలిస్తూ, వారి వ్యక్తిగత స్వేచ్ఛని హరిస్తున్నారు. అమెరికాలో చదివే విద్యార్థులు, ఉద్యోగులు లేదా వ్యాపారుల్లో ఎవరి మీదైనా ఇప్పటికే అమెరికా భద్రతా దళాల గూఢచర్యం మొదలైనా, తమ మీద అలాంటి నిఘా ఉంటుందని వారికి అసలు తెలియదు! భార్య ఇండియాకి వచ్చినపుడు అమెరికాలోని భర్తతో ఫోనులో మాట్లాడినదంతా రికార్డ్ అయిందని, దాన్ని పరాయి వారు వింటున్నారని ఆయా వ్యక్తులకు తెలియదు. ఎఫ్‌బిఐలో ప్రపంచంలోని అన్ని భాషలను నేర్చుకుని, చదివే, రాసే, మాట్లాడే దళం ఇందుకోసం పనిచేస్తోంది.

మే 26, 2011న బరాక్ ఒబామా పేట్రియాటిక్ ఏక్ట్‌లోని మూడు ప్రధాన అధికారాలైన వైర్‌టాప్స్, దస్త్రాల స్వాధీనం, రహస్యంగా అనుసరించడాలను మరో నాలుగేళ్ళపాటు కొనసాగించేందుకు సంతకం చేసాడు. ఈ చట్టం కింద అరెస్ట్ చేసిన వారిని ఎంత కాలమైనా నిర్బంధంలో ఉంచవచ్చు. వారి ఇ-మెయిల్స్‌ని, ఇళ్ళని, ఆఫీసులని, ఆర్థిక దస్త్రాలని ఆ వ్యక్తుల అనుమతి లేకుండానే, కోర్టు ఆర్డర్స్ లేకుండానే రహస్యంగా ఎఫ్‌బిఐ వెదకడం అమెరికాలో కొనసాగుతూనే ఉంది. ఈ చట్టానికి వ్యతిరేకంగా కోర్టుల్లో పలువురు దాఖలు చేసిన వ్యాజ్యాల్లో 'ఈ చట్టం అమెరికా రాజ్యాంగానికి విరుద్ధం' అని కోర్టులు తీర్పు లు చెప్పాయి. నిజానికి డిసెంబర్ 31, 2005కు ఈ చట్టం కాలపరిమితి ముగిసింది. కాని దీన్ని మళ్ళీ అమెరికన్ సెనేటర్స్ సభ పొడిగించింది. 'అమెరికన్ సివిల్ లిబర్టీస్ యూనియన్' సైట్‌లోకి వెళ్తే 'వి ఆర్ సారీ! ఈ పేజీలోకి మీకు ప్రవేశం లేదు' అని కనిపిస్తుంది.

అమెరికా వెళ్ళే విదేశీయులు తమ పాస్‌పోర్ట్ జిరాక్సు ప్రతులను ఎల్లప్పుడూ దగ్గరుంచుకోవాలి. బయట ఏ పోలీసైనా ఐడెంటిఫికేషన్ కాగితాలు అడిగితే వాటిని చూపించగలగాలి. లేకపోతే టెర్రరిస్టుగా అనుమానించి ఎంత కాలమైనా అతను తనవారిని కాంటాక్ట్ చేయకుండా నిర్బంధంలో పెట్టవచ్చు. ఐడీలు తమ దగ్గర లేకుండా తిరిగేది ఉగ్రవాదులేనని పోలీసుల విశ్వాసం. ఎందుకంటే తమ సహచరులను నిర్బంధించవచ్చని ఉగ్రవాదులు తమ ఐడీని దగ్గర పెట్టుకోరట! దీంతో అమెరికాలో వ్యక్తిగత స్వేచ్ఛకు ఎలాంటి ముప్పు వాటిల్లిందో అర్థమవుతుంది.

– డి. పద్మజ

# ఆధునిక నాటకబ్రహ్మ

గిరీశ్ కార్నాడ్

**పాశ్చాత్య మూలాలున్న ఇతివృత్తాల వైపు రంగస్థల రచయితల ఆలోచనలు పరుగులు తీస్తున్న తరుణంలో భారతీయ వైభవానికి పట్టంకట్టారాయన. మన పురాణాలు, చరిత్ర, జానపద రూపాల నుంచి పాత్రలను, సన్నివేశాలను స్వీకరించి ఆధునిక పరిస్థితులకు అన్వయించారు. అద్భుత నాటకాలుగా మలచి కన్నడ కస్తూరి పరిమళాన్ని దిగంతాలకు వ్యాపింపజేశారు. నటుడిగా, నాటకకర్తగా, దర్శకుడిగా, సినీ కథా రచయితగా ఆయన స్థానం సమున్నతం. ఆ బహుముఖ ప్రజ్ఞాశాలే గిరీశ్ కార్నాడ్. 1978-97 మధ్య చేసిన సాహితీ సేవకు గుర్తింపుగా ఆయనకు 1998లో జ్ఞానపీఠ పురస్కారం లభించింది.**



గిరీశ్ కార్నాడ్ మహారాష్ట్రలోని మథెరాన్‌లో 1938 మే 19న జన్మించారు. తండ్రి ఆధునిక భావాలున్న ప్రముఖ వైద్యుడు. ఒక కుమారుడున్న వితంతువును 1931లో పెళ్ళిచేసుకుని తన సంస్కరణాభిలాషను కార్యరూపంలో చూపిన ఆదర్శమూర్తి. కార్నాడ్ బాల్యం శిరసీలో గడిచింది. మాతృభాష కొంకణి అయినా ప్రాథమిక విద్య మరాఠీలో సాగింది. చిన్నప్పటి నుంచి యక్షగానాలు, నాటకాలంటే కార్నాడ్‌కు విశేషాభిమానం. ప్రదర్శనలు విపరీతంగా చూసేవారు. నాటకాల్లో చిన్న చిన్న ఆడ వేషాలూ వేసేవారు. తర్వాత చదువు కన్నడంలోకి మారింది. తొమ్మిదో తరగతి నుంచి డిగ్రీ వరకు ధార్వాడ్‌లో చదివారు. కర్నాటక విశ్వవిద్యాలయం నుంచి బి.ఏ. చేశారు. రోడ్స్ స్కాలర్‌షిప్‌పై ఇంగ్లండులోని లింకన్ అండ్ మగ్దవెన్ కళాశాల(ఆక్స్‌ఫర్డ్)లో చదివి ఎం.ఎ. పట్టా పొందారు. చికాగో విశ్వవిద్యాలయంలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా, ఫుల్‌బ్రైట్ స్కాలర్‌గా పనిచేశారు. చెన్నై వచ్చి 1963 నుంచి ఏడేళ్ల పాటు ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్‌లో ఉన్నతోద్యోగిగా వున్నారు. ఫిలిం-టీవీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియా సంచాలకుడుగా, విద్య-సంస్కృతిపై ఇండో-అమెరికా సబ్‌కమిషన్‌కు చెందిన ప్రసార మాధ్యమ వ్యవహారాల సంయుక్త సంఘానికి సహాధ్యక్షుడుగా, కర్నాటక నాటక అకాడమీ అధ్యక్షుడుగా; కేంద్ర సంగీత నాటక అకాడమీ అధ్యక్షుడుగా అమూల్య సేవలు అందించారు.

నాటక కళపై బాల్యం నుంచి పెంచుకున్న అభిరుచి కార్నాడ్‌ను అసమాన నాటకకర్తగా తీర్చిదిద్దింది. ఆయన రచనకు ఉపక్రమించే ముందు అంతవరకూ అభివృద్ధి చెందిన నాటక కళను, రససిద్ధాంతాన్ని, నాట్య శాస్త్రాన్ని లోతుగా అధ్యయనం చేశారు. అందుకే కావ్యాత్మ, రూపకాత్మ

సమస్కంధంగా ఆయన రచనల్లో నిలుస్తాయి.

ప్రతి నాటకంలో అనేక విషయాల విలక్షణ చిత్రణ చోటు చేసుకుంటుంది. ఆయన నాటకాలు దేశ విదేశాలలో ప్రదర్శితమవడానికి ఇదే ముఖ్య కారణం. 1961లో వెలువడిన కార్నాడ్ తొలి నాటకం 'యయాతి' నాటకరంగంలోనూ, సాహిత్య రంగంలోనూ సంచలనం సృష్టించింది. మహాభారతం ఆదిపర్వం నుంచి ఎంచుకున్న కథ ఇది. యయాతి వల్ల శర్మిష్ఠకు కలిగిన కుమారుడు పూరువు నాటకంలో ముఖ్యపాత్ర. జీవితం, ప్రేమ, స్వార్థం, మోసం నిండిన ఆధునిక మానవ ప్రవృత్తులను చిత్రించిన తీరు అనితరసాధ్యం. ఇందులో ఆధునిక మానవుణ్ని కార్నాడ్ పెక్కుకోణాల నుంచి శోధించారు. చారిత్రక పాత్ర 'తుగ్లక్' ఆధారంగా అదే పేరుతో రాసిన నాటకం 1964లో ప్రచురితమైంది. ఆధునిక మానవుడు ఎదుర్కొనే సంక్లిష్టతకిది ప్రతీక. నెహ్రూనాతరం స్వప్నం ఇందులో కనిపిస్తుంది. తుగ్లక్‌లోని స్వప్నదర్శి, పాలనాదక్షుడు- ఈ రెండు పార్శ్వాలను చూపుతూ ఆదర్శాల మరీచిక వెంటపడి చివరకు వింత నియంతగా మారిన తుగ్లక్‌ను రచయిత చూపిన వైనం విస్మయం కలిగిస్తుంది. కార్నాడ్ నాటకాల్లో మనోవిశ్లేషణ, సిద్ధాంత ప్రతిపాదన ప్రత్యేకతలుగా నిలుస్తాయి. 'హయవదన' ఇందుకు మంచి ఉదాహరణ. హృదయం, మనస్సు- వీటి మధ్య మనిషి నలిగిపోతుంటాడు. ఈ రెండూ భిన్న ధ్రువాలు. పూర్ణత్వం కోసం సాగించే నిత్యాన్వేషణలో వీటి వైమనస్యం అడ్డుతగులుతుంది. చివరకు మనిషి తన అస్తిత్వాన్ని సైతం పోగొట్టుకుంటాడని ఈ నాటిక తర్కబద్ధంగా నిరూపిస్తుంది. ఇతివృత్తంలోనే కాక, రచనా సంవిధానంలోను, జిజ్ఞాస రేకెత్తించడంలోనూ కార్నాడ్ తనకు తానే సాటి. వర్తమానాన్ని భూతకాల కోణం నుంచి ఆయన దర్శిస్తారు. మానవునిలో నిబిడీకృతమైన స్పర్ధను, అతని పోరాటపటిమను పటిష్ఠంగా నాటకీకరిస్తారు. 'నాగమండల' నాటకంలో వాస్తవికతను, అవాస్తవికతను జోడించిన విధానం ఆయన భావుకతకు నిలువుటద్దం. మందిర్-మసీద్ వివాదం తారస్థాయికి చేరుకున్న సమయంలో 1989లో వచ్చిన నాటకం 'తలెదండ'. పన్నెండో శతాబ్ది పరిస్థితుల్ని కార్నాడ్ ఈ నాటకానికి ఆధారంగా చేసుకుంటూ నేటి స్థితికి వాటిని ప్రతిభావంతంగా అన్వయించారు. కుళ్లిపోయిన కుల వ్యవస్థను దుయ్యబట్టారు. బ్రాహ్మణ యువకుడు దళిత యువతిని వివాహమాడతాడు. దానికి నిరసనగా రక్తపాతం జరుగుతుంది. దక్షిణాపథంలోని ఆనాటి చరిత్రను వర్తమానానికి వర్తింపజేసిన ఈ నాటకం విశేష ప్రశంసలందుకుంది. 'అంజుమలిగె', 'అగ్ని మత్తు మళె', యశోధర చరిత్రె కావ్యాధారంగా రాసిన నాటకం 'హిట్టిన హుంజ', 'టిప్పుసుల్తాన్ కనసుగళు' కార్నాడ్ రచనా ప్రతిభను నిరూపించే మరికొన్ని నాటకాలు. పరమ శివ భక్తుడైన పూజారికి, ఒక గణికకు మధ్య ప్రేమ చూపేది 'హువ్వు'. ఒక పురాణగాథ దీనికి మూలం. ప్రేమ, భక్తి, అద్వైతాలని చెబుతుంది. 'బింబం' ఏకపాత్ర కౌళిక. మంజుల అనే రచయిత్రి తన బింబంతో సంభాషించడం ఇందులోని సన్నివేశం. గర్భవతి సీతను పరిత్యజించే ఘట్టం మాతృకగా రాసిన ఏకాంకిక 'మానిషాద'లో చాకలివాని దృక్కోణం ప్రధానం. ఇది రేడియో కోసం రాసింది. 'వంశవృక్ష', 'సంస్కార', 'తబ్బలియు నీనాదె మగనె', 'కాడు', 'దుర్గ', 'చెలువె', 'ఒందానొందు కాలదల్లి', 'ఉత్సవ్', 'గోధూళి', 'ఆనందభైరవి', 'కానూరు హెగ్గడతి' వంటి చలనచిత్రాలలో కార్నాడ్ నటన, రచన, దర్శకప్రతిభ ఆవిష్కృతమవుతుంది.




ఆయన నాటకాలు పెక్కు భారతీయ భాషల్లోకి, విదేశీ భాషల్లోకి అనువాదమయ్యాయి. ఆయన సంగీత నాటక అకాడమీ అవార్డు, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, కన్నడ సాహిత్య అకాడమీ అవార్డు, రాజ్యోత్సవ ప్రశస్తి అందుకున్నారు. భారత ప్రభుత్వం పద్మభూషణ్ గౌరవం ప్రదానం చేసింది. ప్రపంచ రంగస్థల దినోత్సవం నాడు అంటే 1999 మార్చి 27న కార్నాడ్‌కు జ్ఞానపీఠ పురస్కారం అందజేసే కార్యక్రమం జరపడం నాటక రంగానికి ఆయన చేస్తున్న మహత్తర సేవలకు మహోన్నత గుర్తింపు.

నిత్యనూతన సౌరభాలు గుబాళించే నాటకాలు గిరీశ్ కార్నాడ్ కలం నుంచి జాలువారుతూనే వుండటం నాటక ప్రపంచానికి మహద్భాగ్యం.

*- గోవిందరాజు రామకృష్ణారావు*

# కరువు సీమ రైతు బతుకుకు అద్దం

# కాడి

మెట్టప్రాంత రైతాంగ వేదనలు, గ్రామీణ ప్రాంతాల్లో కొత్తరూపుదాల్చుతున్న కుల చైతన్యాలూ, మనస్తత్వాలూ, ఘర్షణలూ, ప్రజానీకాన్ని చెప్పుచేతల్లో ఉంచుకుని, వారి బలహీనతలతో ఆడుకునే రాజకీయాలూ కలిపి ఒక తరానికి సరిపడే అనుభవాలను 'కాడి' నవలగా అందించారు సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి. 'కాడి' రచనకు పురికొల్పిన సంఘటనలు, ఆ విశేషాలేమిటో ఆయన మాటల్లోనే..

సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి

నేను పుట్టి పెరిగింది కడపజిల్లా బాలరాజుపల్లెలో. మాది వ్యవసాయ కుటుంబం. అక్కడంతా మెట్టవ్యవసాయమే. రైతుజనం మేఘాల్ని నమ్మి మట్టిలో విత్తనాలు చల్లి ఆకాశం వేపు ఆశగా చూసే దుస్థితి.

మా ఊరికి దగ్గరలోని కాడిగుట్టల్లో ఉన్న పాపిరెడ్డిపల్లెలో ఉపాధ్యాయునిగా పనిచేసే రోజులు. ఆ ఊళ్ళో పిల్లల్ని బడికి రమ్మని నచ్చచెప్పేందుకు ఊరంతా తిరిగి రావటం నాకు అలవాటు.




ఆ సందర్భంలో రోశిరెడ్డి అనే డెబ్బైయేళ్ల రైతు నేను కనిపించినపుడల్లా ఆప్యాయంగా పలకరించేవాడు. వ్యవసాయం గురించి చెబుతూ ఈ తరం యువత దానికి దూరం కావటంపట్ల ఆవేదన వ్యక్తం చేసేవాడు.

"నేను సేద్దెం జేసేప్పుడయితే ఇంట్లో జతలు జతలు కొరముట్లుండె. గొర్రుకనో, గుంటకకనో, నాగేలికనో, జడిగానికనో ఎవరోకరు వస్తాండిరి. నాలుగు మాటలు మాట్లాడి కొరముట్లు తీసపోయి పన్జరుపుకొని తెచ్చిస్తాంద్రి. ఎద్దల బేరమో, బరకసేద్దెం సంగతో, కలుపులు కోతల మాటో ఏదొక యవ్వారం జేస్తాంటిమి. ఊరకుండకుండా తాల్లు పేడుకొంటా మాటలు, ఎద్దలకు మేపేస్తా మాటలు.. సేద్దెం గురించిన మాటలే.. ఇప్పుడా సేద్దెం లేదు, కొరముట్లు లేవు, పొద్దేపోడం లేదనుకో సారూ! సావిటికాడి పోరంబోకు మాటలు నాకు గిట్టవు. కూటికి నీల్లకు రాని ఆ మాటలెందుకు సెప్పు. నా ఇద్దరు కొడుకులూ చెరొక ఎద్దును పట్టుకొచ్చుకొంటేనేం? ఊహూ.. పోరంబోకు నా కొడుకులయిగ్రి. వీల్ల దెబ్బకు ఎద్దల కొట్టం కూలిపాయె. ఎద్దల గాడి బీడుబడె. చేలల్లో కంపచెట్లు మొలుస్తాండె.." అంటూ ఆవేదన చెందేవాడు.

ఆ మాటలు నన్ను కదిలించాయి. ఒక తరం వ్యవసాయ జీవితపు ఆవేదనంతా ఆయన మాటల్లో ధ్వనించింది.

వ్యవసాయ తాత్వికత గురించిన కథ రాద్దామనుకున్న నాకు చాలా రోజులకు ఒక పాయింట్ దొరికింది. దాంతోపాటు పాపిరెడ్డి పల్లెలో ఓ సంఘటన జరిగింది. సేద్యపు ఎద్దుకోసం రెండు గ్రూపుల మధ్య గొడవ. పోలీసులకు దొరక్కుండా ఉన్నత వర్గం గ్రూపువాళ్ళు పరారై చెట్లెంట, గుట్టలెంట, చేలెంట తిరుగుతూ రాత్రిళ్లు అక్కడే ఉండి నానా అగచాట్లు పడటం. అందులోకి రాజకీయం, మతం హుషారుగా జొరబడి సమస్యను మరింత జటిలం చేయటం కనిపించింది. ఆ సంఘటనను కథలో ఇమిడిస్తే పల్లె సమాజపు సహజ స్థితి చూపించినట్లవుతుందనుకుంటూ కథ రాయటం ప్రారంభించాను.

అదే సమయంలో అమెరికన్ తెలుగు అసోసియేషన్ (ఆటా) ఐదో వార్షికోత్సవాల సందర్భంగా అంతర్జాతీయ నవలల పోటీ నిర్వహిస్తున్నామంటూ ప్రకటన వచ్చింది. అదే స్ఫూర్తితో కథ కాకుండా నవలా రచనకే ఉపక్రమించాను. కేవలం పదమూడు రోజుల్లో రెండు వందల పేజీల 'కాడి' నవల రాయగలిగాను.

ఇదీ కథ ...

కొంతమంది యువకులు దళితుడైన సాల్మన్ మీద దాడిచేసి అతన్ని దుక్కిపెళ్లల్లో పడదోసి అతని ఎద్దును తీసికెళ్లటంతో కథ ప్రారంభమవుతుంది.

సెంటు భూమిలేని సాల్మన్ కరువు కాలంలో తన రెండెద్దుల్నీ మేపటం కష్టమై, ఒక ఎద్దును జయరాములుకి అమ్ముతాడు. ఈ బేరం కుదిర్చిన పిచ్చిరెడ్డి జయరాములికి బంధువు. అదీగాక సాల్మన్ పిచ్చిరెడ్డికి బాకీపడి ఉంటాడు. ఎద్దు తాలూకు వచ్చిన డబ్బు తన పాత బాకీకి జమేసుకుంటాడు పిచ్చిరెడ్డి. ఈ సంగతి సాల్మన్‌కి చెప్పడు.

### పాఠ్యాంశం, పరిశోధనాంశంగా..

1998 జూలైలో ఆమెరికా 'ఆటా' వారు 'కాడి' నవలని మొదటగా ప్రచురిస్తే, లైఫ్‌లైన్ కమ్యునికేషన్స్‌వారు 1998 నవంబరులో ద్వితీయ ముద్రణ కావించారు.

'కాడి' నవలను యోగివేమన యూనివర్శిటీలో ఎం.ఎ విద్యార్థులకు పాఠ్యగ్రంథంగా ప్రవేశ పెట్టారు. ప్రస్తుతం ఈ నవల మీద రెండు యూనివర్శిటీల్లో ఇద్దరు పరిశోధన విద్యార్థులు పి. హెచ్‌డి చేస్తున్నారు.

సాల్మన్‌కు ఎద్దు పోయిందేగాని డబ్బు చేతికి రాలేదు. ఉన్న ఒక్క ఎద్దుక్కూడా మేపు కరువైంది. ఎడ్ల పందేలకని జయరాముల దగ్గరున్న తన ఎద్దును సాల్మన్ తీసుకెళ్ళి, పందెం అయ్యాక దాన్ని జయరాములికి అప్పగించకుండా తనింటికే ఎద్దును తోలుకెళతాడు. దాంతో జయరాములు తనవర్గీయులైన బాలయ్య, సూర్యుడు మరికొందర్ని వెంటబెట్టుకువెళ్ళి సాల్మన్ దగ్గర్నుండీ ఎద్దును బలవంతంగా తోలుకొస్తాడు.



## ప్రముఖుల ప్రశంసలు

కడప జిల్లాలోని మెట్ట, బీడు వ్యవసాయిక జీవితాలలో వచ్చిన మార్పుల్ని 'కాడి' నవల ప్రతిభావంతంగా చిత్రిస్తుంది. గొప్ప జీవితానుభవం, సరైన దృక్పథమూ, సమర్థమైన రచనా శిల్పం ఉన్న నవల ఇది. రాయలసీమ నవలా సాహిత్యానికి ఇచ్చిన విలువైన కానుక 'కాడి' నవల.

**– వల్లంపాటి వెంకటసుబ్బయ్య,**
ప్రముఖ కథకులు, విమర్శకులు

గ్రామీణ జన జీవనాన్ని సంపూర్ణంగా ఆకళింపు చేసుకుని, విశిష్ట రచనగా 'కాడి' నవలను అందించారు సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి. కుల, వర్గ, వృత్తుల్లోని వివిధ కోణాలు, వాటిలో సంభవిస్తున్న మార్పులు.. తత్ఫలితంగా దక్షిణాంధ్ర గ్రామీణ ప్రాంతాల్లో చోటుచేసుకుంటున్న ఘర్షణలను చిత్రించేందుకు ఆయన చేసిన ప్రయత్నమే 'కాడి' రచన.

**–డా. కేతు విశ్వనాథరెడ్డి ,**
ప్రముఖ కథకులు

కడప జిల్లా గ్రామీణ ప్రాదేశికతను- ఆర్థిక సామాజిక రాజకీయ అవయవాలుగా శిల్పీకరించి, విశిష్టరచనగా ఆవిష్కరించినవాడు సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి. శిల్పికి రాయి తత్వం తెలిసుండాలి. ఈ రచయితకు కూడా తాను పుట్టిన ప్రాదేశిక తత్వం బాగా తెలుసు.

**– బండి నారాయణస్వామి,**
కథకులు

గ్రామీణ జనజీవన స్థితిగతులు, వర్గాల మధ్య అంతరాలు, మారుతున్న రాజకీయం, అనాదిగా వస్తున్న కులవృత్తులు, తనకున్న గ్రామీణ జీవన నేపథ్యం, పరిస్థితుల అవగాహనా సామర్థ్యంతో రచయిత సన్నపురెడ్డి వెంకట రామిరెడ్డి 'కాడి' నవల ద్వారా సామాజిక పోకడలనూ, మార్పులనూ విశ్లేషణాత్మకంగా ఆవిష్కరించగలిగారు. ఈ నవల తెలుగు సాహిత్య లోకంలో ఒక ఆసక్తికర చర్చకు వేదికగా నిలిచింది.

**– తవ్వా ఓబుల్‌రెడ్డి,** కథకులు

రాజకీయ నాయకులూ, తనవర్గం పెద్దల ప్రోత్సాహంతో సాల్మన్ జయరాములవాళ్ళమీద కేసు పెడతాడు. దాంతో బాలయ్యా మరికొందరు పారిపోయి దాక్కుంటారు.

బాలయ్యకు ఇద్దరు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళు. కొడుకుల్ని బాగా చదివించి ఉద్యోగస్తుల్ని చేయాలనీ, ఉన్నతస్థితిలోని అల్లుళ్ళని తెచ్చుకోవాలని తపించేవాడు. కానీ కొడుకులిద్దరికీ చదువబ్బలేదు. పెద్ద కొడుకు పోరంబోకు. చిన్నకొడుకు చెప్పుల షాపు పెట్టుకుంటాడు.

బాలయ్య పెద్దకూతుర్ని ఉద్యోగస్తునికే ఇచ్చి పెళ్ళి చేస్తాడు. రెండో కూతురు ఊళ్ళోనే ఓ రైతు కొడుకుని ప్రేమిస్తుంది. అది ఇష్టం లేని బాలయ్య ఆమె మనస్సు మార్చేందుకు పెద్దకూతురు లక్ష్మిని ఇంటికి పిలిపిస్తాడు.

ఉన్నత, దళిత వర్గాలమధ్య జరిగే ఘర్షణల్లో రాజకీయం, కుల, మతవాదాలు చొరబడి సమస్య మరింత జటిలమవుతుంది. మరోవైపు బాలయ్య పెద్దకూతురు లక్ష్మి భర్తతో తగవులాడి పుట్టింటికి వచ్చింది. చెల్లెలి ప్రేమను, పెళ్ళిని ఆమె సమర్థిస్తుందని తెలుకున్న బాలయ్య వలవలా ఏడవటం కథ. తను సాధారణ రైతుగానే మిగిలాడు తప్ప మోతుబరి రైతుగా మారలేకపోయాననుకున్న అతను దళితులతో రాజీపడతాడు. రాజకీయం తెరచాటున ఉండి ఇరువర్గాల మధ్య చిచ్చు రేపుతూ తన చెప్పుచేతల్లో ఉంచుకోనేందుకు ప్రయత్నించడం ప్రధానాంశం.

'కాడి'కి అమెరికా తెలుగు అసోసియేషన్ (ఆటా) నవలలపోటీలో రెండో బహుమతి, లభించడం మరువలేని అనుభూతి అంటూ ముగించారు రచయిత సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి.

సేకరణ : రేవతీనంద్

# ఎంతఘాటు ప్రేమయో!

- తల్లాప్రగడ లలిత

సాయంత్రం ఆరుగంటలయింది. అరగంట నుంచి ఎడతెరిపి లేకుండా బయట హోరున వర్షం. ఐదో అంతస్తులో తన అపార్టుమెంటు బెడ్రూమ్ దగ్గర కూర్చుని పెద్ద సిరామిక్ మగ్‌లో పొగలు గక్కుతున్న కాఫీ తాగుతోంది సువర్చల. ఈరోజు ఆఫీసు నుంచి గంట ముందరే వచ్చేసింది. ఇంకా తన రూంమేట్స్ రాలేదు. వర్షం వచ్చినప్పుడల్లా వేడివేడి కాఫీ రుచి చూస్తూ కిటికీ దగ్గర కూర్చుని బయట వర్షాన్ని చూడడం సువర్చలకు ఎంతో ఇష్టం. అందులోనూ శుక్రవారం సాయంత్రం. ఎందుకంటే శని, ఆదివారాలు సాఫ్ట్‌వేర్ ఉద్యోగులకు సెలవు దినాలు. రెండు నెలల క్రితం ప్రభాకరం పరిచయమైనప్పటి నుంచి వీకెండ్ ఎప్పుడు వస్తుందోనని ఎదురు చూస్తోంది. ఇలాంటి వర్షంలో తనూ ప్రభాకరం తడుస్తూ ఎన్నిసార్లు కేఫ్‌లకు పరిగెట్టారని! ఎన్నిసార్లు మల్టీప్లెక్స్‌లలో సినిమాలకు, షాపింగ్‌మాల్‌లకు తడిపొడిగా తడుస్తూ వెళ్లారో గుర్తుకు తెచ్చుకొంటోంది సువర్చల.



నాలుగునెలల క్రితం సువర్చల కాఫీడేలో కాఫీ తాగుతుండగా నాలుగైదు టేబిల్స్ తర్వాత వరసలో.. ఎవరో ఒకతను తనను తేరిపార అదేపనిగా చూడడం గమనించి సువర్చల అసహనంతో ముఖాన్ని అవతల పక్కకు తిప్పుకొంది. ఇంతలో "ఎక్స్‌క్యూజ్ మీ!" అన్న మాటలకు వెనక్కి తిరిగిన సువర్చలకు ఆ అపరిచిత వ్యక్తి కనిపించాడు చిరునవ్వు నవ్వుతూ. "సారీ! ఇఫ్ ఐయామ్ నాట్ మిస్టేకన్.. మీరు సువర్చల కదూ! గుర్తుందా? ఆరేళ్లక్రితం వైజాగ్ ఆంధ్రా యూనివర్సిటీలో ఇంజనీరింగ్ చేస్తున్నప్పుడు మీరు నాకు జూనియర్! మనం అనేక కల్చరల్ ఏక్టివిటీస్‌లో పార్టిసిపేట్ చేసాం" అనగానే సువర్చల సంభ్రమాశ్చర్యాలతో "అరే! మీరు ప్రభాకరం కదూ! సారీ! ఈ ఆరేళ్ళలో ఎంత మార్పు? మిమ్మల్ని గుర్తుపట్టలేకపోయాను. ఐయామ్ ఎక్స్‌ట్రీమ్లీ సారీ!" అంటూ కూర్చోమంది. తర్వాత అదే టేబిల్ మీద నాలుగైదు కప్పుల కాఫీ తాగుతూ తమ కాలేజ్ డేస్ గురించి, ప్రస్తుతం తాము చేస్తున్న జాబ్స్ గురించి మాట్లాడుకున్నారు. ప్రభాకరం సాఫ్ట్‌వేర్ కంపెనీలో జాబ్ చేస్తూ గత రెండేళ్ల నుంచి తన కొలీగ్స్‌తో మాదాపూర్‌లో అపార్ట్‌మెంటులో ఉంటున్నానని చెప్పాడు. సువర్చల కూడా కిందటేడాదే గచ్చిబౌలిలో ఇన్ఫోసిస్‌లో జాయినయినట్లు, అక్కడే తన కొలీగ్స్‌తో అపార్ట్‌మెంటులో వుంటున్నట్లు చెప్పింది. తర్వాత నుంచి ప్రతి వీకెండూ సువర్చలా, ప్రభాకరంలు కాఫీడేలలోనో, మల్టీప్లెక్స్ సినిమాలలోనో, షాపింగ్‌మాల్‌లలోనో కలుసుకునేవారు. ఇద్దరూ సాఫ్ట్‌వేర్ కంపెనీలలో పనిచేస్తున్నారు. తమ పెళ్లికి ఇరువైపుల పెద్దలు ఎటువంటి అభ్యంతరాలు పెట్టడానికి పెద్దగా కారణాలు కనబడటంలేదు.

చతుర కథలు

మనస్సు గతంలోకి వెళ్లిన సువర్చలకు మగ్‌లోని కాఫీ ఎప్పుడు ఖాళీ అయిందో తెలియలేదు. ఇంతలో ఫోన్. ఇంకెవరు? ప్రభాకరం!

"హాయ్ ప్రభా!" అంది సువర్చల.

అటునుంచి ప్రభాకరం, "సువర్చలా! వర్షాన్ని చూస్తూ కిటికీవద్ద కూర్చుని వేడివేడి కాఫీ తాగుతున్నాను. నీకు జెలసీగా వుందా? " అన్నాడు.

సువర్చల "ఈజ్ ఇట్? నేను అరగంట నుంచి చేస్తున్న పని అదే" అంటూ పకపక నవ్వింది.

"ప్రభా! అక్కడే కూర్చో! నేను కూడా ఇంకొక మగ్ కాఫీని తెచ్చుకొని నీ గురించి తాగుతా" అంది సువర్చల.

ప్రభాకరం ఫోనులో సువర్చల గురించి లిరికల్‌గా చెబుతున్నాడు. "ఆకాశంలో నల్లని మబ్బులు కమ్మినా, చల్లని గాలులు వీచినా, హోరున వర్షం పడుతున్నా నీవే గుర్తుకొస్తున్నావు. ఫెళ్ళున ఎండకాసినా నీ జ్ఞాపకమే!"

"అబ్బోసి! నిజంగానా? " అంది సువర్చల.

"నిజమే! మనం తాగుతోన్న కాఫీమీద ఒట్టు"

తను ప్రభాకరం మీద పెట్టుకున్న ఆశలు వమ్ముకావనిపిస్తోంది సువర్చలకు. ప్రభాకరం మాటల్లో చిలిపిదనం ఎక్కువైంది ఫోనులో. ఊ కొట్టడం మినహా ఇంకేమీ మాట్లాడలేకపోతోంది తన్మయత్వంలో. రేపుటెల్లుండి తాము గడపబోయే సాన్నిహిత్యాన్ని తలుచుకుంటుంటే ఎంతో హాయిగా వుంది సువర్చలకు.

ఒక్కసారిగా పెద్దగా ఉరుము చప్పుడు! అవతల నుంచి ప్రభాకరం "ఔనూ! సువర్చలా! రెండువారాల క్రితం నా బర్త్‌డేకు నీవూ, నీ ఫ్రెండ్స్ మా అపార్ట్‌మెంటుకు వచ్చారు కదా! పార్టీ అయిన తర్వాత వర్షం పడుతుంటే నేను నీకు గొడుగు ఇచ్చాను గుర్తుందా? రేపు నీవు వచ్చేటప్పుడు దాన్ని మర్చిపోకుండా తీసుకురా! బై!" అంటూ ప్రభాకరం ఫోన్ పెట్టేయగానే సువర్చల నిర్ఘాంతపోయింది.

"ఆకాశంలో నల్లని మబ్బులు కమ్మి చల్లనిగాలులు వీచి హోరున వర్షం పడుతున్నప్పుడు ఫెళ్ళున ఎండ కాస్తున్నప్పుడు ప్రభాకరంకి సువర్చల గుర్తుకు రావడానికి, తనకు ఇచ్చిన గొడుగుకి వున్న సంబంధం తెలిసిన సువర్చల చేతిలో కాఫీమగ్ జారిపడి భళ్ళున పగిలింది. ©

# ఇదీ సంగతి!

**- పార్థసారథి చిరువోలు**

అప్పుడే చినుకులు మొదలయ్యాయి. హడావిడిగా రోడ్డు దాటుతూ ఆమెవైపు చూశాను. బాగా పరిచయం ఉన్న వ్యక్తిలా కనిపించింది. ఎక్కడో చూసినట్లున్నా జ్ఞాపకం రాలేదు. వెంటనే నేను ఆలోచనల్లో ఉండగానే ఆమె పలకరించింది, "బావున్నారా? " అంటూ.



తలాడించాను.

"నేను మీ షాపుకు వస్తుంటాను" చెప్పిందామె.

అప్పుడు గుర్తు కొచ్చింది.

నగరంలో ఖరీదైన శారీమాల్‌లో నేను సేల్స్‌మాన్‌ని. ఇదివరకు ఆమెను చాలాసార్లు మా షాపులో నేను చూశాను.

తరచూ ఆమె స్నేహితురాళ్లో, బంధువులో.. ఎవరో కొత్త వ్యక్తులతో కనిపించేది. బహుశా షాపింగ్ అంటే మక్కువ అనుకుంటా. ప్రధాన ద్వారం మొదటి కౌంటర్‌లో నేనుండటం వల్ల- సాధారణంగా లోపలకొచ్చేవాళ్లు నాకు కనిపిస్తుంటారు.

ఆమె తన గురించి చెప్పగానే పలకరింపుగా నవ్వి, "ఇదివరకు షాపుకి ఎక్కువ వచ్చేవాళ్లు. ఇప్పుడు రావటం లేదే? " అడిగాను.

బదులుగా ఆమె నవ్వుతూ అసలు విషయం చెప్పింది, "మొన్నటివరకు వేసవి కదా! పవర్‌కట్ విపరీతం. ఇంట్లో ఉండటం కష్టమై మీ షాపుకి వచ్చేదాన్ని. షాపింగ్ అంటే ఆడవాళ్లు సహజంగానే ఎగిరి గంతేస్తారు కదా! నాతోపాటు మా అపార్టుమెంట్ వాళ్లు ఎవరో ఒకరు జత కలిసేవాళ్లు"

నేను ఆమె చెప్పేది ఆసక్తిగా వింటున్నాను.

"ఓ రెండు మూడు గంటలు మీ షాపులో గడిపే వాళ్లం. సెంట్రలైజ్డ్ ఏసీ కావటం వల్ల బాగా సౌలభ్యంగా ఉండేది.

గత ఐదారు నెలల్లో నేను కొన్నది ఒకే ఒక్కచీర. ఎక్కువసార్లు మేం చేసేది -చీరలను పరిశీలించటమే" రహస్యాన్ని విప్పి చెప్పినట్టుగా అంది.

"వరుసగా అన్ని షాపులుండగా మీ షాపుకే ఎందుకొచ్చేదాన్నని మాత్రం అడక్కండి. ఈ వర్షాకాలం అయ్యాక మళ్లీ కలుద్దాం" అంటూ వెళ్లిపోయింది.

నాకు నోట మాట రాలేదు. 'ఇలాంటివాళ్లూ ఉంటారా? ' అని ఆలోచించసాగాను. ©




# బంతి

అనువాదం : ప్రొఫెసర్ ఎస్. శేషారత్నం

"అంకుల్.. ఓ అంకుల్.. దయచేసి వినండి అంకుల్.."

ఇంచుమించుగా ఇరుకు రోడ్డును ఆనుకుని ఉన్న బంగళావైపు నుండి అబ్బాయి ఎవరో అతన్ని పిలిచినట్లు అనిపించింది.

సచ్‌దేవ్‌గారు ఆగి ఆ పిలుపు ఎటువైపు నుంచి వచ్చి వుంటుందబ్బా అని ఆలోచించసాగారు. కానీ తెలుసుకోలేకపోయారు.

బట్టతలను, చెవులను కప్పుతూ గట్టిగా కట్టిన మఫ్లర్‌ని కొంచెం వదులు చేశారు. చక్కెరవ్యాధి నిర్దాక్షిణ్యంగా ఆయన వినికిడి శక్తిని కబళించింది. ఎదుటివ్యక్తి మాట వినిపించనప్పు

డల్లా వాళ్లకు తెలియకుండానే వాళ్ళ స్వరంలో వ్యక్తమయ్యే విసుగు ఆయన మనసును తరచుగా గాయపరుస్తూ వుంటుంది.

ఏడెనిమిది నెలలు పైనే అయివుంటుంది, ఆయన తన బాధను తెలియజేస్తూ వినయ్‌కి ఉత్తరం రాసి. వినికిడి యంత్రం కొరకు డబ్బు పంపిస్తున్నాననీ, ఆ గ్రామంవాళ్ళ సహాయంతో చికిత్స చేయించుకోమని ప్రత్యుత్తరంగా అతను ఫోనులో అరిచాడు.

చాలారోజుల వరకు ఆయన తన పేరున రావలసిన డబ్బుల కోసం ఎదురు చూశారు. సమాధానంగా ఇంకొకసారి ఫోన్ వచ్చింది. 'ఒక ముఖ్యమైన పనిలో ఇరుక్కుపోయినందువల్ల పైకం పంపలేకపోయాను. వచ్చే నెల పదహారునాటికి నా స్నేహితుడు ఒకడు ఇండియా వస్తున్నాడు. వాళ్ళ ఇల్లు లజపతినగర్‌లో వుంటుంది. అతని ఇంటి ఫోన్ నెంబరు నోట్ చేసుకోండి. అతని ద్వారా పౌండ్లు పంపిస్తున్నాను. పైకం అతను వచ్చి స్వయంగా మీకు ఇస్తాడు. లేదా ఎవరితోనైనా పంపిస్తాడు' అని.

అతని పేరు -డాక్టరు కుశావాహ. నెల మొదలవుతూనే ఆయన వాళ్ళ ఇంటికి ఫోన్ చేయనారంభించాడు. మూడోసారి ఫోను చేసినప్పుడు తెలిసింది, అతడు పదహారో తారీఖున వస్తున్నట్లు. ఈసారి ఆయన ఫోన్ చేయటానికి ముందే 'డాక్టరు మనీషా కుశావహ నుండి ఫోన్ వచ్చింది' అని రామేశ్వర్ చెప్పటంతోనే ఉత్సాహంగా ఫోన్ దగ్గరకు వచ్చారు.

ఆయన యోగక్షేమాలు గురించి చాలా ఆత్మీయంగా అడిగి తెలుసుకున్నాడు అవతలివ్యక్తి.

"ఏమిటి? ఇక్కడ ఒంటరిగా వుంటున్నారా? వినయ్ దగ్గరకు ఎందుకు రారు? అతని భార్య.. అదే మీ కోడలు స్వయంగా డాక్టరు కదా!" ఆయన కష్టసుఖాల్ని తెలుసుకోవాలనే ఉద్దేశంతో మనీషా కుశావహ ప్రశ్నించాడు గాని, పైకం ఊసే ఎత్తలేదు.

విసుగుతో స్వయంగా ఆయనే అడిగారు, "బాబూ.. వైద్యం చేయించుకోవటానికి నీతో డబ్బులు పంపిస్తున్నట్లు వినయ్ చెప్పాడు"

మనీషాకు వెంటనే జ్ఞప్తికి వచ్చింది.

"అవునవును. వినయ్ చెప్పాడు. ఆశ్రమం ఫోన్ నెంబరు కూడా ఇచ్చాడు. నాన్నగారికి కొంచెం పైకం పంపించాలని.... కాని నేను బయలుదేరే వరకూ.... అసలు నాక్కాడ ఏమాత్రం తీరిక చిక్కలేదు. లేకుంటే నేనే గుర్తుచేసేవాడిని"

వినయ్‌కు ఉత్తరం రాయటానికి కూర్చోగానే.. అసలే వణికే చేతులు, కోపం వల్ల ఇంకా ఎక్కువగా వణకసాగాయి. అక్షరాలు చదవగలిగేటట్లు వుంటేగదా, తను చెప్పాలనుకున్నది చెప్పగలుగుతాడు. అంతే ఈ ఆలోచన రావటంతోనే ఫోన్ ద్వారా చీవాట్లు పెట్టి సేదతీరాలని నిర్ణయించుకున్నారు.

ఫోన్ చేస్తే మార్గరెట్ తీసింది. తనకు ఆ విషయం అర్థం కావటంలేదనీ, వినయ్ మాంచెస్టర్ వెళ్లారనీ చెప్పింది.

మార్గరెట్ పొంతనలేని సమాధానంతో ఆయన ఖిన్నులయ్యారు. మనసుకు తూట్లు పడ్డాయి.

'కోడలు మాట్లాడాల్సిన తీరేనా ఇది?' అని ఆయన ఇంచుమించు ఫోనును విసిరికొట్టినంత పనిచేశారు. అంతకన్నా చేయగలిగింది కూడా ఏమీలేదు. కోపం వచ్చినప్పుడు ఆయన హిందీగాని, పంజాబీగాని మాత్రమే మాట్లాడగలరు. మార్గరెట్ ఆయన ఇంగ్లీషునే అర్థం చేసుకోలేదు. అలాంటప్పుడు హిందీగాని, పంజాబీగాని

ఎలా అర్థం చేసుకోగలదు? మనుమరాలు 'సుపీనా'తో మాట్లాడలేనందువల్ల కలిగిన దుఃఖం వారాల తరబడి మనసును తొలి చెయ్య సాగింది.

నవంబరు చివరి రోజులు...

చలికాలం రావడం అందరికీ ఇష్టం గానే వుంటుందికానీ తనకు ఏమాత్రం ఆనం దంగా లేదు. అందరూ ఉత్సాహంగా చీకటి బాహువుల్లో ఇమిడిపోతారు. ఆశ్రమం నుంచి షికారుకు బయలుదేరక పోతే మంచంమీదే దొర్లాలనిపిస్తుంది.

మఫ్లర్‌ను గట్టిగా చుట్టి ముందుకు నడి చారు. మదర్ డైరీ వరకు నడిస్తేగాని ఆ రోజు దినచర్య పూర్తయినట్లు కాదు. అలా చేయకపోతే ఏదో దిగులుగా వుంటుంది.

'ఎవరూ పిలువలేదు. ఎవరు పిలు స్తారు? పిలిచినట్లు అనిపించింది. అంతే, భ్రమ!' అనుకున్నారు.

మంచానికి ఆనుకుని వున్న టీపాయ్ మీద మందుబిళ్లలను పెట్టినట్లు తనకు గుర్తుంటుంది. కానీ అవి ఎక్కడో ఏ దిండు కిందో దొరుకుతాయి.

ఇంతకుముందు వీళ్ళు నలుగురైదుగురు కలిసి షికారుకు వెళ్ళేవారు! ఒక్కొక్కళ్ళుగా వాళ్ళందరూ మంచం పట్టారు.

ఇరవయి, ఇరవై ఒక్కరోజుల ముందువ రకు తన రూమ్ పార్ట్‌నర్ కపూర్ తనతో వస్తూ వుండేవాడు. అకస్మాత్తుగా అతని రెండు కాళ్ళలోనూ వాపులు వచ్చాయి. కపూర్ తనను కూడా ఒంటరిగా వెళ్లొద్దని హితోపదేశం చేస్తున్నాడు. మిత్రులతో కలిసి షికారు, సూర్యుని కిరణాల వెచ్చ దనం.. ఆ మజానే వేరుగా ఉంటుంది. అంతేగాక ఒకరినొకరు పట్టించుకుంటారు.

సావిత్రిగారు ఈ మధ్య మిస్టర్ చద్దా కథ చెప్పటంలేదు. నడుస్తూ వుండగా ఎటాక్ వచ్చింది. అక్కడే కుప్ప కూలిపోయారు. మూడు గంటల తరు వాత ఎవరికో వార్త తెలిసింది. ఇలా.. ముసలితనంలో కీళ్లనొప్పులు రావటం సహజమే.

కపూర్ సలహా మంచిదే అయినా అమలు చెయ్యతగ్గదిగా అనిపించలేదు. తనకు మధుమేహ వ్యాధి. మనుష్యులను తినే ఈ రోగంతో కేవలం మందులతో యుద్ధం చెయ్యలేము. రాజీ బతికి వుంటే తన గురించి తాను ఆలోచించుకోవాల్సిన అవసరం వుండేది కాదు. ప్రతిరోజూ ఏదో ఒక చిట్కా వైద్యం చేస్తూ రకరకాల కషా యాలు మింగిస్తూ వుండేది. కాకరకాయల రసం, మెంతులు నానబెట్టిన రసం, నేరేడు గింజల కషాయం.. ఇలా ఎన్నెన్నో చెప్పలేం.

"ఓ అంకుల్.. తాతగారూ! ఇటు వెనక్కి చూడండి. ఎప్పటినుండి పిలుస్తున్నా. నేను ఫెన్సింగ్ వెనకున్నాను"

"వెనక్కు రండి.. ఇటు.. ఇటు చూడండి" అంటూ అవతల వైపునుండి ఫెన్సింగ్ పైకి ఎగురుతూ పిలుస్తున్నాడు. ఎంతకీ వినిపించుకోకపోయేసరికి తన పర ధ్యానానికి విసుక్కున్నాడు కూడా.

రొప్పుతూ, రోజుతూ ఉన్న తాను కొంచెం ఆగి వెనక్కి తిరిగారు. ఈసారి సరైనచోట దృష్టి పడింది.

"ఓ! నీవేనా నను పిలిచేది? "

---

**కొత్తగాలి...**

**దేవాలయాలకెందుకు**
**వెళ్లడం దండగ**
**సజీవులైన తల్లిదండ్రులు**
**ఇంట్లో ఉండగ**

– పి.వి.ఎన్. ప్రసాద్,
నవులూరు, గుంటూరు జిల్లా

---

అంతే, ఫెన్సింగ్ అవతల వైపునుండి గెంతే పిల్లవాడి ముఖం ఆనందంతో వెలిగిపోయింది.

"ఏమిటి సంగతి? ఎందుకు పిలిచావు..? "

"నా బంతి బయట పడింది.." తడబడుతూ చెప్పాడు.

"ఎట్లా? "

ఇలాంటి అర్థంలేని ప్రశ్నకు పిల్లవాడి మనసు చివుక్కుమన్నది.

"బౌలింగ్ చేస్తున్నాను.."

"సరే.. బయటకు వచ్చి నీ బంతిని నువ్వే ఎందుకు తీసుకోవు? "

### కొత్తగాలి... 

**పథకాల్లో**
**ప్రగతి పాత్ర నిల్**
**తాత్కాలిక**
**అత్తరూ పన్నీరూ ఫుల్**

– వి. సుబ్బారావు,
అనకాపల్లి

పిల్లవాడి ఉద్దేశం పసిగట్టి ఆయన నవ్వుకున్నారు.

"గేటుకు తాళం వేశారు"

"మమ్మీని తాళం తియ్యమని అడుగు"

"మమ్మీ నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళింది"

"పనిమనిషి ఎవరో ఒకరు వుండి వుంటారు కదా? "

"బుద్ధిరామ్ వాళ్ళ వూరు వెళ్ళాడు. ఇంట్లో నేను ఒక్కడినే వున్నాను. మమ్మీ బయటనుండి తాళం వేసి వెళ్ళింది" పిల్లవాడి అమాయకమైన ముఖాన్ని వివశత కమ్మివేసింది.

"ఊ.. ఒంటరిగా ఆడుకుంటున్నావన్నమాట"

"ఒంటరిగానే ఆడుకుంటున్నాను. మమ్మీ ఎవరితోనూ ఆడనివ్వదు"

"అరే.. అలా ఎందుకు చేస్తారు? "

"నాకు కూడా కోపం వస్తుంది. ఇక్కడి పిల్లలందరూ అడవి పిల్లలు. చెడిపోతావని అంటుంది"

"చాలా తప్పుడు ఆలోచన. సరే.. నిన్ను నర్సింగ్‌హోమ్‌కి ఎందుకు తీసుకువెళ్ళ లేదు? "

తల్లి మూర్ఖత్వం పట్ల ఆయనకు కోపం వచ్చింది. గంట- అరగంట మాటే అవ్వొచ్చు పిల్లవాడిని ఇలా ఒంటరిగా ఎవరయినా వదిలి వెళ్తారా?

"మమ్మీ గంటలో రాదు అంకుల్. రాత్రి తొమ్మిది గంటల తరువాత వస్తుంది"

"అంత లేటుగానా..? "

"మమ్మీ డాక్టరు కదా, అందుకని. నాకు తోడు ఉండటానికి నర్సింగ్ హోమ్‌నుండి ఒక నర్సు ఆంటీ వస్తారు ఇప్పుడు. గేటు ఇంటి తలుపులు ఆ ఆంటీనే తెరుస్తారు"

"అంకుల్! ఇంతకు ముందయితే అమ్మ నన్ను ఇంట్లో పెట్టి తాళం వేసి వెళ్ళేది"

ఆయనకు నమ్మబుద్ధి కాలేదు.

"మరి నాన్నగారు ఎప్పుడు వస్తారు? "

గడగడా మాట్లాడే పిల్లవాడు ఒక్కసారిగా మౌనంగా వుండిపోయాడు.

"లేరా? " అనుమానంతో ఆయన తిరిగి ప్రశ్నించారు.

'ఇంత చిన్నపిల్లవాడిని ఈ ప్రశ్న అడక్కుండా ఉండవలసింది' అనుకున్నారు.

ఇంతలోనే ఆయన అనుమానాన్ని నివృత్తి చేస్తూ "వున్నారు కదా? " అన్నాడు ఆ పిల్లవాడు.

"అయితే...? " బుర్రను తొలిచే ఈ ఆలోచన నుండి తననుతాను సంబాళించుకోలేకపోయారు.

"వేరుగా వుంటున్నారు"

"మమ్మీ ఆయనతో దెబ్బలాడుతుంది"

"అలానా..? "

"అంకుల్ నా బంతి వెదికిపెట్టండి. వెదికిపెడ్తారు కదూ? "

"నీవు నన్ను అంకుల్ అని ఎందుకు పిలుస్తున్నావు? నేను మీ తాత వయస్సు వాడిని. నన్ను తాత అని పిలువు"

పిల్లవాడు సందిగ్ధంలో పడ్డాడు.

"ముసలివాళ్ళను తాత అనే అంటారు" అని ఆయన వాడికి అర్థమయ్యేటట్టు చెప్పారు. పిల్లవాడి ముఖంలో సంతోషం పెల్లుబికింది.

"అవును తాత అనే అంటారు" అన్నాడు.

"సరేగాని, తాతగారు నీకు తెలుసా? "

"ఊహూ.. తెలియదు" అంటూ పిల్లవాడు అమాయకంగా తలూపాడు

"సరే అయితే నన్ను తాత అని పిలువు. పిలుస్తావు కదూ? " ఉన్నట్లుండి ఆయన గొంతు పూడుకుపోయింది.

తనమీద తనకే జాలి వేసింది.

"పిలుస్తాను గాని.. ఒక షరతు.. మీరు నాకు బంతి వెదికివ్వాలి మరి"

"ఇస్తాను.. ఇస్తాను. ముందు పిలువు"

"తాతగారూ.. నా బంతి వెదికి ఇవ్వరూ? "

సత్యదేవ్‌గారి ముసలి కళ్ళు చెమర్చాయి. చాలాసేపటివరకు గడ్డిగాదంలో పిల్లవాడి బంతి వెదుకుతూ ఉండిపోయారు. పిల్లవాడి కోరిక మేరకు రోడ్డుకు ఆవలివైపున కూడా ఆయన బంతిని వెదికే ప్రయత్నం చేశారు. కానీ బంతి ఎక్కడా కనిపించలేదు.

హతాశులై ఆయన వాడి దగ్గరకొచ్చి నిలబడ్డారు. పిల్లవాడిముఖం వేలాడిపోయింది.

"బంతి వెలుపల పడింది అని నువ్వు నమ్మకంగా చెప్పగలవా? "

"అవును. నిజమే. బయటే పడింది"

ఒక్కసారిగా ఫెన్సింగ్ పైనుండి పిల్లవాడు దూకిన శబ్దం దభ్‌మని వినపడింది. ఆయన కంగారుపడ్డారు.

ఇంతలోనే 'చాలా ఎత్తుగా వున్న ఫెన్సింగ్ మీదనుండి ఎగురుతూ ఇంత చిన్నపిల్లవాడు ఎలా మాట్లాడగలడు? కచ్చితంగా ఏదో ఒకదానిమీద నిలబడే వుంటాడు' అన్న ఆలోచన వచ్చింది.

"ఎలా పడ్డావు? దెబ్బ తగల్లేదుకదా? "

"లేదు తాతగారూ, గడ్డిమీద పడ్డాను"

క్షణంలో పిల్లవాడి ముఖం- నీటి మీద కమలంలాగా వికసించింది. వెంటనే దూకినందుకు ఇలా సంజాయిషీ ఇచ్చుకున్నాడు.

"మీరు భయపడ్డారు కదూ! తాతగారూ! నేను చిన్నపిల్లవాడిని కదా? కర్ర బుడుపు మీద నిలబడ్డాను"

"సరే! సరే!! ఇప్పుడయినా జాగ్రత్తగా నిలబడు" అని అన్నారుగాని అలా నిలబడకూడదని మాత్రం చెప్పలేకపోయారు. తరువాత అనిపించింది, ఇటుపక్క తాను నిలబడినంతసేపూ పిల్లవాడు కర్ర బుడుపు మీదనుండి కిందకు దిగడని.

ఈ ఆలోచన రావటంతోనే అన్నారు "నీవు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా బంతి మాత్రం ప్రహరీలోపలే పడింది. చీకటి పడుతోంది. ఇక నేను వెళ్తాను"

"అయ్యో కాదు.. కాదు తాతగారూ! దయచేసి వెళ్ళకండి" అంటూ పిల్లవాడు తన బుజ్జి చేతుల్ని వూపుతూ మారాం చెయ్యసాగాడు.

"బంతి మాయమైపోయింది. ఒంటరిగా ఆడుకోలేను కదూ అందుకని...."

మనసులో ఆనందం పెల్లుబికింది. ఎవరయినా తనను ఆపటానికి ఇంత పట్టు పట్టగలరా? మందమైన కళ్ళద్దాల లోపల నీటి పొరలు కమ్ముకున్నాయి. అలుముకున్న నీటి పొరను దిగమింగి వెయ్యటానికా అన్నట్టు ఆయన ఎత్తిన ముఖాన్ని కిందికి దించారు.

పిల్లవాడిని ఆయన సందిగ్ధంలో వుంచేశారు.

"వుంటారు కదూ!"

అంగీకారంగా ఆయన తల వూపారు.

మసక చీకటిలో వెలిగిన దీపాలు మిరుమిట్లుగొలిపాయి. కిర్రుకిర్రుమనే చెప్పుల్లో పాదాలు పెట్టి ఈడ్చుకుంటూ వెళ్ళాలి. అమాయకుడైన ఈ పసిపిల్లవాడికి తన బాధ ఏం తెలుస్తుంది?

"రేపు కూడా వస్తారా?"

"వస్తాను. ఈ దారినుండే షికారుకు వెళ్ళాలి. కాని ఎందుకు? రేపు ఎందుకు రావాలి?"

## కొత్తగాలి...

**కన్నీరు**
**కార్చగలిగితేనే కళ్ళు**
**నీకోసం కాదు,**
**పరుల కోసం!**

– సురేష్‌కుమార్, హైదరాబాద్

"ఈరోజు బంతి దొరకలేదు కదా? రేపు వెదికిపెట్టండి. మమ్మీతో చెప్పను" అని మౌనంగా ఉండిపోయాడు.

"చూడూ! రేపు నీకు కొత్తబంతి కొని తీసుకువచ్చి ఇస్తాను. వెదకలేను. ముసలాడిని అయిపోయాను కదా! అందుచేత ఎక్కువసేపు వంగి వెదకలేను"

"భలే, భలే! హాయ్! కొత్తబంతి! మీరు నాకు కొత్తబంతి తీసుకొచ్చి ఇస్తారా?" నమ్మకం కలగకపోయినప్పటికీ పిల్లవాడి ముఖంలో ఆనందం వెల్లివిరిసింది.

సంతోషంతో ఉక్కిరిబిక్కిరైపోయాడు.

"ఇందులో ఆశ్చర్యపోవటానికి ఏముంది? తాతగారు తన మనుమడికి ఆమాత్రం కొత్తబంతి కొనివ్వలేరా?"

"అయితే.. అయితే మంచి బంతిని కొనివ్వండి. కపిల్‌దేవ్ బౌలింగ్ చేసే బంతి లాంటిది"

"సరే మంచి బంతే తెచ్చి ఇస్తాను"

చాలా రోజుల తరువాత ఆయన నవ్వుకున్నారు. తన నవ్వుపట్ల తనకే ఆశ్చర్యం కలిగింది కూడా! నవ్వుతో తనకున్న సంబంధం తెగిపోయిందనుకున్నారు. కానీ చాలా రోజుల తరువాత మరలా ఈరోజు నవ్వారు.

ఇంతలోనే ఫెన్సింగ్ మీదనుండి కనబడే పిల్లవాడి ముఖం కనుమరుగయింది.

ఆయన ఆశ్చర్యంతో ఏదో చెప్పబోయారు. అంతలోనే ఓడ పైనుండి పైకి వచ్చే తెరచాపలాగా ఆయనకు బ్యాటు కనిపించింది. అంతే వెంటనే బ్యాటు చూడటానికని ముందుకు కదిలారు. ఆయన పిల్లవాడి ఉద్దేశాన్ని పసిగట్టగలిగారు.

"బాగుంది కదా?"

ఇలా మరిపించటం వాడికి నచ్చలేదు- "ఇది బాగుందా? ప్లాస్టిక్‌ది కదా? చూడండి, ఎంత సొట్టలుపడిందో"

ఆయన నవ్వు రెక్కలు విప్పుకున్నది

"అంటే తమరికి బ్యాటు కూడా కొత్తది కావాలన్నమాట?"

సమాధానం చెప్పకుండా ఒక్కసారిగా వాడు ఉలిక్కిపడ్డాడు. "నర్స్ ఆంటీ గేటు తెరుస్తున్నారు. నేను వెళుతున్నాను తాతగారూ. రేపు మిమ్మల్ని ఇక్కడే కలుస్తాను"

ఆయన పిల్లవాడి పేరు అడగలేదు. తన తెలివితక్కువతనానికి బాధపడ్డారు.

వెంటనే కేక పెట్టి "దొరగారూ! కాస్త మీ పేరు చెప్పి వెళ్ళండి"

"నా పేరు బిల్లూ.. తాతగారూ!" బుడుపు మీద నుంచి దిగుతూ కంగారుగా జవాబిచ్చాడు.

తిరిగి వెళ్ళేటప్పుడు దూరం చాలా తక్కు

వగా అనిపించింది. దారి పొడువునా 'బిల్లూ' గెంతుకుంటూ తనతోపాటు నడుస్తున్నాడు.

బిల్లూ ఈ సెక్టారులోనే ఉంటున్నాడు. జ్వరం తగ్గిన తరువాత తాను ఇంచుమించుగా ఈ వైపే నడవటానికి వస్తున్నాడు. కానీ ఎప్పుడూ వాడిని కలిసే అదృష్టం కలుగలేదు.

'అంతా బంతి ప్రభావం. భలే ఎగిరిందిలే! సరిగ్గా తన పాలిట అదృష్టంలా పడింది! ముందే ఎందుకు పడలేదు!' అని బాధపడసాగారు. బిల్లూకి బ్యాటూ, బంతే కాకుండా పూర్తి కిట్ కొనిస్తే బాగుంటుంది. సంభ్రమాశ్చర్యాలకు లోనవుతాడు.

ఎంత ఖర్చు అవుతుందో తెలియదు!

'ఎంత అయితే అంత అవుతుంది' అనుకున్నారు. ఆయన వృద్ధాశ్రమం పేరున పెన్షన్ రాసేశారు. ఉండటానికి, తినటానికి, మందుమాకులకు దానిలోనే ఏర్పాటు చేసుకున్నారు. కిందటేడాది పెరిగిన పెన్షన్ ఇంకా చేతికి అందటం లేదు. పెరిగినప్పటి నుండీ ఇవ్వాలసిన బకాయి సొమ్మును ఈ మధ్యే మొత్తంగా ఇచ్చివేశారు. అందిన పైకంలో నుండి కొంచెం సొమ్ము అడగ్గా, సావిత్రిగారు నిరంతరమూ పెరుగుతూ వున్న వృద్ధాశ్రమం ఖర్చులు, పెరుగుతున్న ధరల్ని గురించి ఏడుపు ముఖంతో వివరిస్తూ కొంచెం సొమ్ము ఇచ్చింది. ఇక్కడ ఉన్నవాళ్ళలో ఎక్కువ మందికి ఒక సంవత్సరం లేక ఒకటిన్నర సంవత్సరాల వరకు ప్రతినెలా ఇంటినుండి పైకం క్రమం తప్పకుండా పంపిస్తూ ఉంటారు. తరువాత ఆ బాధ్యత నుండి తప్పుకుని మాట్లాడకుండా ఉండిపోతారు. వృద్ధాశ్రమంలో ఉంటూ కూడా ఈ ముసలివాళ్ళు మిగిలిన ఆస్తిపాస్తులను తను ఈసడించుకుని, ఇంటినుండి బయటకు గెంటివేసిన, అర్హతలేని ఆ వారసులకే

# శునక సేవలకు గిరాకీ




చాలా దేశాల్లో శునకాలకు శిక్షణనిచ్చి అనేక పనులకోసం ఉపయోగించుకుంటున్నారు. అవి నేరస్తులను, డ్రగ్స్‌ను, పేలుడు పదార్థాలను పసిగడతాయి. అంధులకు దారి చూపిస్తాయి. మంచుప్రాంతాల్లో స్లెడ్జ్‌బళ్లు లాగుతాయి. ఇక ఇంటికి కాపలా కాయడంలోనూ బ్రహ్మాండంగా సేవలు అందిస్తున్నాయి. కొత్తగా దుబాయ్ మినిస్ట్రీ ఆఫ్ ఇంటీరియర్ శునకాలను వివిధ ప్రదేశాల్లో చిక్కుకున్నవారిని రక్షించేందుకు వినియోగిస్తోంది. అక్కడ కుక్కల తలమీద డిజిటల్ కెమెరాలను



అమర్చుతారు. తర్వాత వాటిని ఆపదలో చిక్కుకున్న, మానవమాత్రులు వెళ్లలేని ప్రాంతాలకు చొచ్చుకుపోయేలా శిక్షణ ఇస్తారు. ప్రమాదంలో చిక్కుకున్న వారి ఫోటోలు, శబ్దాలను ఆ కెమెరా ఎనభై మీటర్ల మేరకు వైర్‌లెస్ ద్వారా పంపుతుంది. రక్షక దళానికి ఈ సమాచారం ఎంతో అవసరం.

యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ పోలీసులు అబుదాబి సెర్చ్ అండ్ రెస్క్యూ కె-9గా పేరు పెట్టిన ఈ శునక దళాలతో పాకిస్తాన్, ఇండోనేషియా, ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్ తదితర దేశాలలో బాంబుదాడుల శిథిలాల్లో చిక్కుకున్న అనేకమందిని రక్షించారు. తీవ్ర భూకంపాలను ఎదుర్కొనే జపాన్ కూడా ఇలాంటి శునక దళాన్నే ఏర్పాటు చేసుకునే ప్రయత్నంలో ఉంది. వినూత్నంగా ఇలా శునకాలను, సాంకేతిక పరిజ్ఞానాన్ని కలిపే ఆలోచన మొదట దుబాయ్ పోలీసులకు రావడం మంచిదే!

# చతుర ప్రవేశిక

## జనవరి చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. కాంతం ఎవరిని పెళ్లాడింది?
జ.
2. దొంగతనాలు చేయించే పోలీసు అధికారి?
జ.
3. రామకోటిని హత్య చేసింది?
జ.
4. పాండుతో జైలులో గడిపింది?
జ.
5. సచ్‌దేవ్‌ను బంతికోసం పిలిచిందెవరు?
జ.
6. సావిత్రి ఎక్కడ పని చేస్తుంది?
జ.
7. 'తలెదండ' నాటక రచయిత?
జ.
8. గొడుగుకోసం సువర్చలకు ఫోన్ చేసింది?
జ.
9. 'కాడి' నవలా రచయిత?
జ.
10. పేట్రియాట్ చట్టం చేసిన అమెరికా అధ్యక్షుడు?
జ.

---

పంపినవారి పేరు: ------------------

------------------వయసు (   )

చిరునామా: ------------------

------------------

------------------

పిన్‌కోడ్:  ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

**చివరి తేదీ 19**

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

**విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.**

రాస్తారు!

రేపు కొంచెం ముందుగా బయలుదేరాలి. రిక్షాలో ముందుగా అలా మార్కెట్‌కి వెళ్ళి ఆట వస్తువులు అమ్మే ఏదైనా మంచి దుకాణంలో బిల్లూకి క్రికెట్ కిట్ కొనాలి. దానిమీద నా ఆశీస్సులు అని రాస్తాను.. 'బిల్లూకి తాతగారి నుండి' అని. డాక్టరైన వాళ్ళ అమ్మకు బహుశా ఇలాంటి బహుమతులు అంటే ఇష్టం ఉండకపోవచ్చు బహుశా బిల్లూ క్రికెట్ కిట్ తీసుకోవటానికి భయపడవచ్చు పిల్లవాడు కదా? అయినా ఆయన తన ప్రేమను చంపుకోలేకపోయారు. డాక్టరమ్మను నర్సింగు హోమ్‌కి వెళ్ళటానికి ముందే కలవాలన్న ఉద్దేశంతోనే తను ముందు బయలుదేరాలనుకుంటున్నారు. డాక్టరమ్మ 'ఒద్దు- గిద్దు' అని చెప్పినా తాను అంగీకరించటానికి సిద్ధంగా లేడు. పరిచయం చేసుకుంటాను. తానేమీ గుర్తింపులేని మనిషి కాదు. నవోదయ విద్యాలయ ప్రధాన ఆచార్యులుగా పనిచేసి పదవీ విరమణ చేసిన వ్యక్తి.

వృద్ధాశ్రమం గేటులోనికి ప్రవేశించగానే ఆ ప్రాంగణంలో గుమిగూడిన జనసమూహాన్ని చూడగానే ఆయనకు ఏదో అనుమానం కలిగింది. కొంపదీసి ఛటర్జీ దీదీ రామునిసన్నిధికి వెళ్ళలేదు గదా? ఆమె ఆరోగ్యం ఏమీ బాగుండలేదు. చాలా బాధపడుతున్నది. మూత్రపిండాలు రెండూ పనిచెయ్యటం లేదని చెప్పి నిన్న మధ్యాహ్నమే ఆవిడను కైలాసు ఆస్పత్రి నుండి పంపించివేశారు. తన తోటివాళ్ళ, స్నేహితుల మధ్యే తన తుదిశ్వాస విడవాలన్నది ఆమె కోరిక. ఆమెకు ఇల్లూవాకిలీ, కుటుంబం అన్నీ ఆశ్రమమే. రాత్రి భోజనానికి ముందు ఛటర్జీ దీదీని వరుసగా పెద్దవాళ్ళందరూ చూడటం వీలుకాదు కాబట్టి 'గంటన్నరపాటు ఆమెగది ముందు కూర్చుని భజన చెయ్యండి' అని సావిత్రిగా

రి ఆదేశం.

అందరూ భక్తిపారవశ్యంతో భజన చేశారు. ఇంతలోనే 'ఛటర్జీదీదీ కళ్ళు తెరి చారు' అని ఆనందాతిశయంతో విమలగారు అరిచారు.

'ఆమె ఏదో చెప్పాలనుకుంటోంది. తెల్లగా పాలిపోయిన ముఖం, ఎండిపో యిన పెదవులు.. అస్పష్టంగా ఏదో గొణు గుతున్నట్లున్నాయి. బహుశా తులసీదళం నోట్లో పెట్టి గంగాజలం పోయమని చెబు తున్నారనుకుంటాను. పుణ్యస్త్రీ అంతకన్నా ఏమి చెబుతుంది? వెళ్ళండి, త్వరగా వెళ్ళండి. వెళ్ళి, తులసీదళం, గంగాజలం వెంటనే తీసుకురండి" అందామె.

గంగాజలం తెచ్చేవరకు విమలగారు ఛటర్జీ దీదీ పెదవుల దగ్గర చెవులు పెట్టి జాగ్రత్తగా వినటానికి ప్రయత్నించారు.

తనను వదిలివేసిన కొడుకు పేరును ఆమె కలవరిస్తున్నది. 'శ్యా... మూ...ము...శ్యా...ము..శ్యా..'

విమల ఈ విషయం చెప్పిన వెంటనే ఒక్కసారిగా పెద్దవాళ్ళందరికీ మతిపోయి నట్లయింది. 'తాను మరణిస్తే దహన సంస్కారాలు ఎవరితోనైనా చేయించండి గాని అయోగ్యుడయిన నా కొడుక్కు మాత్రం కబురు పెట్టకండి' అని ఆమె ఎప్పుడూ చెబుతూండేది.

గుమిగూడిన జనం మధ్య వేడెక్కిన వాతావరణం వాళ్ళల్లో ఆలోచనాశక్తిని నశింపజేసింది. ఇంతలో మండిపడుతున్న సావిత్రి ముఖం చూడగానే ఇంకేదో విషయం వున్నదని గ్రహించారు.

సావిత్రి దృష్టి గుంపును చీల్చుకుంటూ సుందరి మీద పడింది. వయస్సులో ఆమె కన్నా చిన్నదయినప్పటికీ ఆమె తన కోపాన్ని అణిచిపెట్టుకోలేకపోయింది, బహుశా ఆశ్రమ మేనేజరు అయినందు వల్ల కూడా కావచ్చు.

"చీకట్లో వెళ్ళటం మీకే మంచిది కాదు. మంచీ చెడూ లేకుండా ఏమిటి? "

పనివాళ్లందరికీ నాయకత్వం వహిస్తూ నిలబడ్డ సుందరిని గట్టిగా మందలిస్తూ సావిత్రి ఇలా అంది- "గదిలో పడివున్న ఛటర్జీదీదీ చివరి ఘడియలు లెక్కపెడు తుంటే, నీవు ఇక్కడ కసాయి హృద యంతో ఆమెను ఒంటరిగా వదిలి ధర్నా చెయ్యటానికి వచ్చావన్నమాట. పనిదొరికి నాలుగు రోజులన్నా కాకముందే నీకు పొగరు తలకెక్కింది. ఇప్పుడే ఈ క్షణమే నిర్ణయం తీసుకో.. అసలు నీకు పనిచె య్యాలని వున్నదో.. లేదో చెప్పు? "

ఆ మందలింపుతో గాబరాపడ్డ సుందరి వెంటనే గుంపు నుండి బయటపడి లోప లివైపుకు నడిచింది. విషయం ఏమిటో అడిగిన తరువాత తెలిసింది. ఆశ్రమం వంటవాడితో సహా ఏడుగురు ఆడ-మగ పనివాళ్ళు, రామేశ్వరం పక్షాన నిలబడి ధర్నా చెయ్యటం మొదలుపెట్టారు. పద మూడో నంబరు గదిలో వుండే శివదా సానీ గంటముందు సాయంకాలం ఇచ్చే టీ బదులుగా ఒక గ్లాసు పాలు ఇవ్వమని అడిగారని రామేశ్వరం ఫిర్యాదు. దానితో పాటు ఒకటి రెండు బిస్కెట్లు కూడా. రామేశ్వరం పాలగ్లాసుని మంచానికి ఆను కుని వున్న బల్లమీద పెట్టిన వెంటనే శివ దాసానీ క్రూరంగా.. మరిగిన పాలగ్లాసును అతనిమీద గు మ్మరించారట. రామేశ్వరం ఛాతి కాలిందట. 'దయలేని ఈ ముసలి వాడు నా ప్రాణాలు తీశాడు' అని ఏడుస్తూ.. అరుపులు కేకలతో వృద్ధుల ఆశ్రమంలో వుండేవాళ్ళందర్నీ తనవైపుకు తిప్పుకున్నాడు.

బాధపడే పెద్దవాళ్ళందరికీ రామే శ్వరం.. పాలతో తడిసిన తన ఛాతిని.. మండిపోతోందని చొక్కావిప్పి చూపించసా గాడు. అతని ఛాతి అంతా నల్లని వెంట్రు

కలతో దట్టంగా వున్నది. అందుచేత కాలిన ఎరుపు కనిపించదు. కనిపిస్తే శివదాసాని నిర్దయత ఎంత అనేది అంచనా వేయవచ్చు.

సమస్య సాధారణమైనదీ కాదు, అణిచి వేయగలిగినదీ కాదు. శివదాసానీ కోపాన్ని గురించి వాళ్ళు వాదిస్తారు. అప్పటికప్పుడు పనివాళ్ళందరూ మూకుమ్మడిగా పనిచెయ్యటం మానివేశారు.

మంచంపట్టిన ముసలివాళ్ళ మలమూత్రాలను పట్టే మనీసురు చెయ్యి తిప్పుతూ ఏదేదో వాగటం మొదలుపెట్టాడు.

"ఒకవైపు మేము శ్మశానంలో కాలు

కొత్తగాలి...

**హరి**
**సిరికిం జెప్పడు**
**పతి**
**సతికిం జెప్పడు**

- యు. చిట్టిబాబు,
న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

పెట్టి.. ఈ ముసలివాళ్ళకు తల్లిదండ్రులను మించి శారీరకంగా, మానసికంగా సేవచెయ్యాలి. పైగా వీళ్ళ భస్మాసుర క్రోధాన్ని భరించాలి. వీళ్ళ కన్నవాళ్లే వీళ్ళ మలమూత్రాల్ని ఎత్తటానికి సిద్ధంగా లేరు. ఎవరయితే ఎత్తుతున్నారో వాళ్ళమీదే దౌర్జన్యం చేస్తారా? "

పరిస్థితిని చూచి బాధపడి సావిత్రి పెద్దవాళ్ళను కోప్పడ్డారు- "మీరు పనివాళ్ళను.. నమ్మకమైనవాళ్లుగా ఎందుకు భావించరు? డబ్బే ప్రధానం కాదు. వాళ్ళల్లో మిషనరీ భావమే గనుక లేకపోతే మీరు గంటకొట్టగానే తిండీ తిప్పలూ మానివేసి ఉన్నఫళంగా చెయ్యి కట్టుకుని మీ ముందు ఎందుకు హాజరవుతారు? "

పనివాళ్ళను బుజ్జగించటంలో సావిత్రి ఉద్దేశం తెలియంది కాదు. పనివాళ్ళతోకను సవరించనిదే తలెత్తిన సమస్య నుండి బయట పడటం అంత తేలికైన పనికాదు.

పెద్దవాళ్ళను వదిలేసి ఆమె.. గాయపడ్డ రామేశ్వరంవైపు వెళ్ళారు.

నటనానుభవం వున్న అభినేత్రిలాగ "రామేశ్వర్! నేను నిన్ను ఒక్కమాట అడుగుతాను, సమాధానం చెప్పు. శివదాసానీ స్థానంలో మీ నాన్నే వుంటే నీవు ఇలానే ప్రవర్తించి వుండేవాడివా? వెళ్ళు. హాస్పిటల్ తెరిపించి సబ్బర్‌లాల్‌కి చూపించి మందు తీసుకో. అవసరమనుకుంటే ఇంటికి వెళ్ళి విశ్రాంతి తీసుకో. నీ బదులుగా శివశంకరు ఈరోజు నైట్ డ్యూటీ చేస్తాడు" అంటూ ఆమె రామేశ్వరం భుజాన్ని తట్టారు.

"ఆ.. ఆ.. ఇప్పటికే చాలా టైమ్ అయింది. వెళ్ళండి. వెళ్ళి మీ మీ పనులు చూసుకోండి"

"అవును, అందరూ వినండి. నిన్నటిలాగే ఈరోజు కూడా భోజనానికి ముందు అందరూ కలసి ఛటర్జీగారికోసం భజన చెయ్యాలి"

రామేశ్వర్ మౌనాన్ని అంగీకారం అనుకుని పనివాళ్ళంతా ఒక్కొక్కళ్ళుగా జారుకోవటం మొదలుపెట్టారు.

వృద్ధుల ముఖం ముడతల్లో అలుముకున్న నిస్పృహ వాళ్ళని వదిలి వెళ్ళిపోవటానికి రాజీ పడటంలేదు.

సుమారు తొంభై ఏళ్ల వయస్సుగల కమలేష్‌ని సావిత్రి సరిగ్గా చూడలేదు. వంగిన నడుముతో, పూడుకుపోయిన గొంతుతో ఆమె శివదాసానీ తరపున మాట్లాడటానికి ముందుకు వచ్చారు.

వెళ్ళటానికి సిద్ధంగా వున్న రామేశ్వరంను ఆపి ఆమె, "నీవు ఈ ఒక్క ప్రశ్నకు

సమాధానం చెప్పు. శేరావలీ అమ్మ నీకు వంద రూపాయలు ఇచ్చింది. పాలు ఎంత వేడిగా తెచ్చావు"

"మరుగుతున్న పాలు"

"మరిగే పాలగ్లాసును నీవు ఎలా తెచ్చావు? "

అనుకోని ఈ ప్రశ్నకు రామేశ్వరం తెల్ల బోయాడు, "కండువాతో చుట్టుకుని"

"నీవేమో గ్లాసుని పంచెలో చుట్టుకుని పట్టుకొచ్చావు. తమ్ముడేమో వట్టిచేత్తో గ్లాసుని పట్టుకుని వెంటనే నీమీద గుమ్మ రించారు"

ఏడుపు ముఖంపెట్టి రామేశ్వరం జారు కోబోయాడు.

"మీ ఉద్దేశం.. నేను అబద్ధం చెబుతు న్నాననా? "

"లేదు కొడకా లేదు. నీవు అబద్ధం చెప్పటం లేదు. పాలకింద నీవు కొంచెం ఎక్కువ మంటపెట్టావని అంటున్నాను. అంతే"

అక్కడ నిలబడ్డ వాళ్ళందరూ ఒక్కసా రిగా నీరసపు నవ్వు నవ్వారు.

శివదాసానీ గది నుండి తన గదిలోకి వెళ్ళే సచ్‌దేవ్.. మంచంమీద అసహనంగా కూర్చునున్న శివదాసానీ పరిస్థితిని చూసి, తప్పనిసరై ఆయన గదిలోకి వెళ్ళారు.

ఆయనకు శ్వాస ఎక్కువగా వున్నది.

రొప్పుతూ వున్న ఆయన, మంచం మీద కూర్చోమని కళ్ళతోనే సైగ చేశారు. అడి గిన వెంటనే ఆయన బాధనంతా వెళ్ళగక్కారు.

"నేను ఎంత నచ్చజెప్పినా రామేశ్వరం ఈ మధ్య బాగా విసిగిస్తున్నాడు. గోరువె చ్చని పాలు తెమ్మని అడిగితే ఫ్రిజ్‌లోని చల్లని పాలు తెచ్చి ఎదురుగా పెడతాడు. వీటిని కొంచెం వేడి చేసుకుని రమ్మనమని చిన్నపని చెప్పినా.. వాడికిష్టం లేకపోతే.. వంటింట్లో పొయ్యి ఖాళీ లేదని కచ్చితంగా చెప్పేస్తాడు. జావ కావాలా, కార్న్‌ఫ్లేక్స్ కావాలా అని అడగటానికి ఉదయమే వస్తాడు. జావ కావాలి అని చెబితే గంట తరువాత వచ్చి 'జావ అయిపోయింది. కార్న్‌ఫ్లేక్స్, పాలు కావాలనుకుంటే తెస్తాను. లేకుంటే.. లేదు' అంటాడు.

అవసరం ఏ పనైనా చేయిస్తుంది.

ఈ రోజు వాడు అదేపని చేశాడు. పాలు కావాలని అడిగితే చల్లని పాలు తెచ్చిపెట్టాడు. వేడిచేసి తెచ్చిపెట్టమని అడి గితే ఆ పాతపాటే పాడటం మొదలుపె ట్టాడు. అంతే ఒళ్ళు తెలియని కోపం వచ్చింది. 'బహుమతి తీసుకో' అంటూ.."

ఇంతలోనే గొంతులోని మాటను..

## కొత్తగాలి...

**లంచం**
**అడుక్కునేవాడి కన్నా**
**అన్నం**
**అడిగేవాడే మిన్న**

– పెన్మెత్స సూరిబాబు,
హైదరాబాద్

సుళ్ళు తిరుగుతున్న శ్వాస గొంతులోనే మింగేసింది. శివదాసానీ గుడ్లు తేలేశారు. ఆయన బల్లమీద వున్న ఆస్త్మా పంపుని ఇవ్వమని సైగ చేశారు. నోటి దగ్గర గొట్టాన్ని పెట్టి శక్తికొలదీ పీలుస్తూ ప్రాణ వాయువుని ఊపిరితిత్తులలోనికి పంపించ టానికి శక్తికొద్దీ ప్రయత్నించారు. కొంచెం తేరుకోగానే ధైర్యం కోల్పోయిన పసిపిల్లవా డిలాగా ఏడవటం మొదలుపెట్టారు.

దగ్గరగా కూర్చుని ప్రేమగా ఆయన భుజాన్ని తట్టగానే శీతాకాలం చలిలా ఆయన శరీరం ఒణకసాగింది. ఆయన

మనసులోనే శివస్తోత్రం చేసుకోవటం మొదలుపెట్టారు.

రోజూ బాత్‌రూం తలుపు వేసేది మరచిపోవడం వల్ల వచ్చే పసుపుపచ్చని వెలుతురుకు తోడు నిద్రమాత్రలు మింగి, భయంకరంగా గురకతీస్తూ నిద్రపోయే కపూరువల్ల.. సచ్‌దేవ్ కునుకు తీయలేక పోయారు.

కాదు... కాదు... ఆయన ఏదో సాకు వెతుక్కుంటున్నారు. ఆయన మంచానికి గజం దూరంలో వెలుతురు ఎప్పుడూ మేలుకునే వుంటుంది. కపూర్ గురక చుట్టుపక్కల అంతా సరిగ్గానే వున్నదన్న నమ్మకం ఆయనకు కలిగిస్తుంది. ఆయన నిశ్చింతగా నిద్రపోవచ్చు. కానీ మనసులో మెదులుతున్న అధైర్యం ఏదో ఆయన్ని నిద్రపోనివ్వటం లేదు. బిల్లూ కారణంగా ఆయన అశాంతిగా వున్నారు. అందువల్లనే ఆయన కునుకు తీయలేకపోతున్నారు. ఎప్పుడు తెల్లవారుతుందా? ఎప్పుడు పొద్దెక్కుతుందా? అని చూడటం మొదలుపెట్టారు. షాపులు ఎప్పుడెప్పుడు తెరుస్తారా? ఎప్పుడు అట్లా మార్కెట్‌కి వెళ్లి బిల్లూకి ఇష్టమైన క్రికెట్ బ్యాటు, బంతికొని ఎప్పుడెప్పుడు వాడిని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తుదామా? అని ఆయన మనసు ఆరాటపడుతోంది. ఆ పసివాడు పాపం తాతగారు తనకోసం కనీసం బ్యాటు-బంతి అయినా తెచ్చి ఇస్తారని అమాయకంగా చూస్తూ వుంటాడు.

గుండ్రని ముఖంమీద ఒత్తయిన ఉంగరాల జుట్టు ఎంత అందంగా వున్నది!

విధి చాలా బలీయమైనది. క్రికెట్ కిట్ తోపాటు బిల్లూకి టోపీ కూడా కొనాలి. గవాస్కర్ కొడుకు రోషన్‌గవాస్కరు టోపీ పెట్టుకుని టీవీలో కనిపిస్తాడే.. సరిగ్గా అలాంటి టోపీయే కొనాలి.

డాక్టరమ్మకు కూడా ఏదైనా తీసుకువెళ్ళాలి. హల్దీరామ్ నుండి జీడిపప్పు లేదా పిస్తాబర్ఫీ తీసుకోవాలి. బిల్లూ కూడా ఇష్టంగా తింటాడు.

మనసు పరుగులు పెడుతోంది. కానీ ఇవన్నీ కొనటానికి తన దగ్గర డబ్బు ఉన్నదా?

అలమారా తెరిచి కూడబెట్టిన డబ్బులు లెక్కపెడితే పోలా! మూడు వేరు వేరు చోట్ల డబ్బు చాలా భద్రంగా దాచారు. కోటు లోపలి జేబులో ఒకచోట, ఆహా..అలమారా మధ్యఅరలో పేపరు మడతల్లో ఒకచోట, మూడోచోట.. అంటించిన కవర్లో ఉత్తరాల మధ్య ఉన్నాయి ఐదువందల నోట్లు ఐదు పెట్టారు.

ఈ మాత్రం జాగ్రత్త ఆయనకు చాలా అవసరం అనిపిస్తుంది. నాలుగైదు నెలలకిందటి మాట ఇది. షికారు వెళుతున్నపుడు అలమార తాళంచెవి గదిలోనే మర్చిపోయి వెళ్లారు. తిరిగి రాగానే పర్సు తీసి వెదికారు. అతికష్టం మీద మాసిపోయిన ఏడువందల రూపాయలు దొరికాయి.

లేచి, తల దగ్గర పెట్టిన తాళంచెవి వెదికారు. చాలా జాగ్రత్తగా తాళం తిప్పి అలమార తలుపు తెరిచారు. బాత్‌రూంలో నుంచి కనిపించే మసకవెలుతురులో మూడు అరలు వెదికారు. దాచిన సొత్తు భద్రంగా వున్నది.

అలమార మూసి ప్రశాంతంగా మంచం మీద పక్కకు తిరిగి పడుకున్నారు. పాపం బిల్లూ బంతి విషయం ఆయన చెవుల్లో గింగురుమంటోంది. కళ్లు మూసుకుపోతున్నాయి.

మెలకువ వచ్చి చూస్తే, తొమ్మిదింపావు వరకు నిద్రపోతున్న తనను చూసి కపూరు బాధపడుతున్నాడు.

లేచి కూర్చోగానే తుపాకి గుండు వదిలినట్లు ప్రశ్న, "మీ ఆరోగ్యం బాగానే వున్నది

కదా? "

ప్రశ్నకు బదులుగా సచ్‌దేవ్ కూడా ప్రశ్నించారు, "కపూర్! ఒక్కమాట చెప్పు. మనిషి చాలాసేపు ఎప్పుడు నిద్రపోతాడు? "

"తియ్యటి కలలు కంటూ వున్నపుడు"

"అయితే, నేను ఆరోగ్యంగానే వున్నాను, తెలిసిందా? "

ఒక్కక్షణం వరకు కపూర్‌కి ఏమీ తోచలేదు. రెండో నిమిషంలోనే తేరుకుని సహజ ధోరణిలోనే అన్నారు, "మీరు చాలా లేటుగా లేచారు. వెంటనే కాలకృత్యాలు తీర్చుకుని రెడీ అవ్వండి. టిఫిన్ చేయండి, టీ తాగండి. నేను తినేశాను"

"ఎందుకు? "

"సావిత్రి ఆదేశం"

"ఆశ్రమానికి ఎవరయినా మినిస్టరు వస్తున్నారా? "

"లేదు సోదరా!"

"అయితే ఈ హడావుడి అంతా దేనికి? "



"హడావుడి.."

"అంటే..?" ఆయన పట్టుబట్టారు.

"ఛటర్జీ దీదీ!" కపూరు గొంతు పూడుకు పోయింది.

"అయ్యో పాపం"

అయ్యో అనే పెదవుల మధ్యనుంచి సానుభూతి మౌనంగా వెలువడింది.

చాలాసేపటివరకు ఆయన పిల్లను పోగొట్టుకున్న పిల్లిలాగా మౌనంగా రోదిస్తూ ఉండిపోయారు.

కపూరు.. ఆయన్ని ఆ స్థితి నుండి బయట ప్రపంచంలోనికి తీసుకురావటానికి ప్రయత్నించారు.

సావిత్రి చండీగఢ్‌లో వుంటున్న ఛటర్జీ కొడుకుతో మాట్లాడారు. కొడుకు స్పష్టంగా చెప్పేశాడు, "ఏమేమి చెయ్యాలో అన్నీ ఆశ్రమంలోనే చెయ్యండి, ఆమెను చండీగఢ్ తీసుకువచ్చే ప్రశ్నే లేదు. బదిలీలు వున్న ఉద్యోగం అవ్వటం వల్ల నాకంటూ సొంత ఇల్లు ఏమీ లేద" అని. సొంత ఇల్లు వుంటే తాను, తన తల్లిని ఇంటికి తీసుకువెళ్ల గలడట. పన్నెండు- ఒంటి గంటకు మధ్య అతడు ఆశ్రమానికి చేరుకుంటాడట. దహన సంస్కారాలు ఎప్పుడు చేసేది నిర్ణయించేశారు, మధ్యాహ్నం ఒకటిన్నరకు.

సావిత్రి అందరికీ గట్టిగా చెప్పారు, "పెద్దవాళ్లు ఎవ్వరూ ఆకలితో వుండకూడదు. పన్నెండూ ఒంటిగంట మధ్య అందరూ భోజనాలు ముగించండి. మందులు వేసుకోండి. ఒక గంట విశ్రాంతి తీసుకోండి"

'వంటవాడి ముఖం సంతోషంతో పొంగిపోయింది' అని కపూరు చెప్పారు. సావిత్రి చాలా విచిత్రమైన మనిషి అని బాధపడసాగారు. ఇలాంటి మాట ఎప్పుడయినా ఎవరయినా విన్నారా? ఇంట్లో శవాన్ని పెట్టుకుని ఎవరయినా పొయ్యి రాజేస్తారా! మైలతో భోజనం ఎవరు చేస్తారు?'

సావిత్రి అతణ్ణి గట్టిగా కోప్పడ్డారు "అందరూ చేస్తారు. రోజూ లాగానే టీ- టిఫిను- భోజనం అన్నీ తయారు చేస్తున్నారు. ఎవరు తినకూడదనుకుంటున్నారో వాళ్లు తినటం మానెయ్యండి. పెద్దవాళ్లం దర్నీ ఆకలితో వుంచి వేరే అపదను కొని తెచ్చుకోవాలనుకోవటం లేదు"

కపూరు స్వరంలో మనోబలం వుంది

"అప్పటికి వచ్చేస్తారు. టిఫిన్ కోసం గంట కొట్టనా?"

"వద్దు" కపూరుని మరి మాట్లాడకుండా ఆయన విదిలించి వేశారు. వంటవాడి మాట ఆయనకు తప్పుగా ఏమీ అనిపించ లేదు.

కపూరు ఎలా టిఫిన్ చేయగలిగాడు? అయిదారుగంటలు నీళ్లు తాగి తేలిగ్గా గడిపేయొచ్చు. ఇది మామూలురోజు కూడా కాదు. సావిత్రి చెప్పినంత మాత్రాన ఏమవుతుంది?

మానవత్వం లేని కుటుంబసభ్యులు ఛటర్జీఅమ్మ మరణాన్ని తేలిగ్గా తీసుకుంటే? తీసుకుని ఉండొచ్చు అంతమాత్రాన ఇది సాధారణమైన విషయం అయిపోదు. ఆమెతో వున్న సంబంధ- బాంధవ్యాలన్నీ ఈ రోజుతో ముగిసిపోయాయి. నిన్నటివరకు తమతోపాటు కలిసివున్న వ్యక్తి కష్టసుఖాల్లో పాలుపంచుకున్న మనిషి పోతే ఆమెకు వీడ్కోలు చెప్పకుండానే.. ఎవరికయినా నోట్లో ముద్ద ఎలా దిగుతుంది?

పేపరు తెరిచి కూర్చున్న కపూరువైపు ఆయన చాలా నిర్లిప్తంగా చూశారు. తరువాత బల్లమీద పెట్టిన జగ్ నుండి గ్లాసులోకి నీళ్లు పోసుకుని తాగారు. లేవగానే రెండు గ్లాసులు నీళ్లు తాగకపోతే ఏ పనీ చెయ్యలేరు. ఎప్పటినుంచో వున్న అలవాటు. ఆయన నీళ్లు తాగటం చూసి కపూరు పేపరు చదవటంలో మునిగిపో

# మనసున ఉన్నదీ...



★ డిసెంబరు 'చతుర' నవల శ్రీమతి ఆశా ప్రభాత్ 'నేను-అతను!' వినూత్న కథాంశంతో ఏకబిగిన చదివించింది. వివాహేతర సంబంధాల ముగింపును కొత్తకోణంలో చూపించి ఆకట్టుకుంది. భర్త, పిల్లలతో ఒకవైపు అనురాగబంధం ఉంటుంది. మరోవైపు పర పురుషుడి వ్యామోహబంధం లాగుతుంటుంది. ఈ రెంటి మధ్య సంఘర్షణను రచయిత్రి హృద్యంగా చిత్రించారు.

– **సూరి నాగరాజు**, రామవరప్పాడు.

★ 'చతుర' డిసెంబరు సంచికలోని నవల 'నేను-అతను!', కథ 'ఎదురు చూపులు'- స్త్రీపురుష సంబంధాలను, మహిళల మనస్తత్వాన్ని సునిశితంగా విశ్లేషించాయి. హద్దుమీరిన స్వేచ్ఛ, ఆత్మాభిమానాల పర్యవసానాలను ముక్త, అళగమ్మాళ్ జీవితాల ద్వారా చక్కగా చిత్రించారు. నేటి మహిళలకు సరైన అవగాహన కల్పించేలా ఇవి ఉన్నాయి. ఇవి వాస్తవానికి అనువాదాల్లా కాకుండా తెలుగు రచనల్లా ఉండి హాయిగా చదివించాయి.

– **నండూరి నాగేశ్వరరావు**, హైదరాబాద్

★ అందాల తార 'దీక్షాసేథ్' ముఖచిత్రంతో వెలువడ్డ 'చతుర' ఎంతో ఆకట్టుకుంది. ముఖ్యంగా 'నేను- అతను!' నవల ఆద్యంతం చదివించింది. కర్నాటి నాగభూషణంగారి అనువాద శైలీ చాలా అద్భుతంగా ఉంది. స్త్రీ స్వేచ్ఛ నేపథ్యంలో మానవ సంబంధాల్ని చిత్రించిన తీరు అమోఘం.

– **భాగ్యలక్ష్మీ**, పొన్నూర్

★ నాటి చలం 'బ్రాహ్మణీకం' నుంచి, 'నేను-అతను!' నవలదాకా ఎంతోమంది స్త్రీల జీవితాల్ని చిత్రించారు. నిజానికి ఇక్కడ స్త్రీ మోసపోవడమంటూ ఏమీ లేదనిపిస్తోంది. ఎవరి అవసరం, పరిస్థితులను బట్టి వారు తమ జీవితాల్ని కొనసాగిస్తారు. ముక్త పరపురుషుడి మోజులో పడి ఎంత పోగొట్టుకున్నా, చివరకు తన జీవితాన్ని తానే స్వయంగా మలచుకున్న తీరు ఆకట్టుకుంది. శృంగార వర్ణనపాలు కొద్దిగా ఎక్కువైందనిపించింది.

– **వి.వి.ఎస్. ప్రసాద్**,

నవులూరు, గుంటూరు జిల్లా

★ డిసెంబరు 'చతుర' నవల 'నేను- అతను!'లో చిత్రించిన వ్యక్తులు సమాజంలో ఉన్నప్పటికీ, అలాంటి రచన చతురలో ప్రచురించటం ఔచిత్యంగా లేదనిపించింది. 'ఎదురు చూపులు' పెద్దకథ చాలా బాగుంది. 'చతురప్రపంచం', 'జ్ఞానపీఠాలు' ఆసక్తికరంగా ఉంటున్నాయి. అమెరికా గురించి అసలైన నిజాలను తెలియజేస్తూ సాగుతున్న 'హాహా.. అమెరికా' కొత్త ఆలోచనల్ని రేపుతోంది. 'కొత్తగాలి' కవితలు పదేపదే చదివేలా చేస్తున్నాయి.

– **మంచాళ శ్రీలక్ష్మి**, విశాఖ

★ డిసెంబరు 'చతుర' నవల 'నేను- అతను!'లో ముక్తపాత్ర ద్వారా చపల చిత్తుల జీవితం ఎన్ని మలుపులు తిరుగుతుందో చెప్పిన తీరు చాలా బాగుంది. సత్యేన్ విశాల హృదయాన్ని, ముక్త పశ్చాత్తాపాన్ని బాగా చిత్రించారు. స్త్రీ జీవితంలో అన్నీ ఎదురుచూపులుగా మిగిలిపోయిన వైనాన్ని 'ఎదురుచూపులు' కథ బాగా వివరించింది.

– **అప్పల నరసింహం**, హైదరాబాద్

★ 'చతుర'లో నిర్వహిస్తున్న 'చతురంగం' క్రమం తప్పకుండా గమనిస్తున్నాను. కొన్ని పదాలు అటు నుంచి ఇటు, గజిబిజి కావడం కనిపిస్తోంది. ఇతర పదాల గళ్లతో సరిపోని పరిస్థితుల్లో ఇలా మారిస్తే అర్థం చేసుకోవచ్చు. కానీ ఎక్కువ శాతం ఇలా ఉండటం సమర్థనీయం కాదు. పదకేళుల మీద నాకుండే ఆసక్తి కొద్దీ ఈ ఉత్తరం రాశాను.

– **సి.హెచ్.వి. బృందావనరావు**, విజయవాడ

**చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082**

**ఈ మెయిల్ :**

**vipula.chatura@eenadu.net**

యారు.

"భజన మొదలవ్వటానికి ఇంకా అర్ధ గంట టైము వుంది"

కాలకృత్యాలు ముగించుకుని కపూరుతో పాటు దేవ్ భజన గదిలోకి వచ్చారు.

పూలతో నింపిన ఛటర్జీని మంచు పలకలమీద పడుకోబెట్టారు. చలికాలం. మంచు పలకలమీద పడుకోబెట్టాల్సిన అవసరం లేదు. మరి ఎందుకు పడుకోబెట్టినట్టు? ఆయనకు ఆశ్చర్యం వేసింది. ఛటర్జీ కొంపదీసి రాత్రిగాని మరణించలేదు కదా?

భజన బృందం కింద కూర్చున్నారు. వాళ్లతోపాటు కొంతమంది వృద్ధులు కూడా వున్నారు. కాని ఎక్కువమంది కుర్చీల్లోనే కూర్చున్నారు. కింద కూర్చుని లేవటం వాళ్లవల్ల అయ్యే పనికాదు. శోకంతో నిండిపోయిన వాళ్ల ముఖాలు మెడమీద వేలాడుతున్న మృత్యువు పిలుపు కోసం నిరీక్షిస్తున్నాయా? అన్నట్లు వున్నాయి.

బెంగాలీ భాషలో భజన చేస్తున్నారు. వాళ్ల చేతులు మాత్రం తాళం వేస్తున్నాయి. రెండున్నర గంటలకు దహన సంస్కారాలు.. అంటే.. శ్మశానం నుండి వచ్చి, స్నానపానాదులు ముగించుకునేసరికి సాయంకాలం అవుతుంది.

ఈరోజు సాయంకాలం షికారుకు వెళ్లటం అసంభవం.

బిల్లూ కర్ర బుడుపుమీద ఎక్కి ఎగిరి ఎగిరి ఫెన్సింగ్ మీద నుండి 'తాత ఎందుకు రావటం లేదు' అని.. నాకోసం ఎదురుచూస్తూ వుంటాడు.

గదిలో వుండగా కపూరు చెప్పాడు, ఆశ్రమం అంబులెన్స్‌లో ఛటర్జీని తీసుకు వెళతారనీ. శవంతోపాటు వెళ్లే వాళ్ల కోసం సమరవిల్లా స్కూలునుండి బస్ తెప్పించు తున్నారు. సరిగ్గా రెండు గంటలకు ఆశ్రమంలో బస్ వుంటుంది. చివరి వీడ్కోలు చెప్పాలన్న తలపు ఆయనకు గట్టిగా వుంది. బస్‌లోకి ఎక్కగలరో లేదోనన్న అనుమానం కూడా ఆయనకు కలిగింది. ఛటర్జీ ఎప్పుడూ తనను కోప్పడుతూ అంటూ వుండేవారు, 'కపూర్! వృద్ధాప్యంలో లావెక్కడం మృత్యువుకి పిలుపు' అని. 'రెండు పూటలా ఎక్కువ దూరం నడవండి. సాయంకాలం మాత్రం నడిస్తే చాలదు' అని. బలహీనమవుతున్న కాళ్లు శరీరభారాన్ని ఎంతకని మోస్తాయి?

దేవ్ మంచంమీద కాళ్లు చేతులూ వేళ్లాడేసుకుని పడుకున్నారు. మనసంతా వికలమైపోయింది.

కపూరు కిచిడీ తింటున్నాడు. కిచిడీ మాత్రమే చేశారు. ఈరోజు భోజనాలు, డైనింగ్ రూములో గాక ఎవరి గదుల్లో వాళ్లకు ఏర్పాటు చేశారు. అలానే మంచం పట్టిన వృద్ధులకు ఎలానూ వాళ్ల గదుల్లోకే భోజనాలు పంపించే ఏర్పాటు వుంది. రామేశ్వరం ఆ ఏర్పాటుల్లోనే తలమునకలై వున్నాడు.

ఈరోజు అన్నం తినకపోవటం సమంజసమే కానీ, మందులు వేసుకోవటానికి ఒక కప్పు పాలు కావాలి కదా? పాలు-నీళ్లు ఒకేలాగా వుంటాయి. తేడా ఏమీ వుండదు. అలాంటివి కనిపెట్టడంలో రామేశ్వరం దిట్ట. దీపావళి బహుమతిగా

**కొత్తగాలి...** 

**సాంకేతిక పరిజ్ఞానం**
**రోజురోజుకీ పెరిగిపోతోంది**
**మానవత్వం ఉనికి**
**నానాటికీ తరిగిపోతోంది**

– నెమలిదిన్నె రమణారెడ్డి, పోలవరం, ప్రకాశం జిల్లా

ఇచ్చిన రెండు ఖద్దరు చొక్కాలు అలాగే వున్నాయి. అటుకులు, హల్వా మొదలైనవి బాబాయి కూతురు పండుగకు తీసుకుని వచ్చి ఇచ్చింది. పండుగ చొక్కా ఆయనకు బాగా నచ్చింది. రెండోవారంలో రెండు చొక్కాలు పంపించింది. ఇప్పుడు నాలుగు జతలకన్నా ఎక్కువ బట్టలుంటే ఆయన సర్దుకోలేకపోతున్నారు. రాజీ అయితే తనను పనికిరానివాడిగా తయారుచేసింది.

కళ్లు మూసుకోబోతున్నంతలోనే, ఆశ్రమంలోకి బస్ వచ్చిందన్న రామేశ్వరం కేక తనను తట్టి లేపింది.

గదినుండి ఎప్పుడూ బయటకు రాని పెద్దవాళ్లందరూ బయటకు రావటం చూసి ఆశ్చర్యపోయాడు. మహా అయితే వాళ్లందర్నీ గది ముందు వున్న కుర్చీలో ఎప్పుడోగాని కూర్చుని వుండగా చూడటం జరుగుతుంది.

ఛటర్జీ దీదీని అంబులెన్స్‌లో ఎక్కించటానికి ముందు ఆశ్రమం ఆవరణలో వుంచారు. రెండు బుట్టల గులాబి రేకుల్ని బయటినుండి తెప్పించారు. ఆశ్రమంలోని చెట్లూ చేమా కూడా ఆమె అంతిమ సంస్కారానికి సహాయపడ్డాయి.

తనతోటి ఆత్మీయురాలికి అశ్రు-పుష్పాంజలి సమర్పించటంలో 'విష్ణు' సహాయపడుతున్నాడు. తలవైపు నిలబడ్డ వాళ్లలో ఛటర్జీ.. కొడుకు శ్యామలరావు ఎక్కడా అని వెదుకుతున్నారు సచ్‌దేవ్. పరిచయం లేని బెంగాలీ వాళ్ల ముఖాల మధ్య శ్యామలరావుని గుర్తుపట్టటం అసాధ్యమనే అనిపిస్తున్నది. స్మశానంలో దహన సంస్కారాలు చేసేటప్పుడే అతన్ని చూడాలి. కపూరు తన భుజానికి దగ్గరగా వచ్చి అటూ ఇటూ వూగుతూ భారాన్ని తగ్గించుకునే ప్రయత్నంలో వున్నారు.

అతను పరిశీలనగా చూసి గమనించాడు. గంగాస్నానం చెయ్యటానికని తీర్థయాత్రలకు వెళ్లినపుడు ఛటర్జీ తెచ్చి ఇచ్చిన మఫ్లర్ కాదు.. కపూరు మెడలో వున్నది!

కపూరు మొండితనం ముందు తాను ఓడిపోక తప్పలేదు. విష్ణు, కపూరు కలసి తనను బస్సులోకి కష్టపడి ఎక్కించారు. బస్సులోనివాళ్లు తనను లోపలికి లాగారు.

దేవ్.. కపూరు పక్కనే కూర్చుని వున్నారు. వృద్ధుల మేళం కదా! అందుచేత కూర్చోవటానికి ఇరవయి నిమిషాలు పైనే పట్టింది. అప్పటివరకు అంబులెన్స్‌ని ఆపి వుంచారు. బస్ డుర్... డుర్‌మనగానే అంబులెన్స్ ముందుకు కదిలింది. బస్ ముందు అంబులెన్స్‌ని పెట్టారు. సోదరి కమలేష్ రామనామ సంకీర్తనం చేస్తూ అందర్నీ రామనామం చెప్పమన్నారు.

పూడుకుపోయిన గొంతులతో అదే లయతో రామనామ సంకీర్తనం చెయ్యటం మొదలుపెట్టారు.

అంబులెన్స్ ఆశ్రమం బయటకు వచ్చి ఎడంవైపు తిరగబోతుండగా, అకస్మాత్తుగా దేవ్ తన సీటు నుండి గాభరాగా లేచి చెయ్యి ఊపుతూ డ్రైవర్ని పిలిచి చెప్పారు "డ్రైవర్! దయచేసి బస్ ఆపండి"

ముందు కూర్చున్నవాళ్లు కూడా ఆయన మాటలో మాట కలిపారు. ఆయన తన సీటు నుండి లేచి బయటకు వెళ్లబోతుండగా కపూరు ఆయన చొక్కా పట్టుకొని లాగారు, "సోదరా! మీరు బస్‌ని ఎందుకు అపమన్నారు."

"నేను దిగిపోవాలి"

"ఏమన్నా మర్చిపోయారా? "

"లేదు. అలా మార్కెట్‌కి వెళ్లాలని నాకు గుర్తుకు వచ్చింది"

"అ... ట్టా... దేనికి.. సోదరా? "

కానీ దేవ్ అతనికి జవాబివ్వటానికి ఆగకుండా, కంగారుగా బస్‌లో నుండి దిగిపోయారు. ఆయన దిగిన వెంటనే డ్రైవర్ బస్‌ని ఎడంవైపుకి తిప్పాడు. ©

గతనెల పజిల్ పూరించి, అన్నీ సరైన సమాధానాలు రాసినవారిలో డ్రా ద్వారా ఎంపికైన విజేత

**విజయకృష్ణ**
ఫ్లాట్ నెం. 303,
ఈశ్వరీ ఎన్‌క్లేవ్, ప్రశాంత్‌నగర్,
ఎ.ఎస్.రావు నగర్, సికింద్రాబాద్
పిన్ : 500062

వీరికి రూ. 150/- త్వరలోనే అందుతాయి.

## చతురంగం - 9 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 పె | 2 ద్ద | 3 న | | 4 చ | 5 తు | 6 ర | | 7 శ్రీ | శ్రీ |
| 8 రు | గ | డు | డు | | 9 ల | క్ష | ణ | ము | |
| గు | | ము | | 10 దా | సీ | | | ఖం | |
| | 11 పృ | | 12 కాం | త | దా | 13 సు | 14 లు | | 15 హా |
| 16 గా | లి | 17 వా | న | | 18 సు | 19 మ | స్సు | న | లు |
| రా | | 20 రం | బ | అం | | 21 సౌ | బ | లు | డు |
| 22 బం | 23 దం | | క | | 24 కో | ర | | కు | |
| | తా | | 25 రం | 26 గు | | 27 భం | 28 కు | డు | 29 జ |
| 30 పా | వ | 31 డ | | 32 రి | 33 త్త | | ర | | డ |
| | 34 శం | వ | దే | | 35 అ | క్కా | చె | ల్లె | లు |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. పి. దేవసేనమ్మ, సిద్ధార్థనగర్,హైదరాబాద్, 2. కె. స్వరలయ, ఉడ్‌నగర్, చీరాల, 3. జె. విజయలక్ష్మి, ట్రూప్‌బజార్, హైదరాబాద్, 4. ఎ.వి.ఆర్. మూర్తి, హైదరాబాద్, 5. ఎస్. మనోరమ, చిక్కడపల్లి, హైదరాబాద్, 6. కె.వి.ఆర్. హనుమంతరావు, మంగాపురం, హైదరాబాద్, 7. కోనే నాగవెంకట ఆంజనేయులు, విశాఖ స్టీల్‌ప్లాంట్, 8. కె. వాణీ సుజాత, బ్రాడీపేట, గుంటూరు, 9. ఎ. సుబ్బారావు, బ్రాడీపేట, గుంటూరు, 10. జె.వి.వి. సత్యనారాయణమూర్తి, బీజాపూరు, 11. కె.వి.ఎస్.ఎన్. మూర్తి, విద్యుత్‌నగర్, విశాఖ, 12. గరిమెళ్ల సత్య, అలకాపురి, హైదరాబాద్, 13. అవ్వారి సామ్రాజ్యలక్ష్మి, మోతీనగర్, హైదరాబాద్, 14. బి. శ్రీనివాసరావు, చందానగర్, హైదరాబాద్, 15. యు. యు. యు, ఎమ్మిగనూరు, 16. బిక్కనూరి రాజేశ్వర్, పొన్కల్, ఆదిలాబాద్ జిల్లా, 17. భారతుల అరుణ, సౌత్‌లాలాగూడ, సికింద్రాబాద్, 18. తాజీ ప్రసాద్, టి. నగర్, చెన్నై, 19. గేదెల రామారావు, ఏలూరు, 20. జంధ్యాల లక్ష్మి, ఆనందబాగ్, హైదరాబాద్ 21. నందూరి నాగేశ్వరరావు, బేగంపేట,హైదరాబాద్, 22. ఎన్. కుసుమకుమారి, ఉమానగర్, హైదరాబాద్, 23. పి. వంశీకిషోర్, హన్మకొండ, 24. అవధానం రంగనాథం, అనంతపురం, 25. సాధనాల నాగవర్ధని, నూజివీడు, కృష్ణా జిల్లా, 26. వి. సీతానరసింహారావు, కరెన్సీనగర్, విజయవాడ, 27. సిహెచ్. సత్యనారాయణ, డి.డి. కాలనీ, హైదరాబాద్, 28. బి.ఎస్. రంగ, తాడేపల్లిగూడెం, 29. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 30. రావెల ఉషారాణి, గుంటూరు, 31. కె.ఎస్. ఆచార్యులు, విజయనగరం, 32. ఎ. రాధామాధవి, బ్రాడీపేట, గుంటూరు, 33. కూనపరెడ్డి సత్యనారాయణ, ఆమందూరు, చిత్తూరు జిల్లా, 34. సిహెచ్.వి. బృందావనరావు, దేవీనగర్, విజయవాడ, 35. గురజాల వరలక్ష్మి, ఉప్పలి, తూ.గో.జిల్లా, 36. ఎస్. అబ్దుల్ అజీజ్, పెద్దమందడి, మహబూబ్‌నగర్ జిల్లా, 37. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 38. ఎన్. జగన్మోహనరావు, కరీంనగర్, 39. ఇందన మల్లిఖార్జున్ రావు, ఏలూరు, 40. చుండూరు అప్పల నరసింహం, బాచుపల్లి, హైదరాబాద్, 41. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 42. కోట లలిత, లక్ష్మీనగర్, సికింద్రాబాద్

# చతురంగం - 10 ఆధారాలు

## అడ్డం

1. నటి, నాగార్జున భార్య (3)
3. వెల, భూమి (2)
4 కట్టు.. ముడి.. సంకెల (3)
7. నమస్కారం (3)
9. పువ్వులలో ఉండే తేనె (4)
10. ఏనుగు (2)
11. గది.. అల్మారాలో ఒక భాగం.. సగం (2)
12. మూడు పూటల్లో చివరిది కనుక కాస్త సాయం అవసరం (4)
13. గాంధీ మహాత్ముడే, చివర గౌరవవాచకంతో (3)
16. నాడు, నేడు, తర్వాత ... (2)
18. తీపికి వ్యతిరేకం.. అందుకనే చుర్రుమంటుంది (2)
20. '... జీవాలు' జంటపదంలో మొదటిది, శక్తి (2)
21. ... కాని వాడు మోక్షగామి కాడు (2)
23. విశిష్టాద్వైతుల ప్రధాన పుణ్యక్షేత్రం (4)
24. నడక కాదు, అల్లు అర్జున్ సినిమా (3)
25. ఒకటి కాదు, రెండు (2)
26. తోకలో విషం పెట్టుకు వచ్చింది అటు నుంచి (2)
28. రావణాసురుని నగరమే.. కానీ గజిబిజి (5)
30. 'ఉన్నాయి'కి వ్యతిరేకం.. అటు నుంచి (2)
32. ఇటు నుంచి పోస్టు.. అటైతే గీతం.. (2)
34. ఎక్కువగా (3)
35. అటు నుంచి అల్లుకున్న పూలతీగెలు (3)
36. కథ చెప్పేవాడు గజిబిజి అయ్యాడు (4)

## నిలువు

1. జనలోక్‌పాల్ కోసం ఉద్యమించిన సామాజికవేత్త (5)
2. భిన్నంలో పైన ఉండే సంఖ్య (2)
3. డబ్బే (2)
4. జిగురు (2)
5. కొండ, ధరించు, శుక్లాంబర - - విఘ్నం (2)
6. సంతోషం (2)
8. నలమహారాజు భార్య (4)
9. యంత్రమే (2)
11. స్త్రీలకే కాదు కవిత్వానికీ మరింత అందాన్నిచ్చేది (4)
14. రామకృష్ణ నటించిన సినిమా.. భగవంతునికి భక్తితో చేసేది (2)
15. శోభన్‌బాబు, వాణిశ్రీలతో సినిమాగా వచ్చిన యద్దనపూడి నవల (7)
17. కారు కాని కారు (3)
19. నాటకాలు వేసే స్టేజీ (4)
22. తగులుకు వ్యతిరేకం (3)
23. 'మహాప్రస్థానం' స్రష్ట (2)
24. మహాబలిపురం నిర్మించిన రాజవంశీయులు, పాటలకు ఇవి తప్పనిసరి (4)
25. ప్రపంచం, మాలతీచందూర్ పత్రిక (3)
27. పైన తేరుకున్నది (2)
29. 'అను' కు వ్యతిరేకం.. కానీ గజిబిజి (3)
31. ముదురుకు వ్యతిరేకం (2)
33. పశువుల శాల (2)

**నిబంధనలు**

1. చతురంగాన్ని అదేపేజీలో పూర్తిచేసి పంపాలి. 2. తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. 3. గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. 4. ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. 5. ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు 6. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు ★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 10

రూ.150/- బహుమతి

గడువు తేది : జనవరి 19

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | | 4 | 5 | 6 |
| | | 7 | 8 | | | 9 | | | |
| 10 | | | | | 11 | | | | |
| | | 12 | | | | | 13 | 14 | 15 జీ |
| 16 రే | 17 | | | | 18 | 19 | | 20 | |
| | 21 | 22 | | 23 | | | | | |
| 24 | | | | | | | | 25 | |
| | | 26 | 27 | | 28 | లం | 29 | | |
| 30 | 31 | | 32 | 33 | | | 34 | | |
| 35 | | | | 36 క | | | | | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు ( ) చిరునామా : ----------------------------------------

----------------------------------------------------------------

------------------ పిన్ : ------------ ఫోన్ : ------------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 37




ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 19

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@eenadu.net

ఉత్తమ వ్యాఖ్య :

...రోజు వీడే నాకు లంచ్, డిన్నరూ!

– కాట్రగడ్డ భాస్కరరావు,
మల్లారెడ్డినగర్, సికింద్రాబాద్




## కాప్షన్ మీదే -36

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

వీడికి చావు తెలివితేటలు బాగానే అబ్బినాయి!

– పి.రామానుజాచారి, వరంగల్

వెధవది, గాలమైతే వేస్తున్నా.. వస్తే.. మీనం! పోతే.. ప్రాణం!

– బిక్కునూరి రాజేశ్వర్, పొన్కల్

అమాయకుడా! 'అవినీతి' తిమింగలాన్ని నేను. అంత చిన్న 'ఎర'కే ఆశపడతానని అనుకుంటున్నావా?

– టి.వి.ఆర్.నర్సయ్య, మహబూబాబాద్

నా పంట పండడమో.. నీ కడుపు నిండడమో!

– శ్వేతకుమార్, హైదరాబాద్ (ఈ మెయిల్)

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2012-2014 RNI/32186/78